# BHRAMARA VASINI

(Telugu novel)

ISBN : 81-86202-18-8

ప్రధమ ముద్రణ : 1966
ద్వితీయ ముద్రణ : 1971
తృతీయ ముద్రణ : 1994

సర్వస్వామ్యములు
గ్రంథకర్త కుమారులవి

వెల : సాదాప్రతి : రూ. **52/-**
లైబ్రరీప్రతి : రూ. **75/-**

DTP : PRINTIKA - VZA.
OFFSET : I.B.M. - VZA. – Tel : 72295

ప్రతులకు:
విశ్వనాథ పావనిశాస్త్రి
విశ్వనాథ పబ్లికేషన్స్
విశ్వనాథపురం - మారుతీనగర్
విజయవాడ - 520 004.

భ్రమరవాసిని

# ఒక్కమాట

మా నాయనగారైన విశ్వనాథ సత్యనారాయణ గారు రచించిన యశో వతి, పాతిపెట్టిన నాణెములు, మిహిరకులుడు, సంజీవకరణి, కవలలు, భ్రమ రవాసిని అన్న ఆఱు కాశ్మీర రాజవంశ నవలలలో ఈ "భ్రమరవాసిని" ఆఱవది.

ఈ నవల రచనా కాలం 1966. మా నాయనగారు తాను ఆశువుగా చెపుతూ ఉండగా, ఆయన శిష్యుడైన శ్రీ పేరాల భరతశర్మగారు లిపిబద్ధం చేశారు. దీని మొదటి ముద్రణ గాయత్రి పబ్లిషర్స్, విజయవాడ వారు వేశారు.

విశ్వనాథ వారు జన్మించినది 1895 సెప్టెంబరు 10న. కృష్ణాజిల్లా నందమూరు గ్రామము వారి స్వస్థలం. వారి తల్లిదండ్రులు పార్వతీ శోభ నాద్రులు.

1994-1995 వారి శతజయంతి సంవత్సరం. ఈ సందర్భంగా వారి సాహిత్యమంతా శతజయంతి సంపుటాలుగా తెస్తున్న మా యీ కృషిని సహృదయులు మనస్ఫూర్తిగా ఆశీర్వదిస్తారని ఆకాంక్షిస్తూ-

విశ్వనాథ పావనిశాస్త్రి

# ప్రథమభాగము

## ప్రథమాధ్యాయము

## 1

అది శోభనపుగది. అర్ధరాత్రము దాటినది. తత్పూర్వము వేడుకలు మొదలైనవి జరిగినవి. రాజ వృద్ధ సువాసినులును, బ్రాహ్మణుల ముత్తైదువులును వచ్చిరి. వారు సమీపమునందుండిరి. యువతులయిన రాజ భార్యలును, దుహితలును తెరల చాటుననుండి వినోదములు చూచిరి. బ్రాహ్మణ స్త్రీలు పాటలు పాడిరి. వృద్ధక్షత్రియస్త్రీలు కొలదిగా పరిహాసములు, మరి కొన్ని భార్యాభర్తృ సమాగమలీలా ప్రోత్సాహక వచనములు సలిపిరి. పెండ్లి కూతురు బెరుకుగా ప్రవర్తించినది. కొన్ని యాచారములు కలవు. భార్యపంటిలో కొరికిన తములపాకు మడత భర్తయు, భర్తకొరికినది భార్యయు కొరుకవలయును. భార్యకొరికినది భర్తకొరికెను. భర్తకొరికినది భార్య కొరుకలేదు. కొంచెము సేపు చెండ్లాట యుండును. పూలచెండు. రత్నాలహారము. ముక్తాహారమును. భర్తతాను భార్యదోసిలి లోనికి విసరుటయు, భార్య తిరిగి భర్తదోసిలి లోనికి విసరుటయు, నిట్లు పదిపదిహేనుసార్లు జరుగును. ఆ సమయమునందు బ్రాహ్మణ స్త్రీలు పాటలు పాడుటయు, భార్యాభర్తలలో నెవరోయొకరు సరిగా నెదుటి వారి చేతిలో నది పడకుండ నశ్రద్ధగా విసరినగాని, దోసిలితోకాక నొంటిచేతిలో గాని, అంతకంటె తిరస్కారముగా వామహస్తముతో గాని, విసరినచో- నట్లు చేయరాదని మందలించుటగాని చేసి, పెండ్లికూతురైనచో నామె హస్తములను పట్టుకొని చక్కగా విసరి వేయించుటయు జరుగును. రాజాస్థానమునందు నాట్య విద్య యందు కోవిదలై, సభా ప్రారంభోత్సవ సూచిగా కాని, వినోదార్థముగాని, రాజునకు సంతోషము కలిగించుటకు కాని, నృత్తనృత్య నాట్యములచేత ప్రవర్తించుదురు. రాజాస్థానాశ్రిత లయిన వారకాంతలు శోభనపు గదిలో పాటలు పాడిరి. వారు పెండ్లికుమారుడు పూలచెండ్లు మొదలైన వానిని విసరుటలో నశ్రద్ధనెరపినచో పెండ్లికొడుకు హస్తములను గ్రహించి, న్యాయముగా విసరింపింతురు. మరియు దంపతులిద్దరు పరస్పరము మెడలకు జేతులకు చందన లేపనముచేసి కొన వలయును. ఆ సమయములయందు కొంత పరిహాసముగా, కొంత గౌరవాపాదకముగ, కొంత పట్టుదలగ, మొదట నెవరుపూయ వలయునన్నది ప్రశ్నపుట్టును. ఆడపిల్ల వైపువారు తొలుత పెండ్లికొడుకే చేయవలయునందురు.ఈ చిన్న ప్రశ్న యుదయించి కొంత చర్చజరిగి చివరకు గంధపూత జరుగనే జరుగలేదు. పురోహితుడు వచ్చి కొన్ని మంత్రములు చదివి యక్షంతలు వేసి వెడలిపోయెను. వృద్ధరాజస్త్రీలు, యువతులయిన రాజభార్యా దుహితృస్నుషలు కొంత వినోదము జరిగిన తరువాత బ్రాహ్మణస్త్రీలతో కలిసి నిష్క్రమణము చేసిరి. పెండ్లికూతురు తల్లి

పానుపు మీదినుండి పెండ్లికూతురును తీసికొనిపోయెను. అప్పటి పెండ్లికూతురు సర్వము జరీతో నేయబడి, అంచుల యందు రత్నములు కుట్టబడి, పెళపెళ లాడుచున్న చీరను వినోదమునకు, శోభకు, సౌందర్యమునకును, నతిశయోత్సవ సముద్యోతత కొరకును ధరించెడు చీరను ధరించినది. ఆమె శరీరమునందు నడుమునందు పాదములయందు నాసా శ్రవణ ఫాలాంకములయందు కంఠమునందు ధరించినభూషణములు దీర్ఘ కనక పట్టములతో చేయబడి, శరీరగత సుకుమార సంధి బంధములను, మృదు సన్నివేశములను చక్కగా కప్పియుండెను. ఆ భూషణము లున్నంతవరకు శరీరావయవ యథేచ్ఛాచాలనము జరుగదు. శరీరగతసంధులు సంధిత్వానుకూల మృదుచాలనమునకు వీలీయవు. ఆభూషణములను, ఆ చీరను తొలగించి కూతురును స్వల్పాభరణ భూషితురాలిగా మెత్తని తెల్లని సన్నని జరీయంచు గల పట్టుచీరను దరింపజేసి, మరల బంపుటకు తీసుకొని పోయినది. గదియంతయు నిఃస్త్రీకమైనది. జవ్వాది పునుగు కస్తూరి అగురు కుందురుష్కము మొదలయిన సుగంధద్రవ్యముల యొక్క వాసనతో శోభనశాల యంతయు, త్రాచులు సంగమువేళ పెనవేసికొనెడు పింపిళ్ళ కూతలతో, మృదుసమీర సమాపూర్ణ వంశీ రంధ్రసముద్గత సుకుమార హేలావినాదానుకారి నిస్వనములతో నీల వర్షా పయోధర దర్శనాహత సంరంభ సంరంభి మేఘనాదానులాసిక మృదుకంఠ నిష్ఠ్యూత షడ్జస్వరాంత ప్రతిస్వాన సన్నిభ నినాదములతో నిండి యుండెను.శోభన శాలా కించిద్దూర దేశమున వైణికుడొకడు వీణ వాయించుచుండెను. ఆ ధ్వని గదిలోని కా రీతిగా వినవచ్చుచున్నది. శాలయొక్క వెలుపలి చావడిలో సుకుమార మంజీర నిస్వనములు, నిబిడ కంకణనిక్వణములు, బిగ్గరగా వినుపించునేమో యన్న భయముతో తగ్గించి చేసిన నవ్వులు, రహస్యాలాపజనితా విస్పష్ట వాక్యములు నుండియుండి వినిపించుచుండెను.

పెండ్లి కూతురు శాలా నిర్గమనము చేసి పదినిమిషములైనది. పెండ్లికుమారుడు పానుపు మీద నొక్కరుడును విశ్రమించియున్నాడు. విశ్రమించి యుండెనో, పెండ్లికూతునకై ప్రతీక్షించుచుండెనో, మరియు వివాహ విషయికములు వధూకృతములునైన విచిత్రములైన సమాచారము లనుభవించుచుండెనో తెలియదు. గందపూత నెందు కంగీకరించలేదు? తన స్పర్శను పరిహరించినదా? వివాహ సమయమున గూడ చందనలేపము జరుగలేదు. చందనలేపమే కాక శరీర సంస్పర్శ కలుగునన్న యే యాచారమును నడువనీయలేదు. కాదని ప్రేమరహితురాలా? హేలగా తనవంక చూచెను. లజ్జగా కను కొలకుల తిలకించును. శృంగార రససూచి, మందహాసాంకూర వారిరాశి, వేలాధూత వదనాంచలమున కాంతులు వెల్లి విరియించును. పెండ్లికుమారునకు- రాజుల యిండ్లలోని పెండ్లిండ్లకు, లోకములో తదితర గృహములలోని పెండ్లిండ్లకు భేదము తెలియును. ఆయన సామాన్య యిండ్లలోని పెండ్లిడ్లు కొన్ని చూచెను. ఎక్కువ యాచారములు వధూవరుల పరస్పర స్పర్శ జరుగుట కేర్పడినవే. తత్సుఖ ప్రథమ పరిచయ ప్రాప్తి హేతుకములుగా, తదనంతర మహాసుఖసాధన ప్రాప్తి హేతువులైన సోపానములుగా నిర్మింప బడినవే. అంతటి సర్వంకషమైన యాచారప్రాబల్యము రాజుల యిండ్లలో వివాహ సమయములయందు లేదు. ఇచ్చటి స్త్రీలంతఃపుర స్త్రీలు. వీరి లక్షణములు వీరి యాచారములు వేరు. కేలుకేల్పూని యగ్ని ప్రదక్షిణములు సేయుట, పల్యంకికా పర్యంతము నడచుట, అగ్నిహోత్ర సేవాకాలమునందు మిగుల సన్నిహితముగా

కూర్చుండుట, మొదలైన వానిలో నెన్నో విషయములు వైదికక్రియా కలాపమునకు, దూరదూరమగుచున్న క్షత్రియవివాహోత్సవమునందు, దూరదూరములగు చున్నవి. ఐనను తన యీ వివాహమునందు వానిలో గొన్ని సమాచరింప బడినవి. పెండ్లికూతురు తనవంక హేలగా చూచును. తనయందు ప్రేమగా చూచును. ఆమె తనవంక ప్రేమగా చూచుచున్నదని తా ననుకొనును. వెంటనే తన మనసులోనుండి ప్రేమయన్న శబ్దములొలంగి, దయయన్న శబ్దము దాని స్థానము నాక్రమించును. అగును. దయయే. ఆమె యెక్కడ? తా నెక్కడ? తాను చాలమంది స్త్రీలను చూచెను. పలుమంది రాజభార్యలను చూచెను. రాజదుహితలను చూచెను. లోకోత్తర సౌందర్యవతులని పేర్పడిన యువతులను చూచెను. స్త్రీలేమి? పురుషులేమి? శరీర ధారణము ప్రధానలక్షణము; కరచరణాద్యవయవములు, నడుము, వక్షము, కంఠము, శిరస్సు, నాసికావదననేత్ర కపోల శ్రవణములు, ఫాలము, శిరోజము, ముంగురులు, బాహువులు, ముంజేతులు, చేతులు, వ్రేళ్ళు, మడమలు, పిక్కలు, శిలమండలము, ఊరువులు, వీ మొదలయిన వాని సన్నివేశమే కదా శరీరమనగా!. వీని యొక్క విన్యాసమే తత్తత్ప్రదేశ సౌందర్యముగా చెప్పబడును. తద్వ్యాపచారిమ సౌందర్య స్ఫోరకము. పురుష శరీరవిన్యాస వైఖరి స్త్రీల కెట్లుండునో తెలియదు. స్త్రీ శరీర విన్యాసవైఖరి పురుషులకు తెలియును. తాను పురుషుడు. అయినను సర్వ పురుషులకు సర్వ స్త్రీజన శరీర విన్యాస రామణీయకము తెలియుననుటకు వీలులేదు. స్త్రీయందొక విలక్షణమైన యవయవ విన్యాసవైఖరి తనకు ప్రియమైనది. అట్లే కొందరు స్త్రీలు మిక్కిలి రూపవతులని పురుషులు చెప్పుటయు, తాను వారిని దర్శించుటయు, వారు చెప్పినంత లేదనుకొనుటయు, జరిగినదికదా! అంతియకాక తానొక స్త్రీని చూచి యామె రూపవతి యనుకొనుటయు, తక్కిన పురుషులలో కొందరు తనంత యనుకొనక పోవుటయు, తాను మహారాజుకావ తనమాట కాదనుటకు వీలులేక కృతకహాస కృతాంగీకారముగనో, అధికప్రశంసా రూపకముగనో, వారు తనవలె ననుకొనక పోవుట తనకు తెలియును. ఇది చమత్కారము. తా నొక స్త్రీని చూచును. ఆమె సౌందర్యవతి యనుకొనును. పరీక్షించి విమర్శచేసినచో నామె సౌందర్యము తత్కాంతా శరీరగత పరిమితావయవ సన్నివిష్టమైయుండును. ఆమె కన్నుల కాంతి కొట్టవచ్చినట్లుండును. ఆమె సౌందర్యమంతయు నా నేత్రములలో నుండును. కాని ఆమె నాసాధరకపోల ఫాల శ్రవణములు, నేత్రములయొక్క సౌందర్యమును, తక్కువ పరచవు. వానియందుకూడ నొక సామాన్యమైన చారుత్వముండును. అందుచేత నామె సౌందర్యవతి యనిపించును. మొగమునందు కన్నులెంత యందముగా నున్నవో, కపోలాదులు కూడ నేనికవి యంతంత యందముగా నున్నచో, నా సౌందర్యము పట్టశక్యమా? అంతటితో నైనదా? తక్కిన శరీరమంతయు నున్నది. తక్కిన యవయవము లున్నవి. అవి యన్నియు దేనికది పరమ రమణీయమయినచో నా సౌందర్యము దేవతా లభ్యముకాని, మానవ స్త్రీ సమాసన్నము కాదు. అప్సరస్త్రీలని చెప్పబడుదురు. వారు దేవతాస్త్రీలు కనుక మహా సౌందర్యవతులు. ఇంద్రుని భార్యయైన శచీదేవి వారి కంటె నందగత్తెయైయుండును కదా! అందరికంటె పార్వతీదేవి యొక్క సౌందర్యమెట్లుండును? లోకములో పురుషులందరికంటె మన్మథుడు సౌందర్యనిధానమని చెప్పుదురు. తన్ను కన్నతండ్రి వైకుంఠాధిపతి కంటె నందగాడా? అట్లే స్త్రీలలో రతీదేవి మహాసౌందర్యవతి. ఆమె పార్వతీదేవి కంటె నందకత్తెయా? సరస్వతీదేవి యొక్క సౌందర్యము నెక్కువ

నభివర్ణితము కాదు. కాని లక్ష్మీదేవి యొక్క సౌందర్యమునకు, పార్వతీదేవి సౌందర్యమునకు వారడి యుండదేమో? ఆ దేవతా మూర్తులయొక్క సౌందర్యము యేకదేశగతమైనదిగాదు. అన్ని యవయవము లెట్లుండ వలయునో నట్లుండెడివి. ఇట్లుండవలయునన్న నిశ్చయము మాత్రమెవరికి తెలియును? కొన్ని మానవబుద్ధి కలితమయి యుండును. కాని భగవంతుడు మానవుని సృష్టిచేసినప్పుడు వానియంతవానికది తెలియకపోయినను, దర్శనవేళయందు, బోధనవేళ యందు, వానికి దెలిసెడినట్లు చేసినాడు. తన భార్యయైన యీ పెండ్లికూతురి యొక్క శరీరావయవ విన్యాసవైఖరులు చూచినచో రతీదేవివో, పార్వతివో, లక్ష్మివో నన్నట్లున్నది. అందుచేత నామె తనవంక చూచిన చూపులు ప్రేమభరితము లనుటకంటె, దయాన్వితములనుట యుచితము. అందుచేత నతనికి ప్రేమయన్న మాటకుబదులు దయయే స్ఫురించెను.

# 2

మరల నా పెండ్లి కొడు కిట్లూహించ నారంభించెను. ఆమె పరస్పర చందన చర్చలను పరిహరించెను. అనగా నామె శరీరముతో నన్ను స్పృశింపరాదు. నా శరీర స్పర్శయామెకు కలుగరాదు. స్పర్శమాత్రమున నేమిపోయినది? మేము రాజులము. మేము ధరాపతులము. మమ్మందరును స్పృశింపరాదు. స్పృశించనీయము. ఎవనిస్పర్శ యైనను మాకుదగిలినచో మాకు కోపము వచ్చును. లోకమునంద ధికారులందరు నింతియే యనుకొందురు. లోకముపరస్పరము ద్వివిధముగా పరిహరించును. ఆవలివాడు మడ్డివాడు. వాని శరీరము దుర్గంధి, వాడు వ్యాధిగ్రస్తుడు. ఒకటి యసహ్యము చేత, రెండు సంపర్కముచేత కలిగెడి వ్యాధిభీతిచేత, మొదటి పరిహరణము. రెండవది తా నధికుడనని, యల్పుని సంపర్కమును పరిహరించును. ఈ యాధిక్యము వంశగౌరవముచేత, ధనత్వము చేత, అధికారముచేత, విద్యాగర్వముచేత సంభవించుచున్నది. ఇంతకంటె కూడ వేరొక లోతైన హేతువును పండితులు చెప్పుదురు. ఏ జీవునకా జీవుడే. ఎవని సంసారము వానిదే. లోకవృత్తము ననుసరించి పదిమంది సమావేశపడినప్పుడు స్పర్శాదికము తప్పదు. అందుచేత నిత్యస్పర్శ మంగీకార్యమా? శరీరములందు జీవులున్నారు, ప్రాణములున్నవి. అగ్నియున్నది. అగ్నియనగా విద్యుత్ప్రవాహము. దేనిలక్షణము దానిదే. నీ శరీరమునందు ప్రవహించు విద్యుత్ప్రవాహ లక్షణము వేరు. పరుని శరీరమునందు ప్రవహించుదాని లక్షణము వేరు. అవి రెండును విలక్షణములయినవి. వాని సంపర్కము దుష్టఫలము నిచ్చును. ఆ ఫలము స్థూలముగా దృశ్యమానమగునది కాదు. ఈ సృష్టియందు శరీరములొక్కటే దృశ్యమానములు. తక్కినవన్నియు నదృశ్యములే. ప్రేమ, గౌరవము, నధికారము, వంశమర్యాద, కీర్తి, యపకీర్తి, మంచితనము, చెడ్డతనము మొదలైన లోక వ్యవహారచాలకములయిన సర్వవ్యవహారములు దృశ్యమానములుకావు. అన్నియు కొన్ని సూచనలచేత, కొన్ని లక్షణములచేత నూహింప బడెడివేకాని, కన్నులతో చూడ బడెడివికావు. అట్లే పుణ్య పాపములును. ఈ గుణములన్నియు నూహింప బడినవేనా? వానికొక భావము కలదా? అనగా స్థితి కలదా? ఆ స్థితికి నూహయే

ప్రధానమైనదియా? మరి వేరొక లక్షణమున్నదా? అవి పదార్థములుకావు. గుణములు. పదార్థమెట్టిదో గుణమట్టిదే. గుణముయొక్క స్థితి, పదార్థముయొక్క స్థితివంటిది కాదు. పదార్థము నేత్రేంద్రియమునకు గోచరించును. గుణము మనస్సన్ననింద్రియమునకు గోచరించును. గోచరత్వ లక్షణము రెంటికి సామాన్యము. గోచరత్వ లక్షణము దేనికున్నదో దానికి స్థితి యున్నదని యర్థము. అందుకనియే ప్రత్యక్షమనగా పంచేంద్రియ గోచరత్వ లక్షణము కలదని యర్థము. బ్రాహ్మణులొకరి నొకరు స్పృశించరు. వారు రాగిచెంబులతో పానీయము సేవింతురు. సంతర్పణము మొదలయిన సమయములందు జల పూర్ణము లైన రాగి చెంబులను నడుమ నుంచికొందురు. రాగి విద్యుత్కిరణ గ్రహణశీలమైన లోహము. ఇట్లు వారు ప్రత్యక్షస్పర్శమాత్రమే కాక, స్వశరీరస్థ విద్యుత్కిరణ మిశ్రణమును కూడ పరిహరింతురు. పురుషులు- సత్పురుషులు పరస్త్రీ స్పర్శను పరిహరింతురు. స్త్రీలు పరపురుష స్పర్శము పరిహరింతురు. ఈ స్పర్శా పరిహరణమునకు రెండు హేతువులు కలవు. ఒక స్త్రీ యందు తన భర్తృ శరీరగత స్పర్శ సంజాత లక్షణములు లీనమై, వాని శరీర రక్తమునకు తన శరీర రక్తమునకు సన్నిహితత్వ మేర్పడి, రక్తము గుణనిష్ఠముగనుక, నా స్త్రీయందు సంభవించు శిశువు తదుభయసంసర్గ జనితమైనది, తదితర సంసర్గ లక్షణ దూరముగా నుండును. ఆ శిశువు యొక్క లక్షణము దానిదిగా నుండును. సృష్టి స్త్రీ పుంసయోగోద్భవ కనుక నిది తప్పదు. ఇది మొదటి కారణము. సృష్టి యచ్ఛముగా నుండవలయునన్నచో తొలుత నిది రక్షింపబడవలయును. రెండవది శృంగార రసదృష్ట్యా యాలంకారికులు పది యవస్థలు చెప్పుదురు. మొదటిది దర్శనము, రెండవది మననము. తరువాత స్పర్శయున్నది. ఈ లోకమునందు క్రమముగా చెప్పబడిన యొక వరుసలో తొలుతటిది లోపించి నడుమనెక్కడో ప్రారంభించి, క్రమము చెడినను ఫలమునందు వైయ్యర్థ్యము కలుగుట యుండకపోవుట యున్నది. తొలుత స్పర్శ జరుగును. దానిని బట్టి దర్శన మననములు లుప్తములయినవి క్లుప్తములు కావచ్చును. అందుచేత స్త్రీలు పరపురుషస్పర్శను పరిహరింప వలయును. ఒకానొకప్పుడు అపరిహరణీయముగా జరిగినచో, దానిని నిరాదరింపవలయును. ఎవ్వతె తన మనస్సు తన దగ్గరనుంచుకొనగలదో, యామె హఠాత్సంభవమైన యే తత్స్పర్శాది దోషముల పరిహరింపగలదు. తొలుత స్పర్శఘటిల్లినది. స్పర్శయందు సహజముగా నొక మనో నిష్ఠమైన సుఖానుభూతి కలదు. తరువాత దర్శనము జరిగినది. ఆ దర్శనము ప్రియముగా లేదు. వాని ముఖవైఖరి తనకు నచ్చలేదు. ఈ స్పర్శ జన్యమైన సుఖాసుఖ భావము త్రుటితమైనది. అట్లుకాక దర్శనము హృదయాకర్షకముగా నున్నది. అప్పుడొక యాపత్తి జరుగుచున్నది. స్పర్శనము కంటె పూర్వము దర్శనము జరిగినచో, దర్శనమునందొక సుఖాసుఖభావము కలిగినచో, సుఖభావము జీవలక్షణమై, అసుఖభావము- వాడు పర పురుషుడు, తద్గత ప్రేయమైన భావము పరిహరించవలయున్నభావము చేత సుఖాసుఖ భావము కలుగును. అప్పుడు నేత్రములకు ప్రియమైన తద్దర్శనము సుఖమును తొలగబెట్టి, యసుఖమునే స్థాపించుకొనును. ఈ స్థాపించుకొనుట తేలిక. దర్శనాత్పూర్వము స్పర్శ జరిగినది. స్పర్శయందు సుఖాసుఖ భావములు రెండును కలవు. సుఖభావము కొంచెము మొగ్గుగానున్నది. అప్పుడు దర్శనము జరిగినది. దర్శనము ప్రియముగా నున్నది. వాని యాకృతి విశేషము రమణీయముగా నున్నదని యర్థము. మరల నిచ్చట

సుఖాసుఖములున్నవి. ఇచ్చటి సుఖము పెచ్చుగా నున్నది. రెండును కలసి బలమగుచున్నవి. బలమై కామభావమునకు దోహదము కలిగించుచున్నవి. యోగులయిన వారు వీనిని గెలువ గలుగుదురు. కాని తక్కినవారు గెలువలేరు. మిథ్యావాదన శీలురు యథేచ్ఛముగా మాటాడుదురు. ఇది స్పర్శ తత్త్వము. బుద్ధిమజ్జాతి, స్పర్శను పరిహరించును. స్పర్శను కొండాడదు. ఈమె బుద్ధిమజ్జాతియా? నే నబుద్ధిమజ్జాతియా? ఇది యిట్లుండగా మా ఇద్దరికి వివాహముజరిగినది. భార్యాభర్తల నడుమ నీ స్పర్శ తత్త్వవిచారణలేదు. వారి జీవనములు కలియుటకు, వారి రక్తములు కలియుటకు, వారి వర్తమాన భవిష్యత్తులు కలియుటకు వారి సంతానము దయభయగుణభూయిష్ఠమగుటకు స్పర్శమొదటిలక్షణము. అందుకనియే వివాహముల యందు సహజలజ్జా ప్రథమ సోపానారోహణము కొరకు స్పర్శబాహుళ్యముగల సన్నివేశములు సృష్టించ బడినవి. పెండ్లిపీటల మీద వధూవరులిద్దరు కూర్చుందురు. భర్త స్పృశించును. ఆమె పరిహరించదు. ఈమె పెండ్లిపీటల మీద మత్స్పర్శాను కూలముగా కూర్చుండనే లేదు. తత్కాలస్పర్శ, వినయలజ్జా కక్ష్యలను దాటకుండ భార్యా భర్తలు సంతరించు కొనవలసినది, యాదృచ్ఛికముగా జరిగినట్లు సహజముగా జరిగినట్లు దానిని గురించి యూహించనేలేదన్నట్లు ప్రేమగల వధూవరులు నటింతురు. పొంతన పరచుకొందురు. ఆమె నాకెంత దూరముగా కూర్చున్నదన్నచో నేను వినయలజ్జల పరిత్యజించి కాని, యామెను స్పృశించుటకు వీలులేదన్నంత దవ్వున కూర్చుండెను. భార్య-భర్తృస్పర్శ నెంత పరిహరింపనెంచి నను రెండు వేళలు దాటరానివి. మొదటిది మంగళసూత్ర బంధనవేళ, అరక్తుడైన భర్త స్త్రీయొక్క మెడతాకకుండగనే పై పైనే ముళ్లు వేయవచ్చును. రక్తుడయినవాడు తద్వ్యాజమున భార్యాకంఠోపరి భాగమును వీలైనంతవరకు స్పృశించును., నఖములామె కంఠత్వక్కునందు గ్రుచ్చుకొనునట్లు కూడ చేయవచ్చును. మా వివాహ సమయమున నిప్పుడు జ్ఞాపకము వచ్చుచున్నది— సూత్రబంధనవేళ వచ్చినది, తత్పూర్వము మధుపర్కములు ధరింపించుటకు నామె తీసికొని పోబడినది. తీసికొనపోబడిన స్త్రీవేరు, తీసుకుని రాబడిన స్త్రీవేరు. తత్పూర్వ మామె మందహాస సుందర వదనారవిందాభి రామమూర్తి. వర్షాకేకి పింఛసదృశ నీలకేశాభిరామ. సర్వావయవ పరిస్పందిత మధుర మధుర యౌవనరేఖా నటల్లీలా పరమ రమణీయమూర్తి. చకచ్చకిత గమనరేఖా తిరస్కృత మత్తదంతావళ పరిస్ఫురితహేలా జగదభిరామశీల. హఠాల్లుఠత్త్వావారాంచల సంచలద్వాయు తరంగరింగణ భృంగీనినాద సంగీత శృంగారమూర్తి. తిరిగివచ్చునపుడు రాతిబొమ్మవలె వచ్చినది. చెలికత్తెలు తీసికొని వచ్చిరి. ఆమె నడచుచున్నదోలేదో తెలియలేదు. బుజములమీద మోసికొని వచ్చిరేమో తెలియదు. చీరను ధరించిన స్త్రీ వలె లేదు. చీరను చుట్టిన బొమ్మవలె నుండెను. చూచుటకామెయే. ఆకృతి విశేషమున నేమియు భేదములేదు. సూర్యుడే! గ్రీష్మవేళా మధ్యాహ్నసూర్యుడు వేరు. మేఘచ్ఛటాపిహిత మూర్తివేరు. ఆ భేదము నాకిప్పుడు గోచరించుచున్నది. అప్పుడు గోచరింపలేదు. ఇప్పుడు గంధపూత నివారించుట నాకెంత బాధాజనిత హేతువయ్యెను? ఇందుచేత వెనుదిరిగి చూచుకొంటిని. జీవునియొక్క మాయా లక్షణమువేరు. అనుభవించువేళ దాని రామణీయకమో, తిరస్కృతి లక్షణమో తెలియదు. తదనంతర మనన సమయముననవి నివృత్తములగును. అప్పుడు నేనామె కంఠమున సూత్రబంధనము చేసితిని. ఆమె మెడను స్పృశించితిని. ఒక పరమ

జగన్మోహనాకారయైన స్త్రీని స్పృశించినట్లే లేదే! పైగా నేనప్పుడు భావించలేదేమో? అప్పుడొక విచిత్రమయిన సంఘటనము జరిగినది. ఎచ్చటినుండియో ఒక గండుతుమ్మెద వచ్చి వివాహమంటపమున ఝొంయిమని యాదుచు శాలా మందిరమున పరిభ్రమించ నారంభించెను. వివాహమంటప ప్రదేశమునందాసీనులై యున్న వారెవ్వరు? మహారాజులు, మంత్రులు, సేనాపతులు, యోధాన యోధులు, గండర గండలు, శత్రువుల గుండె నెత్తురులు తీయువారు. వారందరా తుమ్మెదకు భయపడుటయేమి? ఆ బంభరము వచ్చి తమను కుట్టునన్న భయమా? ఆ ద్విరేఫము కూడ శాలాకాశోపరిభాగమున పరిభ్రమింపక వారి శిరః ప్రదేశములకు దిగుచు లేచుచు సంచరించ నారంభించెను. ఇంతలో నొక ఖడ్గవీరుడైన భటుడు దానిని పట్టుకొనుటకు ప్రయత్నించెను. వానికది దొరకలేదు. అందరు రాజులలో, మంత్రులలో, సేనాపతులలో, వాడు దానిని పట్టుకొనుటకు వీలుకలుగలేదు. అంతలో వాడు మూర్ఛపడిపోయెను. వాని నా తుమ్మెద కుట్టెననిరి. నేను సూత్రబంధన కార్యము నిర్వర్తించుట యైపోయెను. మరల నెదురుగా నున్న పీఠమునందాసీనుడనైతిని. ఆ భ్రమరి యేదూలముయొక్క ప్రక్క నంటుకున్నదో, యే గోడ గూడులో దాగికొన్నదో, మరల కన్పించలేదు. సూత్రబంధనవేళ యిట్లయినది. తలంబ్రాల వేళ మిగిలినది. అప్పుడు స్పర్శమున కెక్కువ ప్రసక్తి లేకపోయినను, మృదూత్సాహ మందహాస ప్రత్యక్షదర్శన శరీరోద్ధానకర విధృత సంచాలన ప్రముఖ కార్యములచేత వధువు యొక్క హృదయగత వాంఛా సర్వస్వము బాహిరమగును. ఆ పని యంతయు చెలికత్తెలు చేసినట్లున్నది కాని, యామెచేసినట్లులేదు. ఈమె నా యందనురక్తురాలు కాదు. నా స్పర్శనే పరిహరించుచున్నది. ఏమి దుర్వ్యాఖ్యానము చేసికొనుచుంటిని? వీరాధివీరులైన రాజకుమారులు రాగా వారి నందరిని పరిహరించినది. నన్ను వరించినది. అందరిని తిరస్కరించి నాపేరు చెప్పగా నంగీకరించినది. నే నతనినే వివాహమాడుదు నన్నదట.

# 3

ఆయన యెంత నిలువద్రొక్కి కొన్నను తిరిగి తిరిగి ఆ భావమును దృఢీకరించి కొనవలసివచ్చుచుండెను. ఈ యొక్క స్పర్శ పరిహారమును పరిహరించినచో, నామె తనయందేమి వ్యతిరేకముగా ప్రవర్తించినది? ఆమె యంగీక రించినది. ఆ వార్త తనకు వచ్చినది. ఆ వార్త యెట్లువచ్చినది? అవును, తదంగీకార వార్తాపత్రముతోపాటు ఆమె యొక్క భూషణము వచ్చినది. అది యామె శిరోభూషణము. ఆమె తలలోని చంద్రవంక. వార్తదెచ్చిన వారేమి చెప్పిరి? ఆ చంద్రవంక ఆమె జన్మించినదాది యామె శిరస్సు మీదనే యున్నదట. దానినామె తన చేతితో తీసి యాపత్రికలో మడచి ముడిచి పెట్టినదట. జన్మించినదాది యన్నప్పుడు తానువిని నవ్వెను. చంద్రవంకలో జన్మించినదా? తల్లిదండ్రులు లల్లారుముద్దుగా పిల్లకు పదియవదినముననో నెలలోపలనో కృత్రిమముగా నీ చంద్రవంకను శిరమునందొక భూషణముగా నేర్పాటు చేసిరనుకొందము. తదాది యామె దానిని పరిహరింపలే దనుకొన వలయును. మరియు చంద్రవంక తను చూచునాటికి పదునారు పదునేడేండ్ల యువతి శిరస్సునందు ధరించు భూషణముయొక్క ప్రమాణము కలది కాని,

పసిపిల్లలకు ముద్దుగాతలపై పెట్టెడి చిన్న నగవంటిదికాదు. చిన్నప్పటినుండి దానిని దరించుట యెట్లు? ఈ సందేహము కలిగినది. తానెవ్వరితో ననలేదు. కాదో! ఏడెనిమిదేండ్లప్పుడే నగ చేయించ వచ్చును.తల్లిదండ్రులు చిన్నపిల్లలకు నగలు చేయించు నప్పుడు కొంత వయసు వచ్చిన తర్వాత కూడ పనికి వచ్చునన్న యూహతో పెద్దగనే చేయింతురు. అప్పుడు మరల మార్చి చేయించవలసిన యవసరముండదు. ఈ చంద్రవంక కనకమయము కాదు. ఇది యొక రత్న శలాక. చంద్రవంక యొక్క ఆకృతితో కనకమయ భూషణము చేయించి, దానిని చంద్రవంక యందురు. అప్పు డాకార సామ్యము చేతనే దానికా పేరు. ఇది రత్నశలాక యగుట చేత నాకార సామ్యమేకాదు ధవళిమ యొక్క సామ్యముకూడ కలదు. ధవళిమయేకాదు, కాంతి ప్రసార శీలత్వ సామ్యతయు కలదు.తద్దర్శనారంభమునుండి నేటివరకు నా చంద్రవంకను చూచినపుడెల్ల తనహృదయము ప్రసన్నమగుచుండును. ఇది యొక మహాధర్మమన్నది, అధికముగా కన్పించు చున్నది. ఎన్ని రత్నములను తానుచూచుటలేదు? వాని దర్శన మాత్రమున హృదయము ప్రసన్నమగు చున్నదా? పెండ్లి పీటలమీద తా మిరువురును కూర్చుండిరి. కొంత కలాపము జరిగిన తరువాత నిద్దరెదురుబదురుగా కూర్చుండిరి. అప్పుడు తాను తన యుడుపులలోదాచిన ఈ చంద్రవంకను తీసి యామె కనులకు గోచరింపచేసెను. ఆమె కనులెత్తి తనవంక వోరగా చూచెను. ఆ చూపులో దానిని, ఆమె జటాకలాపమునందు నుంచుమన్నట్లు తనకు గోచరించెను. ఆమె శిరోజములు కూడ చిత్రముగా మలచబడి యుండెను. ముందు పట్టిపాపటతీసి శిరస్సున కంటుకొనునట్లు దువ్వెనతో చిన్నిచిన్ని జడపాయల్లు తీర్చబడినవి. లేనిచో చంద్రవంక పాపటలో పెట్టుట కష్టమయ్యేడిది. పరిచారికా సాహాయ్యము లేకుండ నట్లుచేయుట సాధ్యమయ్యేడిది కాదు. అట్లుకాక నామెతలకట్టే జగన్మోహనముగా నున్నది. వెనుక జుట్టు దీర్ఘముగా నుండవచ్చును. మోకాళ్ళ వరకు జడ వేయుటకు వీలుగా నుండవచ్చును. కాని పాపటనుండి యిరుదెసలకు పాయగా తీయబడినచోట నంత చిక్కని జుట్టుండుట కష్టము. అంతజుట్టును పాపటయందు వదులు వదులుగా చెక్కబడినది. చంద్రవంకను సులభముగా నచట ముడుచుటకు, పాపటలోని జుత్తు– వదులునకు వదులు, చిక్కనకు చిక్కనగా నుండెను. ఆ యాభరణము తన శిరోభూషణముగా నైన తరువాత, నామె ముఖదీప్తి నాలుగింతలయ్యెను. ఆమె తన వంక నిదానించి చూచెను. తా నామె వంక నిశ్చలముగా చూచెను. ఆమె చూచిన చూపెట్లున్నదనగా "ఓయీ! నేను నీకు లభ్యురాలను కాను, నీయందనుగ్రహము చేత నిన్ను వివాహమాడు చున్నాను" అన్నట్లుగా నున్నది. త న్నిమేషాంతరమున నామెను జూడగా నామె మానుషివలె లేదు. ఆమెతోడి నా యీ సుమానుషము నాకమానుషముగా కన్పించినది. ఆమె నావంక చూచుటయే కాదు– వివాహ మండప శాలాస్థిత సర్వజనమువంక చూచినది. ఆదృష్టిని వారెట్లర్థము చేసికొనిరో తెలియదుకాని, మత్సమీప జనులైన కొందరిముఖములుచూడగా నా కిట్లనిపించినది. వారందరు భయపడిపోవుచుండిరి. వారి నేత్రములందు భీతి కన్పించినది. కాని నేను చూచినవారందరు పురోహితులు, బ్రాహ్మణులు, రాజసేవకులు. నా వెనుకనున్న మంత్రి, భూపాల, సేనానాయకులెట్లు భావించిరో నాకు తెలియదు. రాచ పెండ్లికూతుండ్రు తలయెత్తి సభవంక చూచుట జరుగదు. అట్లు చూచినచో సభలోని రాజబంధువులును సేనాపతులును సరిగా భావించరు. ఎట్లుభావించిరో నాకు

తెలియదు. రాజమర్యాదా నపేతముగా భావించినచో తరువాత నేను వారిలో నెవ్వరినో చూచినపుడు, తల్లక్షణము వారి మొగములయందు దవ్వునవైన కన్పించును. అది కాన్పించలేదు సరికదా, వారియందు నే నేదో యొక మహాభాగ్యవంతుని వలె, యొక యోగ పురుషునివలె, నేదోయొక పెన్నిధానమును గన్నవానివలె, వారూహించినట్లు కన్పించినది. నేను మహారాజును. ఆ మర్యాదయు గౌరవము వారియందు నే నెప్పుడును దర్శింతును. వారి కన్నులయందది కన్పించును. అది క్రొత్తకాదు. మరి వారి మొగములయందేదో క్రొత్త కనిపించెను. అది యగౌరవముకాదు. మర్యాదాభ్రంశము జరిగినదన్న యొక యేవగింపులోని లేశభావముగాదు. మద్భాగ్య ప్రశంశాయత్తమైనచూపే. ఆమె మరల సభవంక చూడలేదు. ఆ చంద్రవంక నామె పాపటయందు పొదిగినతోడనే యామె నావంక చూచినది సరే! సభవంక చూచుట యెందులకు? ఆ చంద్రవంకయామెకుసహజ భూషణమా? అంతవరకామెలో నేదో లోపించియున్నదా? దానితో నామె మూర్తి సంపూర్తి నందినదా? ఆమె నిత్య చంద్రశకలాభిరామ చూడాభిరామయా? తన సంపూర్ణమైన మూర్తి సర్వజనులకు తెలియజేయుట కొరకు, వివాహ పరిషత్తునంత తిలకించినదా? నాకు ప్రియమిత్రమైన మంత్రి యున్నాడు. అతని పేరు లీలా ప్రహ్లాదుడు. ఈ సంగతి నే నతనితో చెప్పగా నతడిట్లనెను. "మహారాజా! ఆమె కనులెత్తి చూచినప్పుడు నేనామెవంక చూడలేదు. అప్పుడు నేను మరియొక వైపు చూచుచుంటిని. అచట ధీరప్రహ్లాదభట్టున్నాడు. నే నాయన వంక చూచుచు నెందుకో యాయన ధీరప్రహ్లాదుడని, నేను లీలా ప్రహ్లాదుడనని నవ్వుకొనుచు ననుకొనుచుంటిని. మీరు ధీర ప్రహ్లాద భట్టును ఎరుగుదురుకదా! ఆయన వృద్ధుడు. మహాపండితుడు. వేదవేదాంగవేత్త. మంత్రసిద్ధుడని చెప్పుదురు.ఆయన సామాన్యముగా చేతులెత్తి యెవ్వరికిని నమస్కారముచేయుట నేను చూడలేదు. నే నాయనవంక చూచుచున్నట్లనుకొను చుండగా, నాయన చేతులెత్తి యెవరికో నమస్కారము చేయుచుండెను. ఆయన నమస్కరించుట కర్హమైన జనమెవ్వరని నేనాదెసకు చూచితిని. అచ్చట నెవ్వరును లేరు. తమరు పెండ్లి కుమార్తెవంక చూచుచున్నారు. ఆమె తలవంచుకొన్నది. ఆమె యప్పుడే తలవంచికొన్నదా యన్న ఊహ నాకు కలిగినది. అనగా తత్పూర్వలిప్తైక భాగమున నామె శిరస్సెత్తి యుండ వలయును" అనగా లీలా ప్రహ్లాదునితో నే నిట్లంటిని. "ఔనయ్యా! అప్పుడే యామె తలవాంచినది. ధీర ప్రహ్లాద భట్టు లామెకు నమస్కరించిరందువా? ఎందుకు నమస్కరించవలెను? అది యట్లుంచి వివాహ శాలాగతులైన మంత్రి భూపాల సేనా పతులున్నారుకదా! వారి నేమైన చూచితివా?" అనగా నతడిట్లనెను. "మహారాజా! నేను వారివంక చూడలేదు కాని, ఒక్క మొగమునందుకూడ కనుబొమ్మ వక్రించినట్లు లేదు. పెదవి చిట్లించినట్లు లేదు. నాసాపుటము బెదిరినట్లు లేదు. చెక్కిలిలో నొక్కు పడ్డట్లులేదు. అందరును నిస్తబ్ద నీరవ మహార్ణోరాశివలె నున్నారు." అనగా నా మనస్సు శాంతించినది. ఆమెకు నా మీద గల ప్రేమ మీదనే భావన సాగినది. ఆ చంద్రవంక నాకుపంపినది. వివాహ వేదిక మీద నేనా భూషణము నామె సీమంతమునం దలంకరించ వలయును. అది సర్వజన విదితము కావలయును. అందుకోసమామె సభవంక చూచెను. "నే నితని భార్యను, ఇతనిని వరించితిని; ఇతర సర్వ రాజకుమారుల నిరాకరించితిని. నే నితని నన్నుగ్రహించితిని. దానికి సాక్ష్యముగా నే నితనికి చంద్రవంక పంపి వివాహ వేదిక యందు నితని చేత నా

చంద్రవంకను, నా చూడా దేశమునందలంకరించు కొనుచున్నాను. అందరు తెలిసి కొందురుగాక!" అన్నట్లు చూచినది. అంతటి ప్రేమగలయామె నా స్పర్శనేం పరిహరించెను? ఆమెకు నా స్పర్శ కలిగినచో ఏమి యగునో? అంతటి ప్రేమగం స్త్రీ యెంత పులకరించునో? తద్వేళా తనూగత లోమకూపాంతర్భూతజలోల్బణ ప్రావిర్భావము పట్టరానిదిగా నండునేమో! దానిని సర్వజనులు చూచి పోదురు. అది చెలికత్తెలకు గూడ తెలియరాదు. ఆమెకు మత్తనూస్పర్శపరమైకాంత వేళయందు తప్ప తక్కిన వేళ జరుగరాదు. అందుచేత నామె పరిహరించియుండును. తత్తనూ స్పర్శ యెట్టిదో? తదనుభవవేళ నే నేమగుదునో? ఆమె యేమగునో? ఇంతమంది రాజకుమారులను [illegible] నన్ను వరించుటకు నేను పూర్వజన్మమూ నందే పుణ్యమును చేసితినో? ఏ క్రతువును స[illegible]ప్తి పొందించితినో? ఏ తీవ్రయోగ మనుష్ఠించితినో? వాలఖిల్యులవలె నేదో త[illegible] నవలంబించి యూగితినో?ఆ మహాసౌందర్యము నాకెందుకు లభించినది? ఆమె దర్శనమాత్రమున జనులు నిస్తబ్ధులగుచున్నారు. వారికి తమ యొడళ్ళు తమకు తెలిసినట్లులేదు. ధీర ప్రహ్లాదభట్టు నమస్కరించెనా? సౌందర్యమనగా నెట్టిదో, యదార్థమైన సౌందర్య మెంత యారాధనీయమో, కామభావ దుష్టుల కేమి తెలియును? ధీర ప్రహ్లాదభట్టు వంటి వేదవేదాంగ వేత్తలకు, వృద్ధులకు, మంత్రసిద్ధులకు తెలియవలయును. లోకములో కొన్ని మహాగుణముల యౌత్కృష్ట్యము పరాంకోటినంది పరమేశ్వర భావమును తాకుచున్నది. ఆస్థితిలో వానిని తెలిసికొనుట సామాన్యమానవులకు తెలియదు. సౌందర్యము కూడ నొక గుణమే. అది పరమేశ్వరియొక్క యింకొక రూపము. ఆమెయొక్క లక్షణము. అది యామెతో నభిన్నము.

# ద్వితీయాధ్యాయము

## 1

ఆ పెండ్లికొడుకు మనస్సు చిత్రచిత్రముగా మారుచుండును. ఆమె తనయందు మహానురక్తయని నిశ్చయమైనంతనే, లోనుండి తరంగ తరంగములుగా ప్రేమ యావిర్భూతమగుచుండును. ఆమె సౌందర్యము భావించిన కొలది తన పూర్వజన్మ సుకృత విశేషముయొక్క భావన పుక్కిలింతలగుచుండెను. వీని నన్నిటినిమించి ఆమె తనయందు ఊహించరాని ఒక దయాగుణమును ప్రదర్శించుచున్నదను భావము రూఢమగుచుండెను. ధీరప్రహ్లాదకృత నమస్కారము తన మంత్రి చెప్పినది స్మృతికి వచ్చినంతనే తాను తబ్బిబ్బగుచుండెను. ఆమె అటువంటి దైనచో తన్ను వరించుటయేమి? తన్ను వరించినదా? తనయందు దయను చూపినదా? ఈ శృంగార భావము విచిత్రమైనది. ఒక స్త్రీ యొక పురుషునియందు కామవాంఛకు అనుకూలు రాలైనచో తద్భావదాసుడై యా కామభావమునందు గౌరవము సమర్పించుచున్న పురుషవ్యక్తి, ఆమె తనయందు దయచూపుచున్నదనుట వాని దైన్య లక్షణమా? సర్వ సృష్టిహేతువైన కామభావమును దుర్జనులవలె నీచముగా చూడక జగత్తత్వవేత్తలైన మహాపురుషులవలె ఉదాత్తముగా చూచుటయా? ఆ ఉదాత్తతలో స్త్రీయందు గౌరవము

ఆపాదించుచున్నాడేమో? సృష్టిహేతుకమైన స్త్రీ పురుష సంయోగము నందు స్త్రీ పురుషులిద్దరు సమాన భాగస్వాములేనా? పురుషునియందు ఆధిక్యమున్నదా? స్త్రీయందు అనుగ్రహమున్నదా? పురుషుడు మేఘునివంటివాడు. వాడు వర్షించిపోవును. 'పర్జన్యవ ల్లక్షణ ప్రవృత్తిః' అని యొక పాణినీయ పరిభాష కలదు. యోగ్యమైనచోట వర్షించినచో ధాత్రి పండును. సస్యవతి అగును. అయోగ్య మైనచోట వర్షించినచో నిష్ఫలమగును. ఆ మేఘుడు తానిచట కురియవలెనని కురియుచున్నాడా? జలభరితుడై ఎచట తన బరువును తాను తట్టుకొనలేకున్నాడో అచట కురియుచున్నాడు. భాగ్యవశమున ఆ ప్రదేశము సారవంతమైనచో, ధాత్రి తడిసి మెత్తపడి, లోనలోన చిదిసి మెదిసి, పరమేశ్వరానుగ్రహమైన బీజములతో గదిసి, పులకరించి పాటమరించి అంకురించి ద్విదళమై పెరిగి, యానెకట్టి వెన్నివి బెంకెవదలి బిగిసి ధాన్యమగుచున్నది. శిలాప్రదేశములం దూషరక్షేత్రములందు గురిసి ఏమగుచున్నది? శిలా ప్రదేశములందు నయము. వాగుగానై మఱియొక చోటనైన పండించుటకు పోవుచున్నది. ఊషరక్షేత్రమునందు గురిసి యేమగుచున్నది? ఇంకిపోవుచున్నది. లేదా బురద అనిపించుకొనుటకు కూడ వీలులేని కచాటు ప్రదేశమగుచున్నది. తగిలినచోట గడ్డకట్టి చెక్కు తీసికొనవలసిన అవసరముకూడ లేదు. ఎండి అదే రాలిపోవుచున్నది. అది యూషర క్షేత్రముయొక్క లక్షణము. అవివక్షితముగ ననూహితముగ వర్షించుచున్న మేఘబిందువు సస్యవతియయిన ధాత్రి స్వీకరించుట వివేకహీనుడైన మేఘునందు దయ చూచుట. నిజముగా ఇది దయచూపుటయే. స్త్రీ పుంసయోగోద్భవయైన యీ సృష్టిని పర్యాలోచించిన కొలంది, స్త్రీ పురుష సంయోగము స్త్రీ యొక్క దయావిశేషముగనే భాసించుచుండును. స్త్రీపురుష సంయోగమునందు స్త్రీ యొక్క ప్రసన్నత ప్రధానము. ఈ రహస్యము తెలిసియే కాబోలు స్మృతికర్తలు, శిక్షాస్మృతి నిర్మాతలు- ప్రసన్నత మాలిన స్త్రీతోడి సంగమము బలాత్కారమని, పురుషునకు కఠినముగా శిక్ష విధించిరి. స్త్రీ పురుషులయందు పురుషుడు అంగీకరించడు. ఒకవేళ సంగమము కలుగును. ఆమె యొక్క ప్రోద్బలముచేత సంగమము జరుగును. ఆమెకు శిక్షలేదు. ఆమె అంగీకరించదు. వాడు సంగమించును. అది బలాత్కారము. శిక్షార్హము. ఇప్పుడు చూచినచో స్త్రీ యొక్క అంగీకృత ప్రసన్నత - దాని పేరు దయ. ఇది సృష్టిలోని రహస్యము. వేత్తలకు తెలియును. దానిలోని యుదాత్తతా రహస్యవిదులు, తాత్త్వికులైన వారు దానిని దయయనినారు. అందుచేత నీ పెండ్లికొడుకు- పెండ్లికూతురు తనయందు దయ వహించినదన్న భావమునందే నిశ్చల మనస్కుడై యుండెను. అంతమంది రాజకుమారుల కంటె తనయందేమి ఆధిక్యత యున్నది? తనది పెద్ద రాజ్యమా? తాను వారికంటె వీరుడా? తాను వారికంటె సౌందర్యవంతుడా? వారికంటె విద్యావంతుడా? ఆమె తన్ను వరించినది కనుక, యివియన్నీ తనయందున్నవి, కనుకనే ఆమె తన్ను వరించినదని అనుకూల వ్యాఖ్యానము చేసికొని గర్వించవచ్చును. కాని యాలక్షణములన్నియు పరీక్షాధీనములు. వారందరికంటె తానధికవీరుడును, తాను అధిక విద్యావంతుడనన్నచో అనుట సులభముకాదు. వారితో యుద్ధము చేయవలయును. గెలువ వలయును. వారితో విద్యలయందు పరీక్షయిచ్చి అధికుడ ననిపించుకొనవలయును. సౌందర్యముమాట దేవుడెరుగును. అందుచే ఆమె తక్కిన రాకుమారులను ధిక్కరించి నన్ను వరించినదనగా, అది నిస్సంశయముగా ఆమె

తనయందు దయ చూపించినదనుటయే. లౌకికముగా ఒక హేతువు చెప్పవచ్చును. ఒక యిద్దరు వ్యక్తులకు నడుమ ఒక పరస్పరాకర్షణము జరిగినది. ఎందుకు జరిగినది? దీనినే భవభూతిమహాకవి "వ్యతిషజతి పదార్థానాంతరః కోఽపిహేతుః" అని వ్రాసినాడు ఆంతరమైన నొకానొక హేతువు దీనికి కారణమని అర్థము. ఇందులోనున్న 'కః' అన్న శబ్దమునకు 'అనిర్వచనీయమైన' అని అర్థము. అనగా చెప్పుటకు వీలులేనిది అని అర్థము. చెప్పుటకు వీలులేనిదని ఒకటుండదు. చెప్పినచో తెలియరానిది యుండును. మానవుల సంస్కార దౌర్బల్యముచేత, సంస్కారములయొక్క దుష్టత్వముచేత, యదార్థమైన వాదనయు విచారముచేసి నిరూపింపబడిన మహార్థమును వారికినచ్చవు. వాదనయందీ దోషము సహజనిష్ఠమైయున్నది. ఖరమును చూచు మానవుడు, నీవు ఖరమవనగా నా ఖరము మాటలు నేర్చినదైనచో అది తిరిగి మానవుని నీవే ఖరమువు, నేనే మానవుడనన్నచో జేయగలిగిన దేమున్నది? వీని చేతిలో లగుడము లేదు. దాని ఖరములు నిత్యఖరములు. ఇది అట్లుండగా ఆ అనిర్వచనీయమైన ఒక యాంతర హేతువెట్టిదని విచారించినచో వారిద్దరకు పరస్పరాకర్షణమేల జరిగినది? సామాన్యముగ ఆమె ముఖము, శరీర సౌష్ఠవము, ఆమె దేహచ్ఛాయ వీని కాకర్షకములుగా నుండును. ఇంకొకని కవి ఆకర్షకములు కావు. "ఆంతరః కోఽపిహేతుః" అన్న హేతులక్షణము నిచట విచారణీయమగుచున్నది. పూర్వజన్మ, వాని సంస్కారము, వాని పుణ్యాపాపములు, వాని జాతకము, వాని భవిష్యత్తు, వాని సుఖముల నిర్ణయము వీని యన్నింటి సమాహారము, వాని కా స్త్రీయందలి లక్షణములు ఆకర్షకమగునట్లు చేయును. వాని పూర్వ జన్మ కృతమందు గల వైశిష్ట్యము చేత, దాని శరీర గత సౌందర్యమునందుకంటె దాని కులశీలాదుల యందు ఒక్కనికి గౌరవమేర్పడును. ఇది సామాన్యమైన హేతువు. ఇంకొక హేతువు చెప్పుటకు వీలులేదు. హేతుత్వనిరాకరణ వాదులున్నారు. వారిని యథాసంభవ వాదులనవచ్చును. అది అట్లు జరిగినది అంతే. ఎందుకు జరిగినదో విచారణలేదు. కొందరు దైవమందురు. కొందరు యథాసంభవమందురు. ఇప్పుడు ఆ పెండ్లికూతురు తన్ను వరించినది. తనయందధిక గుణములు నిరూపితములు కాలేదు. పరీక్షితములు కాలేదు. ఇది యథా సంభవమా? ఆమె, తన - మధ్యనున్న ఒక పూర్వజన్మ సంస్కార విశేషముచేత సముపాత్తమైన ఆకర్ష విషయమా? లేదా ఆమెయొక మహాతేజస్థానమై తనయందు నెరపినదా? ధీరప్రహ్లాద నమస్కారము, ఆమె తేజస్థానమగుటను సూచించుచున్నది. మరియు ఆమె పంపిన చంద్రవంక వివాహ వేదికయందు తన పాపటయం దలంకరింపించుకొన్న విషయము విలక్షణముగా నున్నది. దానికి ప్రేమ వ్యాఖ్యానము చేసిన చేయవచ్చును. గాని తదధికమైన లక్షణమేదో కన్పించుచున్నది.

అతడట్లూహించు చుండగా నీ యూహలో, కామభావ కార్యమైన ప్రియా ప్రతీక్షా సముద్వేగము కొంత యోసడిల్లగా, నతడు తాను శయనించియున్న శయ్యామందిర కుడ్యములవంక చూడనారంభించెను. అవి యన్నియు చిత్రవిచిత్రములు రమణీయాతి రమణీయములు నైన బొమ్మలతో నిండియుండెను. శిల్పములతో నిండియుండెను. అవి యన్నియు వర్ణచిత్రములు. వాని తళతళ, వానియందలి సజీవత్వము, వాని యొక్క ప్రత్యగ్రతను స్ఫురింప జేయుచుండెను. తమ యీ శుభవేళార్థము తత్కుడ్యములిట్లు నూతన ప్రసాదితములుగా చేయబడినవి. ఇవి యేమియు వ్రాత చిత్రములు కావు. రంగులక్రొత్తతనమే భాసించుచున్నది. అతడు

లేచి గోడలను పలుచోట్ల స్పృశించెను. ఆ వర్ణములు చేతికంటుకొనక పోయినను పచ్చి యారినట్లు లేదు. అతని యెదలో నొకయానంద ముద్భవించెను. ఆ వధువు యొక్క తండ్రి యామెయందెంత దయావంతుడు? తన యందెంత గౌరవవంతుడు? ఆ రాజు నిజముగా నీమెకు తండ్రికాడు. నిజమైన తండ్రి తన యీ కూతురుకు పెండ్లిచేయుమని యీ రాజువద్దకు పంపెను. అతడింతపని చేయునా? ఎందుకు చేయును? ఈమె నిజమైన తండ్రియం దీ రాజునకంత గౌరవమా? లేదా ఈమె యీరాజు నిట్లు చేసినదా? తన పడకగది నిట్లంకరింప వలయునని చెప్పినదా? లజ్జ విడిచి చెప్పునా? ప్రియసఖులతో చెప్పవచ్చును. వారు రాజునకు మనవి చేయవచ్చును. ఆ రాజైన, నామె మాట యందింత విశ్వాసమును పూనునా? ఆమె యొక్క శీల మట్టిదేమో? ఆమె యనుభవ విశేషమెట్టిదో? తాను పెండ్లికొడుకుగా తరలి వచ్చినవాడు. ఆమె తన రాజ్యమునకు వచ్చి తనయంతఃపురమున గొన్నాళ్లున్న గాని యామె యనుభవ విశేషమెట్టిదో తనకుగాని, తనయంతఃపురమునకు గాని, తన సిబ్బందికి గాని తెలియదు. ఆమె అంతటి మహానుభావురాలు కాబోలు.

అతడిట్లను కొనుచు కుడ్యముల యందలి చిత్రములన్నిటిని పరీక్షించెను. అతని కాశ్చర్యము వేసెను. శయ్యాగృహమందు శృంగార కథా విషయములు చిత్రించబడును. పురాణముల యందెన్ని శృంగార కథలు లేవు? రంభా నలకూబరులు, రతీ మన్మథులు, పార్వతీ పరమేశ్వరులు, నలదమయంతులు, సీతారాములు, మేనకా విశ్వామిత్రులు ,గంగా శంతనులు మొదలైన శృంగార కథా చిత్రములు సామాన్యముగ చిత్రించబడును. ఇందులో నట్టిచిత్ర మొక్కటియు లేదు. అతని కర్థముకాలేదు.

## 2

ఆ గది ప్రాఙ్ముఖముగా నున్నది. ద్వారబంధము ప్రాగ్దిశాకుడ్యమున సగమును మించియున్నది. అనగా తక్కిన సగము గోడ, ద్వారబంధమున కటునిటు నున్నది. ద్వారబంధమున కిరువైపుల నా యున్న గోడల వెడల్పులో రెండు చిత్రములున్నవి. ఆ రెండును నొకటియే చిత్రములు. వానిని చూడనక్కరలే దనిపించినది. అవి రెండును పెండ్లికూతురు బొమ్మలే. పెండ్లికూతురుయొక్క సహజ స్వరూపములో నున్నవి. ఆమెయొక్క సహజ ప్రమాణములో నున్నవి. ఆమె ధరించిన దుస్తులు మాత్రము భిన్నములుగా నున్నవి. లో నుండి ద్వారబంధమున కెదురుగా నిలుచున్నచో నెడమవైపు బొమ్మ ,పెండ్లికూతురు వివాహ మంటపమున పెండ్లిపీటల మీద కూర్చున్న యామెయొక్క ప్రతికృతి. ఎడమకాలు మడిచి కుడికాలు మోకాటిమీద చిబుకముంచి చూచుచున్నట్లున్నదా చిత్రము. ఆ శిల్పియొక్క నేర్పెట్టిదో? హఠాత్తుగా చూచినచో నామెయే యున్నట్లుండును. విచిత్రమేమనగా నామె పాపట యందు చంద్రవంక యున్నది. ఈ చిత్రమెప్పుడు గీచినది? చంద్రవంక తనకు పంపించినప్పుడు గీచినదా? పంపించకముందా? తరువాతనా? మొన్ననే కదా వివాహము జరిగినది. ఈ చంద్రవంక యామె పాపటయందు తాను తీర్చిన తర్వాత, నామె యిచ్చుటకే వచ్చుటయు నా భూషణమును ధరించియున్న యామెవంక జూచుచు శిల్పి యీ చంద్రవంక నామె పాపటయందు కూర్చి చిత్రమును రచించుట జరుగుటకు వ్యవధి లేదు. అనగా

చంద్రవంక వీరివద్ద లేనప్పుడు ఆమె పెండ్లి కూతురు కానప్పుడే ఈ చిత్రము రచింప బడినదన్న మాట. పెండ్లికూతురు సరే, ప్ర[illegible] పెండ్లికొడుకు లేకుండ పెండ్లికూతురుయొక్క బొమ్మయేమి? పెండ్లి జరిగిన తరువాత పెండ్లికూతురగును. యువతి అప్పుడొక విధముగా గూర్చుండును. దానిని బట్టి తరువాత చిత్రము వ్రాయుదురు. పెండ్లి జరుగక ముందే యిట్టి చిత్రము వ్రాయుదురా? పెండ్లి జరుగును కదా, అప్పుడు పెండ్లికూతురగును కదా; అప్పుడిట్లుండునని వ్రాయుదురా? లేదా వివాహోత్పూర్వమే యామె పెండ్లికూతురు వేషమువేసికొని శిల్పి యెదుట కూర్చుండ వలయును. ఆ శిల్పి స్త్రీయో పురుషుడో? శతవిధాల స్త్రీయేయై యుండవలయును. ఆమె యీ పెండ్లికూతురు వేషములో నున్న యామెను చూచి, తదాకృతిని కుడ్యముమీది రేఖలుగా తీర్చి వన్నెలు చేయవలెను. ఆ చిత్రమును చూచినవో నతని కబ్బురమయ్యెను. ఆ చిత్రములో నే వన్నెచీర దాల్చినది? ఏ వన్నె పైఠాణి తొడిగినది? చేతులకెట్టి భూషణములు దాల్చినది? అంగులీయకము లెట్టివి? కనిపించుచున్న కుడికాలికి నమర్చిన భూషణములెట్టివి? కాలివేళ్ళకు పెట్టిన నగల యాకారమెట్టిది? మెడకు పూసిన గంధపూతల యొక్క రేఖలెట్టివి? చొళ్ళెము చొళ్ళెముగా నమర్చిన కేశపాశమునందలి రావి రేక చేమంతిపూవు చంపసరాలు మొదలైన భూషణములెట్టివి? అన్నియు పెండ్లి పీటల మీద కూర్చున్న యామె ధరించిన వసన భూషణములే. కూర్చున్న భంగిమయే యధాతథముగా నిందు చిత్రించబడియున్నది. ఆ చిత్రమును తీసికొని వచ్చి ఈ గదిలో కుడ్యముమీద నమర్చుట మరియు నబ్బురముగా నున్నది. ఇది యామెకొక విధముగా పుట్టిల్లు. అత్తవారిల్లుకాదు. ఆమె యొక్క యిచటి యునికి కొలది దినములేయుండును. రెండుమూడు దినములలో నామెను తాను కాశ్మీరదేశమునకు దీసికొనిపోవును. ఈ రెండు మూన్నాళ్ళ కింతటిశోభ యిచ్చుటచేయుట యెందులకు? ధనవంతులు చేయుదురు. రాజులు చేయుదురు. ఒక్క దినమునకైన, సర్వభోగములు సమకూర్చికొందురు. కావచ్చును. ఈమె యొక్క వధూవేషముతోడి చిత్రమిచ్చుట నొంటిగా నెందుకున్నది? ఆమె నిత్యవధువా? తన్ను పెండ్లియాడక ముందే ఈ పెండ్లి కూతురువేషమున్నదికదా? ఇది నాటకమా? అభినయమా? వివాహము జరుగకమున్ను స్త్రీ కి వివాహాలంకరణముచేయరు. వివాహము కాకమున్నిట్టి యలంకరణము చేసికొని దానిచిత్రము కుడ్యము మీద వ్రాయించుకొనుట చిత్రము. వ్రాయించుకొనెనో, వ్రాయించెనో? ఈ గదిలో తానామె చిత్రము నిట్లు చూడవలయునన్న కోరికతో నిట్లువెలయించెనో? అతని కన్నియు సందేహములుగానే యుండెను. పెండ్లిపీటలమీద తాను చూచిన భార్యాప్రతి మరల చూచుట కెవరు సంతోషపడరు ? అట్టిబొమ్మ నెన్నిసార్లు చూచిననేమి? ఆ చిత్రమును వ్రాసినది వివాహోత్పూర్వమా? వివాహోత్పరమాయన్న ప్రశ్నయేమి? వివాహోత్పూర్వమైనచో నందేమి దోసమున్నది? ఆమె నిత్యవధువనియా? అనగా బాల యౌవన కౌమార వార్ధక్యములు లేని స్త్రీయనియా? ఒప్పికొందము. భర్తకూడ తాదృశుడేనా? అతడును వయోవస్థాభేదములు లేనివాడేనా? అతడు తానైనచో, తాను కాడే? ఈ వధూత్వ నిత్యత్వమెట్టిది? ఇట్టిప్రతికృతి తన మేడలయందుండ వలయును. ఇచ్చటికన్న నచ్చట దీని సొంపు వెలయింపులు దీర్ఘకాలాను భూతికి యోగ్యములుగా నుండును. మరియు ఇచ్చట యీ శాల, యీగది, యీ ప్రదేశము రెండు మూన్నాళ్ళ ముచ్చట

కోసమేర్పాటు చేయబడినది. ఈమూన్నాళ్ళైన తరువాత నిచ్చట కెవరువత్తురు? ఈ వధూత్వ నిత్యత్వ దర్శనమెవరికి కావలె? ఇట్టిబొమ్మ సృష్టిలో ముప్పురికే యానంద దాయకమగును. భర్తకు, తల్లితండ్రులకు. ప్రధానముగా భర్తకు. అతడు మాటిమాటికిచ్చటికి రాడు. చూడడు. ఈ తల్లితండ్రులు, తల్లి తండ్రులు కారు. యిది యొక్క రెండుమూన్నాళ్ళ కొరకు పడినశ్రమ. అట్లనుకొనుట యెందులకు? ఏక నిమేషగత సౌఖ్యానుభూతి కొరకు మానవుడు పదియేండ్ల శ్రమ ననుభవించును. తత్సుఖానుభూతి నిమేషానంతరమున, దానిని మరల పర్యాలోచించడు. తత్పూర్వమునందు తల్లబ్ధికై చచ్చెడునంత శ్రమ పడును. లబ్ధియైన నిమేషమునందు, తరువాత, మరికొంత కాలము దానిని గూర్చి భావించి యనుభవించినట్లు సుఖపడును. తదనంతరము నిరాదరణమే. విగళిత శ్రద్ధాలక్షణమే. కనుక నేమగుచున్నది? తల్లబ్ధి సమయమల్పము. తత్పూర్వ పరములయందు దీర్ఘకాలము వ్యర్థము. మరియు నీ చిత్రము, తానామె పాపట యందు చంద్రవంక పాదివిన నిముసము నందామె తలయెత్తి సమావిష్టమైన మంత్రి భూపాల సామంతులను చూచిన చిత్రము. ఆ చిత్రమును గీయుట యెందులకు? పెండ్లికూతురు బొమ్మ తలవంచికొని లజ్జాభినయము చేయుచున్నట్లుండ వలయును. ఇది యట్లులేదు - కన్నులు విప్పి లోకమును చూచుచున్నట్లున్నది. ఈ కన్నులయందు ధీరప్రహ్లాదుడేమి చూచెను? ఈ కన్నుల వెనుక నేమి యున్నది? నీకొక వ్యామోహమున్నచో మహా విషయమునందు కూడ, నీకు తద్వ్యామోహ విషయమే భాసించును. దానిపరమార్థము భాసించదు. నన్నీమె వరించినది. మాకు పెండ్లియైనది. ఆమె కన్నుల యందు నాకు భార్యాత్వము, భర్తృభావానుకూల ప్రేమ భావము మాత్రమేకనిపించునేమో? తచ్ఛరీరానుభవవేళాభావ నిత్యలగ్నబుద్ధితో త న్నేత్రములయందు ప్రేమయో సౌందర్యమో కామభావానుకూల తత్వమును భర్త దర్శించును. ఆ స్త్రీ యొక్క యిట్టి ప్రతికృతి తండ్రిచూచును. ప్రతికృతి యిదియే. తండ్రికేమి కనిపించును? ఆ కనులయందు శృంగారభావము కనిపించునా? లజ్జాభావము గోచరించునా? దుహితృభావము గోచరించును. గోచరించు ననవలయునా? ద్రష్ట తనయొక్క భావమును తత్ప్రతికృతి యందారోపించును. భర్తకూడ నట్లేచేయును. అయినచో నా వ్యక్తి యందుగాని తత్ప్రకృతియందుగాని స్థిరమైన యొకభావము లేదా? వస్తువువస్తువే. భిన్నవ్యక్తులు దానియందు తమ అభిలాషములను చూతురు. తదనుకూల వ్యాఖ్యానములు చేయుదురు. ఇన్నిభావముల కా ప్రతికృతి యాచిత్రము యా వ్యక్తిస్థాన భూత మగుచున్నది. ఇది జీవుని లక్షణమేమో? జీవగతమై సర్వభావములు భాసించును. తత్తద్వ్యక్తులు స్వానుకూల వ్యాఖ్యానములు చేసికొందురు. స్వానుకూల విషయములయందు భజింతురు. అనుభవింతురు. వసంతకాలము వచ్చినది. రసాలము పుష్పించినది. పిందెలు వేసినది. కోకిల వచ్చి తాను సంగీతసభ చేయుటకు యోగ్యమైన ప్రదేశమనుకొన్నది. అంతకు మించి రసాలశాఖ దానికెందు కుపయోగించినది? భృంగము వచ్చినది. మావిపూత యెంతసన్నని పూత? అది యొక తామరపూవా? గుమ్మడి పూవా? కనీసము మాఘ్య కుసుమమంతయైన వైశాల్యముకలదా? ఒక సన్నని నీటి బొట్టంత పూవు - భృంగము దానియందు మధువును స్వీకరించుచున్నది. వేపపూతయందు స్వీకరించుచున్నది. ఆ పూవులయొక్క ప్రాణమెంత? అందున్న మధువెంత? అందున్న మధువును బిందువు యనుటకు కూడ వీలుండదేమో? దాని ప్రమాణము అణువంతకూడ కాదేమో?

పరమాణువంత యుండునేమో? ఇంక పిందెలున్నవి. వానిని, చెట్టుక్రిందపడిన వానిని పిల్ల లేరుకొని తినవచ్చును. వీని కంటె వాయు వెక్కువ భోగశీలి. అతడు వచ్చి దృష్టుడై వృక్షము వృక్షమునంతయు ధూర్తవేగ పరిష్వంగమున నల్లలాడించి, పూవురాల్చి పిందెలుడుల్చి తనదారిని తాను పోవును. నా వృక్షమే మున్నది? అది యొక వృక్షము. స్త్రీ కూడ నట్టిదే. నీవు భార్య యనుకొని, మరియొకడు దుహిత యనుకొని, యింకొకడు సోదరి యనుకొని, మరికొందరు మహారాజ్ఞి యనుకొని ధీరప్రహ్లాదుడు నమస్కార యోగ్యయనుకొని - ఆ కనులలో నమస్కారార్హత నాకు కనిపించుట లేదు. ప్రణయకోప సంజాత వేళా ప్రసన్నతా సంపాదన కొరకు భర్తలు భార్యలయొక్క చరణముల యందు సంపాతము చేయుదురని కావ్యగత విషయము. శ్రీ కృష్ణదేవుడు సత్యభామా చరణ నీరేజ సంపాతము చేసెనట.కాని భార్యకు భర్త నమస్కరించినట్లు కన్పడలేదు. ఈ నమస్కార మనునది మాత్రము స్త్రీవిషయమున భర్తృభావ బహిరంగభూతము. అతడేమి చూచెను? ఒకవేళ నతడుచూచినది దాని యందున్నను భర్త నమస్కరింపడు. అందుచేత నతడు దానిని గ్రహించలేడు. ఈ నిత్య వధూత్వమెందుకు? ఇది యిచ్చట నెందులకు? నన్నీయాలోచనలో పెట్టుటకా? నేనీ యాలోచనలో పడినందువలన నామె కేమి ప్రయోజనము? ఈ వధూత్వ మస్మదర్థము కాదు. ఇది యీమెయందు నిత్యమైన విషయముఅని నేననుకొనుటకా? అనుకొని విరక్తుడనగుటకా? ఇది యేమి? నన్ను వరించుట యేమి? నన్ను తనయందు విరక్తుని చేయుట యేమి? రెండు నొకదాని కొకటి పొసగవు కదా? ఇదిగో యీ పెన్నిధానము నీది. నీదేకాని,దీనిని నీవు యనుభవించుటకు వీలులేదు, యని చెప్పినట్లున్నది. నే ననుభవించుటకు వీలులేని పెన్నిధానము నాది యనుకొనుటలో నేమి విశేషమున్నది? ఏమి సుఖమున్నది? ఒక దానియందు నీ కనుభవము లేకుండ దానియందు నీకు స్వాత్మీయము కుదురునా? ఆమె నీకు కుమార్తె. ఆమె నీకు సోదరి. ఆమె యందు నీకేమి యనుభవమున్నది? తద్భావగతమైన స్వాత్మీయము, ఇద్దరమొక కడుపున పుట్టితిమని కాని, యీమె నా కడుపున పుట్టినదనిగాని, అట్లు పెన్నిధానమును భావింపవలయునా?

# 3

కుడివైపున నున్న బొమ్మవద్దకు పోయెను. ఆ బొమ్మ యామెదే. అందులో నామె నిలుచున్నది. ఆమె పొట్టిదికాదు. స్త్రీ జనమునందు సామాన్యముగా నొక హ్రస్వియసిత్వము భాసించును. స్త్రీలు కొందరు పొడుగరులే. పొడుగరియైకూడ తత్కాలబుద్ధి నివిష్టుడైన యొక పురుషుని దృష్ట్యా నామె పొడుగరి యనిపించదు. భర్త పొట్టివాడు కావచ్చును. వాని పజ్జ నీమె పొడుగరి. అంత మాత్రము చేత పొడుగరి యగునా? స్త్రీలున్నారు, పురుషులున్నారు. సామాన్యముగా పురుషులకంటె స్త్రీలు పొట్టివారు. ఆ పొట్టితనము నియమిత మన్నట్లున్నది. ఏ వ్యక్తి నా వ్యక్తిగా చూచినప్పుడు పొడుగరియే. ఎంత పొడుగరియైన, పురుషునియొక్క యున్నతత్వ ప్రమాణమునందుకొనలేదు. బక్కపలుచని వారు పొడుగుగా కనిపింతురు. పొడుగైన వ్యక్తికి, పురుషుడైనచో శరీరము నందు తగినంత పుష్టియున్నచో వాని యాకారము

నందొక దర్పము భాసించును. యొకయుదాత్తత ప్రకాశించును. కాని వాని పొడుగరితనము భంగింపబడదు. స్త్రీ పొడుగరి యై తదనుకూల సర్వావయవపుష్టి కలిగి యున్నచో నామె పొడుగరి యనరు. ఆమె యుదాత్తత్వము గాంభీర్యము నందురు. రంభ వలె నున్నది, దమయంతివలె నున్నదందురు. కాని ఆమె చాల యెత్తయిన మనిసి, మంచి పొడుగరి యనరు. ఈ బొమ్మలో నామె పొడుగరిగా కన్పించుచున్నది. బక్కపలుచనితనము న్నదా? లేదు. శరీరపుష్టి సమృద్ధిగానున్నది. ఒడలుదొందపారినట్లు లేదు. కఠినీకృత దేహయష్టిగా నున్నది. వ్యాయామమునందు కుశలురాలా? చిన్నప్పటినుండి ధనుర్విద్యాదులు నేర్చినదా? పొడగరి యనిపించుచున్నదే కాని లోకమునందు రంభవలెనున్నదా, దమయంతివలెనున్నదా యనుకొను స్త్రీల వలె లేదను ఒకు లేదు. ఈమె పొడుగరి తనము పెండ్లికూతురుగా కూర్చున్నప్పటి చీరయు, రైకయు, భూషణములు ధరించినచో కనిపించునా? ఈ చిత్రమునందీమె సన్నని తెల్లని పట్టుచీర ధరించినది. స్వల్పాభరణ భూషితయైయున్నది. హస్తమునందు లీలాకమలమున్నది. చేయి ముంజేతినుండి యెత్తబడి, కరతలమునందలి కమల మూర్ధ్వముఖముగా నున్నది. ఎడమచేయి ప్రక్కనున్న ఏనుగుమీద నానించబడియున్నది. ఆ ఏను గెందులకు? ఆయేనుగు నల్లనిది కాదే. తెల్లనిది. ఇది యైరావతమా? అయినచో నీమె శచీదేవి. తానెక్కు నేనుగుయొక్క ఎపు లేక ఎత కందునా? ఏన్గు చిన్నది. నిజముగా పిల్లయేనుగా? ఈమె వద్ద నాయేన్గు చిన్నదిగా నున్నదా? ఈమె యేన్గుకంటె పెద్దదా?యేన్గు నందు పిల్లయేన్గుతనము కనిపించుటలేదు. దీని దంతము లంకురములు కావు. దీర్ఘములు. ఆమె చిత్రము ననుసరించి ఏన్గువంక చూచినచో నది మత్తమాతంగము. శిల్పియందు దోషమెన్నుటకుకూడ వీలులేకుండ నున్నది. ఎక్కడనైన ప్రక్కన నిలుచున్న మానవ వ్యక్తికంటె ఏన్గుప్రమాణము తక్కువగా నుండునా? యేన్గు రెట్టింపెత్తుండవలయును. అట్లులేనిచో బొమ్మ వ్రాసిన దారుశిల్పియొక్క యవివేకము. అట్టి యకృత కర్ముడైన శిల్పి చేత గీయబడిన బొమ్మలు బొమ్మలేకావు. భావుకు నలరింపలేవు ఇచట నట్లుకాక ఏన్గునకేన్గు మత్తదంతావళము. నిలబడ్డ ఈమె సహజ ప్రమాణము కలది. శిల్పి నొకదాని నూహించి యుండును. అంతటి యేనుగు నీమె ముందుతక్కువది. ఆమె మానవ రూపముతో సహజ ప్రమాణమున నున్నను, మాతంగము మాతంగరూపముతో సహజప్రమాణమున నున్నను, నిద్దరు నొకచోట నుండినప్పుడు దంతావళము తక్కువదియై పోవుచున్నది అన్నభావము స్ఫురింపచేయుటకు శిల్పి యిట్లు చేసియుండవచ్చును. ఈ యేన్గు తన తొండమును ప్రక్కకు ప్రసారించి లీలాకమలము నందుకొనబోవుచున్నది. అదిసరే. అవతలివైపు నున్నబొమ్మ వధూమూర్తి, తనకు బరిచితమైనది. ఈ బొమ్మ యేమి? ఈ యాకారమును నేను భవిష్యత్తునందు చూతునా? సఖీజనముతో మాతృయుక్తయై వెడలిపోయిన యామె మరల రావలయునుగదా! అప్పుడిట్టివేషముతో వచ్చునా? లీలా కమలమును ధరించివచ్చునా? ఏన్గుపై చేయివేసికొని వచ్చునా? ఏన్గును వెంటబెట్టి కొనివచ్చునా? ఈ కవాటము విశాలమైనదే. యేన్గుకూడ రావచ్చును. కాని అది పిల్లయేన్గై యుండవలయును. అప్పుడీ బొమ్మకు సరిపోదు. అతనికి హఠాత్తుగా నొక యూహతోచెను. ఆ ఏన్గుతానా? తాను మత్తదంతావళమా? ఆమె తన్ను పాలించునా? ఆమె తనపై హస్తముంచి పరామర్శించునా? తానామె చేతిలోని కమలమునకై

యాసపడునా? తానొక జంతువా? ఆమె దర్పప్రాకట్యమునకు తానొక సాధనమా? అతనికేమియు తోచలేదు. ఇచ్చటనేవో బొమ్మలుగీసి యున్నవి. వానిని గూర్చి చేసిన సూక్ష్మసూక్ష్మములైన యూహలతో తన్నుదాను ప్రహరించుకొనుచున్నాడు. అయ్యో! ఇది యెచ్చటనైన యున్నదా? పెండ్లియైనది. శోభనపుగదిలో పెండ్లికొడుకు పెండ్లికూతురుకై నిరీక్షించుచున్నాడు. వాని భావము మన్మథాయత్తమై యుండ వలయును. ప్రతీక్షాపరమార్థభూతమై యుండవలయును. అట్లుకాక పందలు పందలూహలు త్రవ్వికొని ప్రేమ భావము త్రవ్వికొనునట్లు చేయునేమి? నిజమే లోక సామాన్యమైన రాచకూతురు తన్ను వరించినది. ఆమెకోసము ప్రతీక్షించవచ్చును. ఈమె లోక సామాన్యురాలు కాదు. ఎందుకుకాదు? అందరివలె జన్మించలేదా? లేదని యొక ప్రథ యున్నది. లోక సామాన్యమైన స్త్రీత్వ లక్షణము లేనిచో తన్నెందుకు వరించినది? యోగినిగా నుండకపోయినదా? తపస్సు చేసికొనరాదా? మోక్షమును గడించరాదా? జన్మ చారితార్థ్యమును వహించరాదా? తనవంటి వానినెవ్వనినో ప్రతారించుట యెందులకు? అగు నామెజన్మ లోక సామాన్యమైనదికాదు. జననమందినది కనుక వివాహముచేసి కొన్నది. చేసికొన్నది కనుక లోక సామాన్యముగనే ప్రవర్తింపవచ్చును. ఇంకొకరీతిగా ప్రవర్తించుట యెందులకు? ఆమె యిప్పుడింకొక రీతిగా నేమి ప్రవర్తించినది? తానూహచేయుచున్నాడు కాని, ఆమె తనతో నింతవరకు నేకాంతము భజించినది లేదు. పల్లెత్తి యొకమాట యనినది లేదు. తన్ను తిరస్కరించినది లేదు. నా సంతోషము కొఱకు నన్మత్ప్రేమ నభివృద్ధిపరచుటకొఱకు నీగది యంతయు చిత్రింపబడినది. అదికూడ యొకదోసమా? ఒకగది నలంకరించుటలో చాతుర్యము నెరపబడవచ్చును. కావ్యమునందువలె ప్రతియల్ప విషయమునందు నీవు వ్యంగ్యము కొఱకు వెతకినచో మోటు సామెత చెప్పినట్లుండును. మరల చిత్రమును తిలకించెను. ఆమె తెల్లనిచీర ధరించినది. ఆమె శరీరకాంతి మరకత మణిచ్ఛాయా దాయాదముగ నున్నది. ఆ మెయి వన్నియ మీద తెలిచీర యింత యందముగానున్న దనుటకు వీలు లేకుండెను. ఇట్లె చూడగా నామె పాపటయందు చంద్రవంక భాసించుచున్నది. అతని జీవునిలో నతనికి తెలియకుండ నా చంద్రవంక యింటొక విలక్షణమైన యభినివేశము నిరూపితమైనట్లున్నది. అనూహితముగ హస్తము నెత్తి యా చంద్రవంకను స్పృశించెను. హఠాత్తుగా నతడు రెండడుగులు వెనుకకు వేసెను. ఇంతవరకతడు దానిని తైలవర్ణచిత్రమను కొనుచుండెను. అది చిత్రముకాదు. అది గోడలో నత్తుకొనిన ప్రతిమ. స్పృశించువరకు ప్రతిమాత్వమేర్పఱుప రాక చిత్రము వలె భాసింపచేయు నిట్టి నేర్పుతాను కని విని యెఱుగడు. దగ్గరగా నిలుచుండి తా నిది ప్రతిమయని గ్రహించలేక పోయెనే! ఆవర్ణ సన్నివేశ చాతుర్యమెట్టిది? కంటిని మోసగించుచుండెను. ఈ ప్రతిమ గోడ కత్తుకొని యున్నదా? ఈ గోడలో నొక గూడుగా చేసి దానియందు నిలబెట్టబడి యున్నదా? మరల చంద్రవంకను స్పృశించెను. ఇది ప్రతిమయైనను కేశపాశము మాత్రము యదార్థమైన కేశసముదాయమే. వర్ణసాంకర్య జనితభావన లేదు. ఆ జుట్టులో యదార్థమైన రతనపు చందురునివంక యున్నది. పెండ్లికూతురు తనవద్దనుండి పానుపు పైనుండి వెడలిపోవువేళ తాను చంద్రవంకను చూచెను. ఇది వేరొక చంద్రవంక ఈ యాభరణము లామెకు రెండుకలవు ఈ యాభరణమును ధరించియే పెండ్లికూతురు చిత్రమును వ్రాయింపించుకొన్నది. ఆ వధూచిత్రముకూడ ప్రతిమ కాదుకద! మరల నచ్చటికిపోయి హస్తపరామర్శచేసి అది ప్రతిమకాదని

తెలిసికొనెను. అది వర్ణసాంకర్యజనితరేఖా రమణీయ భావనామూర్తియే. ఇది మాత్రము ప్రతిమ. ఇది గోడలోనున్నదా? విడిగానున్నదా? తాను గోడను స్పృశించి, గూటిలోని యంచులు తెలిసికొని, చేయి లోనికిపోనిచ్చి, ప్రతిమకు గోడకు నడుమ సన్నని యెడమున్నట్లు గ్రహించి, సంశయము తీరక, పైనున్న వలిపపు టుత్తరీయమును ప్రతిమా పశ్చాద్భాగమున నొంటిపారగా జొనిపి, ప్రతిమకు గోడకు సంబంధము లేదని తెలిసికొనెను. తెలిసికొన్నతర్వాత ప్రతిమయొక్క దళసరితనమును తెలిసికొనెను. చేతితో ప్రతిమను నఖశిఖపర్యంతము స్పృశించెను. ఆమె వామ హస్తము, ప్రక్కనున్న దంతావళముతో నంటిలేదు. పిస్తుబొమ్మ వేరు. ఈ బొమ్మ వేరు. అతడా ప్రతిమామూర్తి యొక్క సర్వదేశము నందు. సర్వావయవములయందు స్పృశించుచో, [illegible] వానికి తెలియలేదు. అయ్యయ్యో! ఇది యొక విలక్షణమైన యనుభూతి. ఆమెను ప్రసన్నురాలిని చేసికొననక్కర లేకుండ. ప్రథమ సమాగమ లజ్జాకుంచిత శరీరభిన్న దేశములు బతిమాలి, లాలన చేసి చాటుమాటలచే మచ్చిక [illegible] ప్రసన్నుడై, యామె శరీరము [illegible] చేసికొనవలసిన పని లేకుండ, యామె సర్వావయవములను యథేచ్ఛముగ స్పృశించుచుండెను. ఆనందపడుచుండెను. తృప్తిపడుచుండెను. తానొక దోషమును చేయుచున్నట్లు భావించుచుండెను. [illegible] దోషభావమును నిరాకరించుకొనుచుండెను. ఇందు దోషమేమున్నది? ఆమె తన భార్య తన వివాహిత. ఇది [illegible] ఆమె యింతలో [illegible] స్పృశింపగలడు? [illegible] సర్వావయవములు [illegible] దోష మేమున్నది? ఆమె యథార్థమైన ప్రాణి. [illegible] ప్రతిమ. ఆ ప్రాణి యందు నీకే యనుభవమున్నదో [illegible] దోషరహితము. ఆ ప్రాణియందు నీ కా [illegible] కలిగినప్పుడే [illegible] స్వంతమగును. అంతవరకు దీనియందు నీకు స్వామిత్వము లేదు. ఇది వట్టి మిథ్యానుభూతి. ఇది వట్టి మన [illegible]. ఆమెకు [illegible] కావచ్చును. భర్తయైనను, తన్నువదలి, భర్త తన ప్రతిమయందు మోహమును [illegible] వీనిని నీచుడను కొనునేమో? అల్పుడనుకొనునేమో?

## తృతీయాధ్యాయము

## 1

ఒక ఆశతో ప్రవర్తింపుము. ఆ ఆశ పట్టరానిదిగా నుండును. ఆ ఆశాసాధనమైన మార్గమునందు ఒక దోషము నాచరింపుము. ఈ దోషబుద్ధి మనస్సునకు బరువై ఆ యాశ యందలి గాఢత్వము సన్నగిల్లును. ఆశలోని తీవ్రత అంతయుండదు. అతని పని అట్టైనది. తన భార్యయొక్క ప్రతిమను తాను సర్వంకషముగ నధికమైన కామభావనతో స్పృశించుట దోషమెట్లగును? ఒకానొక విషయమున మనము దోషమని భావించుటచేత నది దోషముగా కనిపించును. ఉదంకుడు గురుభార్యకొఱకు పౌష్యని భార్యయొక్క కుండలములు తేబోయినాడు. మార్గమునందొక దివ్యపురుషుడు పన్నిన గోమయభక్షణము చేసినాడు. నిజానికా పురుషుడింద్రుడు. ఈ

గోమయ మమృతము. కాని గోమయఖాదనము చేసితినన్న భావము వానియందు దోషమై పతివ్రతయైన శౌమ్యనిభార్య యితనికి కనిపించలేదు. దోషాదులు భావనా నిష్ఠములై యుండును. ఇతడామె ప్రతిమను పరిష్వంగము చేసికొను చున్నాడు. చుంబించుచున్నాడు. ఆ సమయమునందామె వచ్చును. వచ్చి చూచును. ఇతడు నీచుడనుకొనునా? ఇతడల్పుడనుకొనునా? లోకములో నే స్త్రీ యైనను తన భర్తకు తనయందింత యనురాగమున్నదని సంతోషించును. ఆనందపడును. అతడన్నచో ప్రాణములు వదలిపెట్టును. ఇట్టి స్థితిలో యతడన్యథా వ్యాఖ్యానము చేసికొని తబ్బిబ్బుపడనారంభించెను. ఇంతకును కారణమామె లోకసామాన్య స్త్రీ కాదని యాతడు భావించుటచేతనే. ఏది యెట్లయినను వాని మనస్సునందుమాత్రము భార్యాప్రతీక్షా తీవ్రత కొంత సన్నగిల్లినది. ఏకవిషయగత తీవ్రభావన సన్నగిల్లుట తోడనే మనస్సు సహజముగానే వ్యగ్రతను కోల్పోవును. అతని మనస్సు పరిభ్రమింప నారంభించెను. తాను చూచుచు నే ద్వారమున కిరుదెసల నున్న చిత్రములను చూచెను. వానిని పరామర్శించెను. తొట్టతొలుత చూచినది కుడ్యముల మీది బొమ్మలు. ఇప్పుడు మనస్సు బొమ్మల మీదికి పోయినది. ఆ చిత్రములను పరిశీలింపనారంభించెను. మొదటిది సముద్రమథనము. ఆ మథనమునుండి లక్ష్మీదేవి యావిర్భవించుచున్నది. మంథర పర్వతము నొడ్డిగిలబెట్టి దేవదానవులు విశ్రమించు చున్నారు. వాసుకికి విశ్రాంతి చేకూరి యత దుచ్ఛ్వాసమును తీసికొనుచున్నాడు. ఒడ్డిగిలిన మంథరపర్వతము యొక్క మూలమట్ట ప్రదేశ మైన పాలకడలితరగలనుండి మహాలక్ష్మి యావిర్భవించుచున్నది. దేవత లెఱ్ఱనివారు. రాక్షసులు నల్లనివారు. వాసుకి గోధుమ వన్నెవాడు. మంథరపర్వత మాకుపచ్చగా నున్నది. కడలి తరగలు తెల్లగానున్నవి. ఉదయించుచున్న లక్ష్మి మరకత వర్ణముగా నున్నది. దక్షిణ దిశాకుడ్యమంతయు నీ బొమ్మతోడనే నిండియున్నది. అందుచేత లక్ష్మీదేవిబొమ్మ చిన్నదిగా నున్నది. ఆ గదిలోని దీపముల కాంతిచేత చిత్రములు దివా వేళయందువలె విస్పష్టముగా కనిపించుటలేదనియే చెప్పవలయును. అతని భార్యయొక్క ద్వార ద్విపార్శ్వగత చిత్రప్రతిమలు పెద్దవి గనుక వెలుతురు చాలెను. ఇచ్చట నంతటి పెద్దబొమ్మలో నొక చిన్నచోట నున్న లక్ష్మీవిగ్రహము విస్పష్టముగా కనిపించుటలేదు. గది యొక్క యుపరిభాగమునుండి వ్రేలాడ తీయబడిన యినుపచువ్వల కమర్పబడిన, గుండ్రని కనకాది లోహమయపాత్రలో, వత్తులువేసి వెలిగింపబడిన దీపముల కాంతియొక్కయూర్ధ్వప్రసరణను భంగించి, క్రిందకు మలచుటకు, యినుపచువ్వలకు కొంతమేర గుండ్రని వెండిరేకు లమర్పబడియుండును. ఈ వెలు గా వెండిరేకులకు కొట్టికొని కాంతిప్రసారము క్రిందికి చిమ్మబడుచుండెను. అందుచేత గోడయంతటను వ్రాయబడిన యీ చిత్రముయొక్క యుపరిభాగ మవిస్పష్టముగా, నడిమిభాగము స్పష్టాస్పష్టముగ, క్రిందిభాగము స్పష్టముగా కనిపించుచుండెను. లక్ష్మియొక్క ప్రావిర్భావము స్పష్టాస్పష్టమండల మందున్నది. ఆ లక్ష్మి విగ్రహమును పరిశీలింప నెంచినచో, వేర యొక దివ్వియను తీసికొని సమీపించి పరిశీలింపవలయును. ఒక సేవకునో ఒక సేవకురాలినో పిలిచి దివ్వియను తీసికొని రమ్మనవలయ్యును. ఇప్పటి తనస్థితి యట్లులేదు. వాకిట సేవకులుండిరో లేదో తెలియదు. ఇది తన యంతఃపురము కాదు. గోడలమీది బొమ్మలు పరామర్శించు వేళకాదు. తాను శోభనపు గదిలోనుండి, భార్యకొఱకు ప్రతీక్షించువేళ. గోడమీది బొమ్మను పరీక్షించవలయును,

దివ్వియను తీసికొని రమ్మని యొక సేవకునిబిలిచి చెప్పినచో వాడు నవ్వునుగాక! "ఓహో! ఇతడేమి పురుషుడు" యని లోనలోన పరిహసించునుగాక! రేపుప్రొద్దున తన మగతనము మామగారియింట దాసదాసీజనముల మధ్య తిరస్కృతజనిత మహో మందహాసభాజన మగుగాక! ఆ లక్ష్మీదేవి చిత్రమును తాను పోయి చూడవలెనన్నచో నది యా రడుగుల పైన నున్నది. ఒక యెత్తైన పీటయో యొక యాసనమో గోడప్రక్కన వేసి దానిపై నిలుచున్నగాని యా బొమ్మ విస్పష్టముగా కనిపించదు. దూరముగా కన్పించినంత వరకు విచారించినచో నది తన భార్యయొక్క చిత్రముగా నున్నది. అందుచేత యతని యుద్వేగ మతిశయించినది. గదిలో నడిమిభాగమున మంచమున్నది. ఆ మంచము పందిరి పట్టెమంచము. దానికోళ్లు బంగారపుకోళ్లు. పట్టె లేన్నుగదంతములు. పందిరిస్తంభములు మరకతమయములు. జాలరులు ముక్తావల్లరులు. మంచముపైన పరుపులు నాల్గైదున్నవి. దానిపై కెక్కుటకే కనకమయ సోపానము లమర్పబడి యున్నవి. ఈ మంచముగాని సోపానములుగాని గోడవద్దకు లాగుటకు వీలులేదు. అవి బలిష్ఠములై పది పదేనుగురు సేవకులచేతగాని లాగబడునట్లు లేదు. అతడు మంచముచుట్టు ప్రదక్షిణించెను. మంచమునకు నాల్గువైపుల తగినంత యెడమున్నది. ఈ ప్రదక్షిణించుటలో పశ్చిమదిశాకుడ్యమును చూచెను. పశ్చిమదిశాకుడ్యగత చిత్రములు మంచమునకు గోడకు నడుమనున్న స్థల ముద్దీపింపజేయు లంబమాన దీపమాలికలచేత దక్షిణకుడ్యముకంటె నెక్కువగా భాసించుచున్నది. ఆ గోడమీద చిత్రములు ఒకటి రెండు మూడునాల్గున్నవి. మొదటిది లక్ష్మీనారాయణ వివాహము. ఈ చిత్రములోని లక్ష్మి విస్పష్టముగా కనిపించుచున్నది. ఆ బొమ్మ నిస్సంశయముగా తన భార్యయొక్క బొమ్మయే. అతని తల గిఱ్ఱున తిరిగెను. ఇది చిత్రముగా నున్నది. లోకములోని చాలమంది రాజులు ధనమదాంధులై, భోగదూషితబుద్ధులై, యల్ప రాజ్యలక్ష్మీ లలనాంధకారులై, తాము శ్రీకృష్ణావతారమని యో, విష్ణ్వంశసంభూతులమనియో యనుకొందురు. అట్లే యొక రాచకూతురు తాను లక్ష్మి యొక్క యవతారమునని యనుకొనవచ్చును. అట్లనుకొనిన రాజు లెట్టివారో, యిట్లనుకొనిన రాచకూతురట్టిది. అతడు మరల దక్షిణదిక్కునకు పోయి సముద్రమునుండి యావిర్భవించుచున్న లక్ష్మీదేవి చిత్రమును చూచెను. సందేహము లేదు. అదికూడ తనభార్యయొక్క బొమ్మయే. తక్కిన చిత్రములను పరామర్శించుటకు బోయెను. తక్కిన మూడు చిత్రములు కృష్ణకథా చిత్రములు. రుక్మిణీదేవిని కృష్ణుడు హరించి తెచ్చుచున్నాడు. నారదుడు పారిజాత పుష్పమును రుక్మిణి కిచ్చుచున్నాడు. లక్ష్మీదేవి ప్రద్యుమ్నుని ప్రసవించినది. అది పురుటిల్లు, శ్రీకృష్ణదేవుడు పుట్టిన బిడ్డవంక సాదరముగా చూచుచున్నాడు. ఒకవైపున కృష్ణుడున్నాడు. రెండవవైపున సదాశివుడున్నాడు. మన్మథుడు శివునిచేత భస్మీభూతుడైనాడు. ఆయన యనుగ్రహముచేత ప్రద్యుమ్నశరీరప్రాప్తి కలిగినట్లు భావించవలయును. ఈ మూడు చిత్రములు కనిపించెను. ఇప్పుడతనికి చిత్రములు, వర్ణసామరస్యము, రేఖారామణీయకము, చిత్రగత వ్యక్తులయొక్క మనోభావనిరూపక సాత్త్వికభావసూచి, రేఖాసంతతి మొదలైనవి పట్టలేదు. అక్కడ సముద్ర మథనోద్భూత యైన లక్ష్మి, మరియు నక్కడ లక్ష్మీనారాయణుల వివాహ సమయములందలి లక్ష్మియెట్లో, కృష్ణుడు కుండినపుర సమీపగత దేవ్యాలయమునుండి నిర్గమించుచున్న రుక్మిణి గాని, నారదుని చేతినుండి పారిజాతమును స్వీకరించు రుక్మిణి గాని, ప్రద్యుమ్న

మాతయైన రుక్మిణిగాని - అందరిబొమ్మలు తన భార్యయొక్క బొమ్మలే. అతడు మనస్సులో తల్లడిల్లి పోవుచుండెను. తన భార్యయందతనికి సుంత వెగటుభావము గోచరించెను. ఇదియేమి మనఃప్రవత్తి? ఈ తాదాత్మ్యమేమి? ఈ దురహంకార మేమి? అతడు మరల నిట్లనుకొనెను. నిజమే. ఆమె లక్ష్మీదేవియే. లేనిచో నంత సౌందర్యమెట్లుండును? అందుచేత లోకోత్తర సౌందర్యవతులందరు ధనవంతుల బిడ్డలైనచో, భోగములు సాగించుకొనెడి వీలున్నచో, తగినంత యహంకార మున్నచో, పురాణకథలలో లక్ష్మీసంబంధక కథాంశము లన్నింటిని చిత్రింపించి, లక్ష్మీ స్థానమున తన ప్రతికృతిని నిర్మించికొనవలయునా? అతడు వాయవ్యదిశకు తిరిగెను. ఉత్తరదిశాకుడ్యమునకు మలగెను. ఉత్తరదిశాకుడ్యమున వాయవ్యదిశాభాగము సరిగా కన్పించుటలేదు. ఈశాన్యదిశాభాగము కన్పించుచున్నది. దక్షిణ దిశాకుడ్యమంతయు నొక్కటియే చిత్రమైనట్లు, కౌబేరదిశా కుడ్యమంతయు నొక్కటియే చిత్రము. అతడు తొలుతటి నుండి చివరివరకు జాగ్రత్తగా పరిశీలించెను. ఒకటియే సన్నివేశము. ఈ చివరిది విస్పష్టముగా భాసించెను. ఒకప్పుడు కేశవుడు లక్ష్మీదేవి ననుమానించెను. ఆమెకు కోపము వచ్చెను. ఆమె విష్ణువుయొక్క శిరస్సును భేదించెను. ఋషులు దేవతలు తబ్బిబ్బై యుత్తరదిశా శిరస్కముగ నిద్రించు నొక గుఱ్ఱము తల ఖండించి, దానిని తీసికొని వచ్చి నారాయణమూర్తియొక్క శరీరమున కంటించిరి. ఆయనయే హయగ్రీవుడు. ఈ కథ నాల్గైదు చిత్రములుగా నా యుత్తరపుగోడయందు లిఖింపబడియున్నది. ఈ కథనిచ్చట నేల చిత్రింపబడవలయును? ఇది శోభనపుగది కనుకూలమైన చిత్రమా? లక్ష్మి సాక్షాచ్ఛక్తియొక్క మారటి రూపము. నారాయణునకంటె నధికురాలు. మహాశక్తి తానునుగ్రహించి లోక సంగ్రహణార్థము బ్రహ్మ విష్ణుమహేశ్వరులను భర్తలుగా స్వీకరించినది. కాని నిజానికి నామెయే మహాదేవి. ఈ సిద్ధాంతమును ప్రతిపాదించు కథ యిది. యీ బొమ్మయిచ్చట నెందుకున్నది? తాను తన భార్యను గౌరవముగా చూడవలెనని తన కుపదేశించుటకా? ఆమె సర్వస్వతంత్రురాలని తాననుకొనుటకా? అచట నాబొమ్మ యొక్క చిత్రణము వాని కర్థము కాలేదు. తన రాజ్యమామెకు ప్రీతియమై, తానిల్లరికము వచ్చిన యల్లుడై, రాజైనచో నీ చిత్రము సమంజసముగా నుండునేమో? కాశ్మీర రాజ్యమునకు తాను స్వతంత్రప్రభువు. అది తనకు ప్రీతియమైనది. అచ్చట నీమె తనమీద నధికార మెట్లుచేయును? తానామెను మిక్కిలి ప్రేమించి ఆమెకు చనువుతోడి యధికారమిచ్చినచో జేయవచ్చును. ఈ చిత్రమిచ్చట యనుచితము.

# 2

అతడు పోయి మంచముమీద పరుండెను. అతని మనస్సు సరిగాలేదు. ఈ గోడలమీద చిత్రింపబడిన వన్నియు వట్టి కథలేనేమో? వానిని వ్యాఖ్యానింప నవసరము లేదేమో? మరియు నామె, నేను లేచి యామె వచ్చులోపల వీని నన్నిటిని పరీక్షింపవలయు ననుకొనునా? ఇది యెచ్చటనైన యున్నదా? శోభనపుగదిలో భర్తయుండి తొలినాటి రాత్రి భార్యాగమన ప్రతీక్ష చేయుచు నుద్వేగపడును కాని, గోడలమీది చిత్రములు పరీక్షించునా? పరీక్షించి దుర్వ్యాఖ్యానములు చేసికొనునా? ప్రేమగల భార్య పలుమంది రాజకుమారుల నిరాకరించి, యా యొక్కనినే మన్నించిన

భార్య, యా ప్రేమయొక్క చిహ్నముగా తన తలలోని చందురునివంక కానుకగా పంపిన భార్య, పెండ్లిపీటలమీద స్వయముగా నతని చేతపాపటలో యా చంద్రవంక నలంకరింపించుకొన్న భార్య, తనతోడి నిమేష వియోగమైనను సహించలేని స్థితిలో భర్తను నిర్మించికొన్న భార్య, వాడు శయ్యా గృహము నందలి పానుపుమీదినుండి లేచి, గోడలను పరీక్షించు ననుకొనునా? అనుకొనకపోయినచో తానును నా వలెనే ప్రథమ సమాగమవేళా సముద్విగ్న హృదయయైనచో తాను వచ్చుట కింత యాలస్య మేల చేయవలయును? ఆమె వెంటనే వచ్చినచో తన కింత యలజడిలేదే? ఆమె తా నీ చిత్రములను పరామర్శించు నని యనుకొనలేదనుకొందము. వీనిని నే నెప్పుడు పరామర్శింపవలయును? రేపు పట్టపగలు చూడవలయునా? లేదా రేపురాత్రియో, యెల్లుండి రాత్రియో నే నీమెతో కలిసి యీ చిత్రములను చూడవలసినదా? ఒకవేళ నేను రేపే యామెను గాశ్మీరమునకు తరలించుకొనిపోయి యుందునేమో? అప్పుడీచిత్రముల నెవ్వరు చూతురు? చూడకపోయినచో నింత పరిశ్రమయు వృథాయగును. ఇవి వట్టి చిత్రములు. చూచినచో చూడవచ్చును. చూడకపోయినచో చూడకపోవచ్చును. అట్లుకాదే! ఇవి లక్ష్మీ కథాగత చిత్రములు. ప్రతిచిత్రమునందు తాను లక్ష్మి. ఇది పొసగదు. ఈ చిత్రములను నేను చూచుటకే యామె యుద్దేశించినది. అందుకనియే యామె యింత యాలస్యము చేయుచున్నది. ఒకవేళ నిది పరీక్షయేమో? తాను నన్నింతగా ప్రేమించుచున్నది. నేను తన్నెంతగా ప్రేమించుచున్నానో తెలిసికొనవలయును కదా! ఆమె ప్రేమ సహజమైనది. విచారణా జన్యమైనది. పలుమంది రాజకుమారులను పరిత్యజించి నన్నే యెన్నుకొన్నది. ఆమెను నేనట్లెన్ను కొనలేదుకదా! అందరు రాజకుమారులు తమ ప్రతికృతులను పంపినట్లే నేనును పంపితిని. ఆమెయే కావలయునని నేను కూరుచున్నది లేదుకదా! ఆమె నన్నుభర్తగా వరించినది. నేనామెను భార్యగా స్వీకరించితిని. మరియు నిదియొక చిత్రము. పలుమంది రాజకుమారులను పిలిచి వారిలో నొకరిని రాజకుమార్తె యొక్కతె చేత వరింపజేయుదురు. దీనిపేరు స్వయంవరము. పలుమంది రాజకుమార్తెల నొకచో సమావేశపరచి వీరిలో నీ యిష్టము వచ్చినయామె నెన్నుకొనుమని రాజకుమారుల నడిగినట్లు లేదే? దీనికి స్వయంవరమన్న పేరుకాని, దానికి స్వయంవరమన్నపేరు లేదు. స్త్రీ వరించునుకాని పురుషుడు వరించడన్న మాట. ఇది యేమి చిత్రమో? ఇచట స్త్రీ భావము విదితమైనది. పురుషభావము విదితముకాలేదు. అందుచేత నా యువతియే తాను వరించిన పురుషుని మనస్సెట్టిదో విచారించుకొనవలయును. వాడు యోగ్యుడా? తనయందు బద్ధప్రేముడా? తన దోషములను మన్నించగలడా? తన కొకయహంకార మున్నది. ఆ యహంకారముతోడనే వాడు తన్ను స్వీకరించునా? ఈమె యింతటి యహంకారిణి. నన్ను వరించిన మాట నిజమే. కాని నే నీమెయందలి దోషమును క్షమింపలేను అని నిరాకరించుదునేమో? అని నన్ను పరీక్షించుచున్నదేమో? నేనప్పుడామెను నిరాకరింతును. ఆ పరీక్ష యిప్పుడు జరుగవలసినది కాదుకదా? వివాహమైనది. యిది ప్రథమసమాగమదేశము. ఇచ్చట పరీక్ష యొకవేళ వ్యతిరేకించినచో మూలచ్ఛేదకమగును. మొగ్గగానున్న స్థితిలోననే పూవును త్రుంచివేసినట్లగును. ఇట్లూహించుచుండగా నతనికొక సందేహము కలిగెను. "ఈ హయగ్రీవ కథాగత చిత్రములో రెండు మూడు లక్ష్మీదేవి చిత్రములున్నవి. అవి కూడ నామె బొమ్మలేనా? తాను సరిగా చూడలేదా! తప్పకుండ నామె బొమ్మలే యై

యుండును" అని యతడు మంచము మీదినుండి లేచి మరల నా చిత్రములను పరామర్శించుటకు వెళ్ళెను. వాయవ్య దిశార్ధభాగము చీకటిలో నున్నది. కథలోని పూర్వభాగ మందుచిత్రింపబడి యున్నది. లక్ష్మీదేవిని నారాయణుడేదియో యన్నాడు. ఆమెకు గోపము వచ్చినది. కోపమువచ్చిన యామె మొగ మెట్లుండును? రెండవ చిత్రములో నామె విష్ణుమూర్తియొక్క శిరస్సును ఖండించెను. అప్పుడామె మొగ మెట్లుండెను- పురుషుడొక స్త్రీని ప్రేమించును. ఒకస్త్రీ కోపముగా నున్నప్పుడు, మలిన వసనధారిణియై యున్నప్పుడు, దుఃఖితయై యున్నప్పుడు చూచి యెవ్వడు దానిని ప్రేమించడుగదా! ఆమె సుఖముగా నున్నప్పుడు, వ్యవహారదశయందు లీలగా సంచరించుచున్నపుడు, సుఖములైన వేళలలో నెప్పుడో, ప్రశాంతమైన ముఖలక్షణములుగల యెప్పుడో యామె సౌందర్యమును చూచి మోహించును. పెండ్లియైన తరువాత, తొలితీప తగ్గిన తరువాత కలసి సంసారము చేయుచున్నప్పుడు భార్యయొక్క కోపమో ఈర్ష్యయో తిరస్కారలక్షణమో పురుషుడు తెలిసికొనును. తత్పూర్వ మామెకు కోపము వచ్చుననిగూడ వానికి తెలియదు. అదియేమి? రాతి బొమ్మయా? తొలుత చూచినప్పుడెట్లుండెనో చివరిదాక నట్లేయుండుటకు? ఈమెను తాను పెండ్లిపీటలమీద చూచెను. మరల నేడు పానుపుమీద చూచెను. మహాప్రసన్నురాలై యుండెను. ఈమెకు కోపమువచ్చినప్పుడెట్లుండును? అది వట్టికోపమా? భర్తయొక్క శిరస్సును ఖండించి నంతటి కోపము. అంతటికోపము స్త్రీకి వచ్చునా? ఎంతకోపము వచ్చినను సత్కులీన, విద్యావతి, పరమసౌందర్యవతి, శాంతిత్వము మూర్తికట్టిన ముఖలక్షణములు కలది భర్తను సంహరించునా? నీచస్త్రీలు, దుర్జాతులు, పాశవికప్రవృత్తులు కలవారు చంపినచో చంపుదురు. లోకమునందట్టి వార్తలును కలవు. వారు శూర్పణఖలు. అతి రాక్షస ప్రవృత్తులు. పాలకడలిలో పుట్టిన స్త్రీ, చందురుని తోబుట్టువు, పద్మమునందు నిచ్చలు నివసించునది, యిట్టిస్త్రీ భర్తను సంహరించుటయేమి? ఆమెయే యీమె యైనచో, తద్వధవేళ తన్ముఖదర్శనము చేసి తీరవలయును. అతడు లేచి అచ్చోటికి పోయెను. ఆ గోడభాగము కొంత చీకటిలో నుండెను. మంచముమీద నున్న పందిరికి కప్పిన వస్త్రమును ముత్యాల జాలరులును దీపమునకు అడ్డమువచ్చి ఆ చీకటి పడినది. అతడు మంచము మీదికెక్కి కాళ్ళతట్టున నున్న పెండెముమీద నెక్కి జాలరులను తొలగించి వానిని పైకి వేసెను. వెలుతురు రెండు లక్ష్మీమూర్తులమీద పడెను. ఆ జాలరులను పైకి వేసెనే కాని, అవి మరల క్రిందికిజారి పడుచున్నవి. వానిని పట్టుకొనుట, బొమ్మను చూచుట రెండును ఒకేసారి సంఘటిల్లుట కష్టముగా నున్నది. ఆ మంచమునకున్న, జాలరులలో వాయవ్య దిశయందున్న జాలరులు గుప్పెడు పశ్చిమదిశయందున్న గుప్పెడు ఉత్తరదిశై కలిపికట్టి పందిరియొక్క పైభాగము నందలి నిలువుపట్టెకు అడ్డపట్టెకు బిగించి కట్టవలయును. కట్టినకాని సామాన్యముగా అతనికి చిత్రములయొక్క దర్శనము కలుగదు. ఆటునిటు జాలరులను రెండు రెండు గుప్పిళ్లుగా పట్టుకొని కట్టి పట్టెలమీద పెట్టుటకు త్రాళ్ళు కావలయును. అతడు త్రాళ్ల కోసము వెదకెను. త్రాళ్ళెచ్చట దొరకును? తన ఉత్తరీయపు టంచులనుచింపి వానిని బిగించి కట్టెను. అప్పుడు సుఖదర్శన మేర్పడెను. దేవియొక్క ఆ క్రోధాకారములను చూచెను. అతనికి నేలమీద పడిపోదునేమో అనిపించెను. క్రింద పడకుండ స్తంభమును పట్టుకొని దిగెను. వచ్చి మంచముమీద పండుకొనెను. అతనికి ఏమియు తోచుటలేదు. ఏదో గుండెలో నుంచి

కడుపులోనుంచి దేవుకొని వచ్చుచున్నట్లుండెను. అది ఏమి? ఇదమిత్థమని నిర్ణయింపరాకున్నది. అది ఏమియో ఎట్లు తెలియును? ఓహో! తానెంతటి దురదృష్టవంతుడు. ఒక మహాపుణ్యమును చేసెను. తదనుభూతికి స్వర్గమునకు తీసికొనిపోబడెను. అచ్చటను ఇంతలో ఋషి శాపము సంభవించెను. ఒక మహాసభా భవనమును నిర్మించెను. ఆనాడు గృహప్రవేశము. సభయందు తీర్చి కూర్చుండెను. దాయాది గోతులు త్రవ్వి సింహాసనముమీద నున్న రాజును సింహాసనముమీదనే కత్తితో పొడిచెను. గంగాస్నానము చేయుటకు పోయెను. నీటిలో గొట్టుకొనివచ్చిన త్రాచుచేత దష్టుడయ్యెను. ఇదియేమి? ఆ క్రోధమూర్తి కూడ యీమెయేనా? ఒక్క వ్యక్తియందలి రెండు మనోభావప్రకటనములకు ఇంత భేదముండునా? ఉండునుగాక! తన మనస్సులో ఏదియో యున్నది. అది బయటకు వచ్చుట లేదు. ఊహకందుటలేదు. తీంగా కూడ భాసించుట లేదు. అది ఏమి? అది యేమి? అది ఏమి? ఇంక కొంచెముసేపటిలో ఆమె వచ్చును. ఆమెను స్వీకరించుటకు యోగ్యమైన మనఃప్రసన్నత తనవద్ద లేదే! తానిప్పుడేమి చేయవలయును? నీ క్రోధాకారమును నేనా చిత్రములో చూచితివి. అంత భయంకరాకృతిని నేను సహించలేను. నీవు నాకు వలదందునా? ఆమె నన్ను పరిహసించును. నేనవివేకి ననుకొనును. ఒక మహానది వరదల మీద నుండును. ఒడ్డులను త్రెంచుకొని గ్రామములను నాశనము చేయును. పరమ కలుషితాకారయై ప్రవహించుచుండును. అడవులలోని వృక్షములను నిర్మూలించును. అవి కొట్టికొని వచ్చుచుండెను. చనిపోయిన జంతువులు కొట్టుకొని వచ్చుచుండును. అంతకంటె మహాభయంకరమూర్తి ఎచ్చట నుండును? ఇంతలో దక్షిణమున కతకాఫలమురీతి కలశసూతి కలకనీరంతను గత కల్మషము చేయును. ఈమె పొంగు తగ్గును. ఆ ప్రవాహము క్షేత్రములమీదికి మరలించబడెను. పంటలు పండును. ఆ భయంకరమైన మూర్తిని చూచి ప్రశాంతమైన యేటినీళ్ళు పొలాలకు మరలించుకొనని బుద్ధిహీనుడుండునా? కాని ఆ మహానదీ స్వరూప పరిజ్ఞానము ఉండవలయును. జలస్వభావము తెలిసికొనవలయును. నది ప్రవహణశీల యన్న విజ్ఞానము ఉండవలయును. రాజ్యమెట్టిదో ధాత్రి ఎట్టిదో స్త్రీ అట్టిది. సేవించినకొలది ప్రసన్నయగును. ప్రేమించినకొలది సుఖదాత్రి అగును. విరోధించిన కొలది కలుషితురాలగును. సుఖసస్యమును పండింపకొననెంచితివో శరత్కాలమునందలి నదీ దేవతను ఆరాధింపుము. శరత్కాలము నిలబెట్టుకొనుము. శారదోత్సవములను చేయుము.

# 3

అతని మనస్సు స్వస్థపడెను. జీవునియొక్క యాశయెట్టిది? దానిబలము మిక్కలి దొడ్డది. ఇంత గగ్గోలైన మనస్సునుండి ప్రసన్నతాగుణమును, ఆభిముఖ్యమును త్రవ్వి తెచ్చికొనెను. అన్నింటికి అన్ని సమాధానములు కల్పించి కొనెను. ఒక్కటి నిశ్చయించుకొనెను. తాను ఈ చిత్రములనన్నిటిని చూచినట్లు మనసులో ఇంత మధనపడినట్లు చివరకు మనస్సును సమాధానపఱచి కొన్నట్లు ఆమెకు తెలియరాదు. అందుచేత ప్రశాంతముగా పండుకొనెను. కనులు తెఱచియే

యుండెను. దక్షిణపు తలాపిగా పండుకొనియుండుట చేత మంచపు పందిరియొక్క వామపాద ప్రాంతమునందలి జాలరు లెగకట్టినవి కనిపించెను. వెంటనే లేచి వాని ముడులూడదీసెను. జాలరులు క్రిందికి వ్రేలాడుచుండెను. కాని యుత్తరీయపుటంచులు చించినవి మిగిలిపోయెను. వానిని దాచవలయును. వానిని దాచినచో ఏమి ప్రయోజనము? ఉత్తరీయము కనిపించునుగదా! అది బంగారపు పట్టంచుటుత్తరీయము. పొడుగుగా రెండువైపుల పట్టంచున్నది. అడ్డముగా రెండు చివళ్ళ జరీయున్నది. అట్టి ఉత్తరీయములు చించినచో నిలువుగా చించవలయును కాని, అడ్డముగా చించుటకు వీలులేదు. నిలువుగా చించవలసినచో, అంచులు రెండు చించవలసివచ్చును. అడ్డముగా చించుటకు వీలులేదు. పట్టంచులు పెగులవు. మరియు అట్టి ఉత్తరీయములు నేయుటయందు నిలువుగా ఒంటిదారములు వేసి అడ్డముగా జమిలిదారములు వేయుదురు. లేదా నిలువుగా జమిలి దారములు వేసి అడ్డముగా ఒంటిదారములు వేయుదురు. ఇది నిలువు జమిలిదారముల నేత. అడ్డముగా నా గుడ్డచిరుగదు. ఆ తొందరలో తాను సరిగా ఉత్తరీయమును చూడలేదు. మగ్గములమీద నేసిన వస్త్రములు నేయుట పూర్తియైన తరువాత, చివరిఅంచులు వేసి, పది అడ్డదారములు వేసి, రెండు వ్రేళ్ళ యెడము వదలి, మరల నైదారు దారములు దగ్గరదగ్గరగా వేసి, మరల వదలిపెట్టుదురు. ఈ వదలిపెట్టిన భాగములో చించినచో వస్త్రము సులభముగా చిరుగును. ఈ పట్టెలను చింపుదురు. వానిని భద్రపఱతురు. ఏదో దేవతా ప్రీత్యర్థము, గృహములలో శుభసమయములందు, అఖండములను వెలిగింతురు. దానికి వర్తిగా నీ నూత్న వస్త్రఖండములను పేని వెలిగింతురు. ఈ ఉత్తరీయమునకు రెండు వైపుల అట్టి వున్నవి. వానిని జించినచో తనకు గావలసిన రెండు త్రాళ్లను వచ్చెడివి. ఉత్తరీయము ఉత్తరీయముగా నుండెడిది. ఇప్పుడు విచారించి ఏమి ఫలము? ఆమె ఈ ఉత్తరీయమును చూచి, నది యేమని అడిగినచో ఏ మి చెప్పవలయును? నిన్ను నా కిచ్చి పెండ్లిచేసిన తండ్రి మన శుభకార్య సమయమందు నా కిట్టి ఉత్తరీయమును ప్రసాదించె నని పరిహాస మాడవలయునా? ఆమె విశ్వసించునా? అది యట్లుంచి ఈ రెండంచుల నేమి చేయవలయును. అవి బంగరు జరీ అంచులు, తళతళ లాడిపోవుచున్నవి. తానిప్పుడు పరిశీలించి చూడగా నా జరీ జమిలిపోగుల నడుమ సన్నసన్న రత్నములు ముత్యము లున్నవి. ముడివేసిన వేళ నొండు రెండు నేలమీద పడెనో? ప్రక్కమీద పడెనో? లేచి వానిని వెదుక వలయునా? ప్రక్కమీద నున్నవేమో చూడవచ్చును. ఆ మంచమనగా నెంతటి మంచము? దానిమీద పదిమంది యడ్డముగా పండుకొనవచ్చును. పాదములుగాని శిరస్సుగాని పట్టెలను దాటిపోవు. అది యంతటి మంచము. ఇట్టి మంచములు తన కోటయందును కలవు. తన రాజగృహములందును కలవు. అది యతనికి అబ్బురము కాదు. అంతమేర నింతటి సన్నని రత్నము లెందుపడెనో వెదకుట కష్టము. ఏమి కష్టమనగా పరచిన దుప్పటియు నట్టిదే. చిక్కగా నక్షత్రము లత్తుకొన్న యొక ఆకాశఖండము నందు రత్నములు చల్లబడినచో నేది నక్షత్రము? ఏది రత్నము? కాని పరుపులమీద పరుపబడిన దుప్పటిలోని నక్షత్రకాంతు లీను ప్రదేశములు మేనికి గ్రుచ్చుకొనవు. ఇవి యున్నచో గ్రుచ్చుకొనును. కానిమ్ము. ఇప్పుడీ అంచులేమి చేయవలయును? అతనికే నవ్వువచ్చెను. ఒక యంచు పూలమాలవలె గదియించి, రెండవయంచు మాలయొక్క నడిమిభాగమున చెండువలె నమర్చెను. ఆమె వచ్చినంతనే యీ కనకరత్న మయ

హారమామె మెడలో వేయుద మనుకొనెను. ఇంతలో నతని దృష్టి ద్వార దక్షిణపార్శ్వస్థ తత్ప్రతిమ మీద పడెను. ఆ ప్రతిమ మెడలో వేసినచో నెట్లుండును? ఆమె వచ్చి చూచికొనును. లేదా తాను చూపించును. ఆమెకు తృప్తికలుగదా? సంతోషించదా? ఒక విధముగా చూచినచో దీని నామె మెడలో వేయుటకంటె, ప్రతిమమెడలో వేయుటయే రమణీయము. ఆమె నిత్యమును రత్నముక్తాహారములను ధరించునదియే. ప్రతిమమెడలో వేయుటయే ఆరాధనా విశేషము. ప్రతిమమెడలో వేసినచో తానామెను దేవతగా చూచుచున్నట్లర్థ మిచ్చును. ఆమె మెడలో వేసినచో వట్టి స్త్రీగా చూచినట్లుండును. అతడు లేచి వెడలి యీ హారమును ప్రతిమమెడలో వేసెను. వేయుచు మరల నా ప్రతిమయొక్క యవయవములను స్పృశించెను. మెడలో హారము వేసెడు నెపమున, హారములు సర్దెడు నెపమున, ప్రథమ సమాగమవేళ పురుషులు స్త్రీల హృదయమును స్పృశింతురు. మరల నతనికి తన తొలిదోసము స్ఫురించెను. నిండ మునిగినవానికి చలియేమి? మరల వచ్చి పండుకొంద మనుకొనెను. ఆమె వెడలి పోయి ఎంతసేపైనది? అప్పుడు ప్రథమ యామము గడచినతరువాత నర్ధయామ ఘంటా నినాదము వినిపించెను. మరల ఘంటా నినాదము వినిపించలేదు. ఇప్పటి కర్ధరాత్రము కావచ్చును. ఇంతలోననే ద్వియామ ఘంటానినాదము వినిపించవచ్చును. అనగా నిప్పటికి అర్ధయామము గడచినదని యర్థము. తా నెన్ని యెన్ని యూహలు త్రవ్వుకొనినను, మనసులో నెన్ని గుడుసుళ్ళు పడినను, ఘంటానినాదము వినబడనంత పరమవ్యగ్రతను భజించి నట్లు లేదు. అర్ధయామమనగా నిశలో నెనిమిదవ భాగము. ప్రతీక్షావంతున కది దీర్ఘకాలముగాని సామాన్యునకు కాదు. ఆమెయు నెప్పుడు వచ్చును? అందరు నిద్రపోయిన తరువాత కాని రాదు. నిశార్ధభాగము దాటకుండ నందులో నిట్టి యుత్సవసమయములందు పెక్కుమంది నిద్రపోరు. అంతటి యేకాంతవేళ, నంతటి నిశ్శబ్దసమయమున నామె వచ్చును. ఆమె వచ్చుట కర్ధరాత్రి ఘంటానినాదము వినిపించవలయును. మరికొంతసేపు దాటవలయును. అతడిట్లనుకొను చుండగనే ఘంటానినాదము శ్రూయమాణ మయ్యెను. ఆమె వచ్చుట కింక కొంత యాలస్య మున్నది. మరల తత్ప్రతిమాదర్శనము చేత సంతోషము ననుభవింతము. అట్లు కాదు. మంచముమీద పండుకొని నిద్రాభినయము చేయుదము. ఆమె వచ్చి తన్ను నిద్రలేపునా? ఇచ్చట వీణమేళవింపబడి యున్నది. వీణానినాదము సలుపునా? పళ్ళెరమున పుష్పము లున్నవి. వాని నంజలిలో గ్రహించి తనపైన వాన కురిపించునా? ఆమె వచ్చినచో కాలి మంజీరముల నినాదము వినిపించును. మంజీరనిస్వనము సన్నగింపించి వచ్చునేమో? శీలమండలచుట్టు సన్నని గుడ్డచుట్టి దానిపైన మంజీరములు ధరించినచో నిస్వానము సన్నగిల్లును. ఆమె వచ్చునప్పటికి తాను మేల్కొని యుండవలయును. ఈ యూహ యేమి? తనకు నిద్రపట్టునా? పోయి పండుకొనెను. కన్నులు మూసికొనెను.కాని వాని యంతట నవియే తెరచుకొనుచున్నవి. తెరచుకొన్న కన్నులు ద్వారములను ప్రతీక్షించుచున్నవి. అనగా శిరస్సటు మలగె నన్నమాట. ఎట్లు నామె వచ్చుటకు నాలస్య మగును. తానన్నిటిని పరీక్షించినాడు. కాని ద్వారబంధమును పరీక్షించలేదు. శయ్యాగృహమున కింత పెద్ద ద్వారబంధ మెందులకు? ఇది దారువుతో చేయబడినది. ఈ దారు వెచ్చటిది? వింధ్యపర్వతములలోనిది. తనకు దెలియును. ఈదారు వెప్పుడు తెప్పించిరి? ఎప్పుడు దీనిని చెక్కించిరి? ఆమె తన్నువరించుట, వివాహము

నిశ్చయమగుట, తాము తరలివచ్చుట అంతయును కలిపి పదిదినములు కాలేదు. ఇచ్చటి నుండి దూతలు కాశ్మీరమునకు వేగరులైన గుర్రములమీద మూడుదినములలో వచ్చిరి. మరల మూడుదినములలో తిరిగివచ్చిరి. వెంటనే లగ్నమును నిశ్చయింపవలసినదని వారేవార్త పెట్టిరి. తాను తన కార్తాంతికుల చేత నప్పుడే లగ్నమును నిర్ణయింపించి, దూత లిచ్చటకుచేరిన నాల్గుదినములలో లగ్నమని తెలియజేసెను. తాను మరునాడే బయలుదేరి వచ్చెను. పదిదినములలో యీ శయ్యాగృహ నిర్మాణ మెట్లు? ఇంతటి శిల్పరచన యెట్లు? ఈ ద్వారబంధ నిర్మాణ మెట్లు? అతని యూహ కందుట లేదు. ఆ ద్వారబంధముకూడ క్రింది భాగమునందున్న లతలు పుష్పములు మృగములు కనిపించుచున్నవే కాని పై భాగమున కన్పించుటలేదు. గడప యున్నది. గడప మొత్తముమీద నిరలంకారముగనే యున్నది. పసుపు కుంకుమ వన్నెలతో చేసిన లతలేకాని చెక్కిన శిల్పములు లేవు. ద్వారబంధముయొక్క యెడమవైపు పట్టెనొకడు పరీక్షించెను. అన్నియు లతలు, యీరములు, తోరణములు, స్తంభములు, కిన్నరీ ప్రతిమలు, పుష్పాపచయవ్యగ్రకాంతా రూపములు. కాని ప్రతిచోట లక్ష్మీ విగ్రహ మున్నది. కిన్నరీ స్త్రీలు లక్ష్మిమీద పుష్పాభిషేకము చేయుచున్నారు. పూలమాలలు తోరణములుగా పట్టియున్నారు. లతలు పుష్పించినవి. ప్రతి పుష్పమునందు లక్ష్మీమూర్తి. చెరువులో కమలములు వికసించినవి. ప్రతి దానియందు లక్ష్మీమూర్తి. ఆ లక్ష్మీమూర్తియెవరిది? అంత స్వల్పమైన విగ్రహములయందు ఆకారము నిరూపింపబడుట కష్టమే, కాని గుర్తుపట్టుటకు ప్రధానమైన చిహ్నమున్నది. అది పాపట లోని చంద్రవంక. ఆచంద్రవంక ఒకచోట నువ్వు గింజంత. నువ్వు గింజంత యనుటకంటె నువ్వుపప్పంత. అతడు పోయి పండుకొనెను. ద్వారమువద్ద యామె పాదవిన్యాసము కొరకు ప్రతీక్షించుచుండెను.

## చతుర్థాధ్యాయము

## 1

అతడు ద్వారమువంక చూచుచుండగనే అతని కనులు మిరమిట్లుకొనెను. గడపవంక చూచుచుండెను. నల్లని త్రాచు పడగయెత్తి గడపమీద నాడినట్లాడి తలవాలిచి పడగను గడప లోపలి దేశమున హత్తెను. హత్తిన పడగ మీద మణులు ధగధగ లాడుచుండెను. అతడేమి చేయవలయును? లాఘవమున లంఘించి దానిని ఫణాదేశమునందు పట్టుకొని ప్రాణములు పోవువరకు బిగించి పారవేయవలయునా? అతని మనస్సులో నొక్కసారి పదియూహలు వచ్చెను. ఈ సమయమునందే ఆమె వచ్చుట తటస్థించినచో నామె యేమగును? అశుభముగా నూహించరాదు, గాక సర్పదష్ట యగును కదా? తన దురదృష్టమేమి యనుకొనవలయును. తాను తొందర పడినచో నది సర్పము కదా యెచ్చట నక్కునో? యే సందున దూరునో? దాని వేగమున కవధి యుండదు. అది పోయి యామె ప్రతిమచాటున నున్న సందులో దూరి నచో, దానిని బహిర్గమింపజేయుట దుస్సాధ్య మగును. తాను కదలినచో నది వెంటనే

కదలికను గుర్తుపట్టును. దానిని సరిగా లోనికి రానీయవలయును. దానిని వధించుట యెంతసేపు? తాను గరుత్మంతునివలె నెగురగలడు. కన్నురెప్ప వాల్చకుండ దానివంకకు చూచుచుండెను. నేలనానియున్న పడగమీద మణులు భాసించుటయే కాదు, ఆ పడగకు రెండువైపుల నెఱ్ఱగా నున్నది. పైన రెండెఱ్ఱని రేఖలున్నవి. రెండురేఖల నడుమ నొక యెఱ్ఱని బొట్టున్నది. ఆ భుజంగము నల్లనిదా? పచ్చనిదా? నల్లనిది కాదు. గోదుమ వన్నెత్రాచు. పట్టి పడగను చూచి సర్పముయొక్క కాంతిని నిర్ణయించుటకు వీలులేదు. అది పడగ యెత్తినప్పుడు పడగ లోపల శంఖచక్రములు విస్పష్టముగా కనిపించినవి. ఇది యేదో యుత్తమజాతి సర్పము. ఎక్కడనుండి వచ్చినది. కక్ష్య కక్ష్యాంతరములు దాటి, సేవకుల నెలయించి, పరిచారకుల కన్నులకు కనిపించకుండ నే గోడమూలనుండి ప్రాకి వచ్చినది? ఈ యుత్తమజాతి సర్పమును తాను చంపవలయునా? చంపక యేమి చేయవలయును. ఆ సర్పమీ గదిలో సంచరించుట తనకు భద్రమా? తన భార్యకు క్షేమమా? పడగవాల్చినది, జరిగి సుంత ముందుకు రావలయునుగదా? తనయం దేసన్నని కదలిక కలిగినను సర్పము తన ఫణామండలమును వెనుకకు దీసికొనును. అది బయటకు వెళ్ళినచో తాను చేయగలిగినది లేదు. ఆ మహాభుజంగము కొంత జరిగి లోనికి రావలయును. దానిని సంహరించుట సులభమగును. తన మెడలో రత్నహార మున్నది. నాయకమణి యున్నది. హారమునకు నడుమ నాయకమణి కొక్కెమునకు తగిలింపబడి యున్నది. దానిని సులభముగా తొలగింపవచ్చును. ఆ మణితో గురిచూచి కొట్టినచో దాని శిరస్సు ఫెడేలున పగులును. దానిని మరికొంత సాగనిమ్ము. ఆ భుజంగము ఫణమును వాల్చినదే కాని ముందునకు సాగుచున్నట్లు లేదు. తాను తన మెడలోని మణిని తీసి చేతిలో పుచ్చుకొని వ్యగ్రముగా నుండెను. తన గురికానితనము తనకు తెలియును. బాణము గాని చురకత్తిగాని హస్తమునందలి శిలకాని తానే స్థితిలో నున్నను కొట్టి లక్ష్యమును భేధించగలడు. తాను లేచి కూర్చుండవలయును గురి చూడవలయును మొదలైనవి లేవు. తన చేతికి మనోవేగ మున్నది. చేతియందు కొండయొక్క బరువున్నది. తాను మణిని విసరకలడు. భుజంగమును సంహరింప గలడు. పెండ్లికూతురు వచ్చుచున్నచో నలికిడి తగులును. మంజీరనిస్వనము మిక్కిలి మందముగానైన వినిపించును. తాను తొందరపడ నక్కరలేదు. భుజంగమును లోనికి సాగనిమ్ము. ఇంతలో తత్ఫణాపార్శ్వములందలి యరుణిమ, పై భాగమందలి యరుణ రేఖలు, యరుణ రేఖల నడిమి యారుణ్యబిందువు పరామృష్టములై యావర్ణము మాణిక్యవర్ణము కాక మరియొక వర్ణముగా కనిపించెను. ఫణి పార్శ్వములందుగాని, ఫణోర్ధ్వదేశమందుగాని, మాణిక్యపార్శ్వ రేఖలు ప్రసిద్ధములు కావే! ఈ పాము నిర్యాసబంధురమైన ఉక్షాతరుస్కంధముల నొరసికొని వచ్చెనా? సాయంసంధ్యా కాంతులలో విహరించి వచ్చెనా? గిరిధాతు దరీఝరుల యందు స్నానమాడి వచ్చెనా? ఈ యూహ లతనికి వచ్చిన వెంటనే విచిత్రముగా భుజంగభ్రాంతి తొలగిపోయెను. ఫణాధః ప్రదేశమునందలి సర్పదేహయష్టి ప్రథమ భాగమును చూచెను. ఈ సర్పరాజా ఫణామండిత రత్నాభరణుడే కాదు. పార్శ్వసంసక్త లాక్షారుణిమ మధురమూర్తియే కాడు. కంఠదేశమునందు హారములు కలవాడే. అంతట రాజా ఆ పెండ్లికూతుయొక్క పాదతలమున దానియొక్క సౌందర్యమును లాక్షారసలిప్త పార్శ్వదేశ రామణీయకమును, పై భాగమునందలి కనకమయ నూపురమును, భావించుచు నొక తన్మయత్వమును

భజింపుచుండెను. క్రమముగా తనదృష్టి కూర్ధ్వప్రసరణము కల్పించి యామె మూర్తిని చూడవచ్చును. ఆమె మూర్తినెందుకు చూడవలయును. అచట నున్న ప్రతిమూర్తియే కదా? అయ్యయో! తనదృష్టిని పైకి మరలించినచో తనజన్మలో నింకొకసారి యీ పాదరామణీయకమును దర్శించుట కలుగునా? ఏకదేశ సౌందర్యము సర్వావయవ సమాహారభూత మహాసౌందర్య వారాన్నిధిలో మునిగిపోవును. దానిని ప్రత్యేకముగా భావించుటకు వీలుండదు. ఇప్పుడు తప్ప మరియొకవేళ నది సాధ్యపడదు. ఆమె శరీరమునుచూచి దానియందు లగ్నబుద్ధియగును. ఆమె కనులు చూచినచో మరల నాదృష్టి పాదములుమీదికి మరలదు. మరియు నీ మె తన సౌందర్యముచేత, మహానుభావముచేత, తన భావనాబలముచేత, తన శక్తిసంపన్నత చేత, పదిదినములలో నింత మహాశిల్పమును రచియింపగల మహామహిమత్వముచేత దేవతా మూర్తియేలకాదు? ఆమె ధ్యేయురాలు. ఉపాసకుడు, మూర్తి కల్పనవేళయందు పాదములనుండి ప్రారంభించవలయును. తొలుత చరణాంభోరుహయుగ రూపమును సన్నిధానపఱచుకొనవలయును. ఆమె యొక్క దక్షిణపాదము తొట్టతొలుత నాకు నుత్తమ భుజంగఫణా రమణీయముగ దర్శన మిచ్చినది. దీనిని నేను మరువరాదు. ఈ చరణాంబురుహము యావజ్జీవము నాకు గుండెలో స్థిరపడిపోవునట్లు నిశిత వీక్షాపరంపరచేత చేసికొనియెదను. ఆమె నేను తన చరణదర్శనము చేయుచున్నానని తెలిసికొనునుకదా! తచ్చరణముయొక్క సంపూర్ణముద్ర బ్రతికియున్నన్నాళ్లు చెరుగనిది. నాలో నెప్పుడు స్థిరపడునో ఆమెకే తెలియును. అప్పుడామె లోనికి వచ్చును. అప్పుడే యామెను దర్శింతును. అప్పుడే యామె కెదురు పోదును. ఆమె పాదము నిట్లు చూచుచుకూడ నేనామెను దర్శించనిచో, తాను తిరస్కృతురాలనని ఆమె భావించి వెడలిపోవునో? ఆమె యేమి! నిజముగా భుజంగము కాదుకదా? పడగ వెనుకకు లాగికొని జరజర పాగిపోవు భుజంగమును పట్టుకొనవచ్చును. పట్టుకొనరాదు. ఆమె తన కాలును వెనుకకు వేసినచో నేను శోభనపు పెండ్లికొడుకును కాను, యుద్ధవీరుడను. అర్ధగవ్యూతిమేర నున్న శత్రువుపైకి లంఘించి, వానిని క్రిందకి ద్రోసి, కంఠమును గ్రసింపగలవాడను. ఆమెకు నా పరాక్రమము శౌర్యము లాఘవము తెలియగలదు. పదిమంది రాజకుమారుల చిత్రముల వరుసలో, నా చిత్రమును చూచి నా శరీరావయవ విన్యాస పరిస్ఫురిత పురుషసౌందర్యమును జూచి నన్నెన్ను కొనుట కాదు. నే నెట్టి క్షత్రియుడనో, నే నెంతటి రాజనో, నే నెంతటి లాఘవము కలవాడనో, నే నెంతటి ధీమంతుడనో, యెంతటి లంఘనాశక్తి నా యందు కలదో యామెకు తక్షణము తెలియగలదు. అతడిట్లనుకొనుచుండ రెండవ చరణము కూడ గడపలోనికి వచ్చెను. రెండు శిరస్సుల మహాసర్పము విప్పినపడగల నేలనాన్చినట్లుండెను.అతడు పానుపుమీద లేచి కూర్చుండెను. చరణములమీది దృష్టి తొలగించలేదు. మంచము దిగెను. నిలుచుండెను. దృష్టి పాదములయందే లగ్నపరచి యుంచెను. ఆమెను మన్నించుట యెట్లు? ఎవడో కామభావ దూషితుడు పోయి యామె హస్తాంగుళిని స్వీకరించి, యామెను దగ్గరకు లాగుకొని, చిబుకమును స్పృశించి, చాటూక్తులను పలుకును.తానట్లు చేయడు. ఆమె అట్లు చేయబడుటకు యోగ్యురాలు కాదు. అతని కొకటి స్ఫురించెను. తన యుత్తరీయపు టంచులు మాలగా నల్లి నిర్మించి తత్ప్రతిమాకంఠమున సమర్పించెను. ఇప్పుడా ప్రతిమాకంఠమున నున్న మాలిక తాను తీసికొనివచ్చి యామె మెడలో వేయును. అప్పుడే యామె నేత్రములవంక చూచును.

ఈ దండ నామె మెడలో వేయుటయు; తన్నేత్రదర్శనము, నొక్కసారి చేయును. తానా ప్రతిమవంకకు నడిచిపోగా నామె చూచును గదా? ఆ కంఠమునందలి హారమును తీయుట యామెకు ప్రత్యక్షమగునుకదా! దానిని తీసికొని తన వద్దకు వచ్చుట సువిస్పష్టమగునుకదా! తనమెడలో వేయుటకు వచ్చుచున్నానని యామెకు తెలియును. అప్పుడుగాని యామె ముఖదర్శనము చేయనని యామెకు తెలియును. అప్పుడామె ముఖమెట్లుండునో చూడవలయును. హయగ్రీవకథాశిల్ప ప్రథమ చిత్ర మందు ఘోరమైన యామె రూపమును చూచితిని. అది యెంత ఘోరమో యామెకు నిజముగా నంత ప్రసన్నతకలిగినచో నామె వదన మెట్లుండును? అమృతపుబావిలో చిరుమీను కదలగా నంకురించిన తరగయందలి సన్నని నొక్కులుండునా? నల్లని మబ్బు తొలగిన సంపూర్ణ చంద్రబింబము వలె నుండునా? దయారస మంతయు మూర్తికట్టినట్లుండునా? రెండునెలలు విరిసిన వసంత మొక్కక్షణమునందు చొచ్చినట్లుండునా?

# 2

అతడు ప్రతిమ కంఠమునందలి దండను తీసెను. చేతిలో గ్రహించెను. అతడు మంచము మీదనే కూర్చున్నచో నామె యేమిచేసెడిదో తెలియదు. ఇతడు లేచి తన మొగము వంకనే చూడకుండ ప్రతిమాభిముఖముగ పోయి ప్రతిమా కంఠగతహారమును స్వీకరించుటయు  తనవంకకు వచ్చుట జరుగుచునుండెను. అతని యుద్దేశ్యము నామె నేత్రములవంక చూడకుండ మెడలో హారమువేసి తరువాత నేత్రములవంక చూడవలయునని. భర్త కన్నులలో చూడకుండ భార్య కంఠహారమును భర్తమెడలో వేయుట లోకమునందు కలదు. భార్య కన్నులలో చూడకుండ భర్త ఆమె మెడలో వేయుట లోకములో లేదు. లోకములో లేదనగా స్వభావసిద్ధము కాదనుట, స్వభావమనగా స్త్రీపురుష స్వభావములు భిన్నము లనుట, తత్స్వభావము లల్పాల్ప విషయములందుకూడ భాసించుచుండును. స్త్రీకి లజ్జయుండును. పురుషునకు లజ్జయుండును. స్త్రీయొక్క లజ్జ నేత్ర భ్రూ కపోల కంఠ భుజములయొక్క చాలనమునందు కన్పించును. చరణవిన్యాసమునందు కన్పించును. శరీరావయవ చాలనమునందు కన్పించును. నిలుచుండుటలో కనిపించును. నడచుటలో కన్పించును. స్త్రీలకు కన్నులో కన్పించు లజ్జ ప్రధానముగా రెప్పలు వాల్చుటలో కన్పించును. చూపులు పరిహరించుటయందు కాన్పించును. నేత్రకాంతి యపాంగ ప్రసరణముచేత భాసించును. పురుషుని లజ్జ కిట్టి యవభాసములేదు. అతడు తన వాక్కునందలి యదుపుచేత వినయప్రదర్శనముచేత తన చేష్టలయందలి స్వేచ్ఛను నియమించుటచేత తన లజ్జను భాసింపచేయును. భర్తకంఠమునందు భార్య వివాహవేళగాని ప్రథమసమాగమవేళయందు గాని బంధుసమక్షమునగాని హారమును వేయవలసివచ్చినచో భర్తకన్నులలో కన్నులుంచి చూచుట పరిహరించును. అది స్త్రీకి సహజమే. ఇతడు పురుషుడు. ఇతడామె కన్నులలో చూడకుండ నామె కంఠమునందు హారమెట్టుంచును. అది సహజముకాదు. పురుషస్వభావముకాదు. ఆ హారమును బూని – అ[illegible]మా అది దండయా ఉత్తరీయపుటంచులు మెలిపెట్టిన త్రాడు. ఉత్తరీయాంచలమ[illegible] కనకమయ మగుట చేత రత్నగుంఫిత మగుటచేత కనకమయ హారమువలె కనిపించవచ్చును. కాని బంగారపు త్రాళ్ళయొక్క పుచ్ఛములుపైకి కన్పించుచునే యున్నవి. తల్లక్షణముచేత

వెం(డుకల (త్రాటివలె నున్నది. కనకమయపేశము లనవచ్చును. దానిని హారమనుట కంటె 'వెంటి' యనుట మేలు. గడ్డితో పేనిన త్రాటిని 'వెంటి' యందురు. తెచ్చితెచ్చి యొక వెంటి వంటిదానిని యొక వెంట్రుకలత్రాడువంటి దానిని దేవిగళమునం దర్పింపబోవుచున్నాడయ్యా! అని యతనికే యనిపించినది. తాను వివేకియైనచో పెండ్లికి బయలుదేరి వచ్చుచున్నప్పుడే యొకరత్నహారమునో మరియొకపచ్చలదండనో తీసికొని రావలయును. పెండ్లివేళ నామెకు మహాభూషణముల చదివించినమాట నిజమే. ప్రథమసమాగమవేళ భార్యకొక నగయో కొంత ధనమో యిచ్చుట లోకమునందొక యాచారము.ఆ యాచారము నారా జెరుగడు. వృద్ధులు లేరు. ప్రయాణము తొందరలో జరిగినది. వృద్ధపరిచారికలు చెప్పుదురు. అది చెప్పుట జరుగలేదు. కాని యా సమయము నందు నట్టి యాచార మొకడున్నదని యతనికి లీలగా స్మృతి వచ్చెను. దండను తీసికొని వచ్చి యామె సన్నిధానవర్తిత్వము జరుగబోవునంతలో నీ స్మృతి వచ్చుటయు తన చేతిలోని దండ దాని కెంతయేని యయోగ్య మగుటయు మెరుపువలె స్ఫురించి సహజముగా నీ దండ యామె మెడలో వేయునప్పుడు తప్పకుండ చూచెడితనము బదులు యిట్టి దండను వేయుచున్నా నన్నయొక మృదు పరిహాస హేలాలీలా దృష్టి యామెయందు నెఱపుచు దండవేసినచో స్వదోషము పరిహృతమగు నన్న హఠాదుద్భూతభావతాడనముచేత చేతులతో దండనెత్తి యామె కన్నులలో చూచెను. ఏమి! ఆమె కనులలో తానింతవరకు చూడలేదా? పెండ్లిపీటల మీద నామె తల వంచికొని కూర్చున్నది. ప్రక్కగా తన వంక చూచినట్లే యున్నది. ఆమె కన్నుల యందలి కాంతి ప్రసారము తన కనుభూతమైనట్లే యున్నది. పాపటలో చంద్రవంక పొదిగినప్పుడు కన్నులెత్తి తనవంక చూచినది. ఆ కన్నులీ కన్నులు కావా? ఆ కన్నులు పెండ్లిపెద్దలను చూచుటకు నుపయోగపడినవా? ధీరప్రహ్లాద దర్శనయోగ్యములా? అప్పుడా కన్నులను చూచి తను తబ్బిబ్బు పడలేదే? మరల నీ నిశాప్రథమ భాగమున పాన్పుపై చెండ్లాట యాడినప్పుడు ముత్తయిదువులు పాటలు పాడినపుడు రాజవృద్ధస్త్రీల పరిహాసములు దూరముగా వినిపించినపుడు తానామె కన్నులను చూచినట్లే యున్నదే! అవి నిండు కన్నులు కాదు. అరమోడ్పులు పావుమోడ్పులు. ఇవి నిండు కన్నులు. ఈ కన్నులు పెండ్లిపెద్దలకొరకు ధీరప్రహ్లాదుని కొరకు నుద్దిష్టములు కావు. తనకొరకు ప్రథమసమాగమువేళా నిశాపరభాగము నందు భర్త్రర్థము నిలువచేసిన కన్నులా? ఇవి యేమి కన్నులు? ఆకర్ణాంత విశాలనేత్రములు పద్మపత్రాయతాక్షములు. కన్నులు పద్మములవలె నుండుననుట యేమి? కన్నులేమి? చరణపద్మము లందురు. ముఖమును పద్మమందురు. నేత్రములను పద్మ మందురు. హృదయమును పద్మమందురు. ఇన్నిటికి పద్మముతో పోలికయేమి? తానొకప్పుడు ప్రాతఃకాలమున- తన యుద్యానసరసిలో తెచ్చి నాటించిన సహస్రదళ పద్మము విరిసెడిక్రమము లిప్తాంశభాగములయందుకూడ సూక్ష్మ సూక్ష్మముగా పరిశీలింపనెంచి కూర్చుండి చూచెను. ఆ పుష్పముయొక్క వికసనమే విలక్షణముగా నున్నది. విరియుచున్నది. విరియుచున్నట్లు లేదు. రేకలు కదలినట్లు లేదు. వికసనము జరుగుచునే యున్నది. కనులకు కనిపించని కదలిక యుండునా? ఆ పుష్పము సంపూర్ణముగా వికసించినది. పద్మము వికసించినదన నేమో తెలియ వలెనన్నచో తల్లిప్పైక దేశమున చూడవలయును. తాను చూచెను. ఇప్పుడీమె కన్నులు పద్మపత్రసమాన కాంతులన్నమాట కర్థము తెలిసెను. ఆనాడు తాను చూడకపోయినచో నీ నాటి యీ నేత్రదర్శనము తనయందు

వై యర్థ్యమును భజించెడిది. తన పూర్వజీవితమునందలి వివిధ ఘట్టములు తన యామెతోడి సమాగమ రహస్యానుభూతియొక్క పరమార్ధ విజ్ఞానము కొరకేర్పడినవా? ఇప్పుడు తెలియుచున్నది. బ్రహ్మదేవుడు పద్మమునందుద్భవించినాడు. లక్ష్మీదేవి పద్మమునందు నివసించుచున్నది. హృదయము పద్మము. యథార్థమైన వికసనము సాధ్యమైన చోట్లవి. తా నామె నేత్రముల యందు చూచుచున్నాడు. ఆ నేత్రముల లో తెంత? అది యేమి?కన్నులకు లోతుండునా? ఆ కాంతి యెట్టిది? తద్గత భావ మెట్టిది? తత్కాంతియందు వివృతమగుచున్న భావమెట్టిది? ఆ భావముయొక్క స్వరూప మెట్టిది? దీని పరిజ్ఞానము కలుగుట దానిలోతును తెలియుట ఆ కన్నుల కంత లోతుండుట యట్లుంచి ఆ కన్నులు తన కన్నులలోనికి చొచ్చుచున్నవి. తన మనస్సులోనికి చొరబడుచున్నవి. తన హృదయమునందు ప్రవేశించుచున్నవి. తన పూర్వజన్మలను త్రవ్వుచున్నవి. విస్మృతములైన సంస్కారములను వెలికితీయు చున్నవి. తన కేమియు తెలియుటలేదు. తనలో నేదో జరుగుచున్నది. నడుమ నడుమ నా కన్నులను చూచుచున్న ట్లున్నది. ప్రభాత శతపత్రనీరజ వికాసములని యింతకు ముందనిపించినది. మది యింకొక భావము ఉత్పన్నమగుచున్నది. ఇది యేమి? ఆ కన్నులనుండి యెవ్వరో యుదయించుయున్నారు. వారు శతప్రమితులు. మధురేక్షు చాపఖండముల వారు. రత్నమకుటమ్ముల వారు. జగద్విలోభనాస్యముల వారు. అంబుద నీలరోచిషులు. ఆమె నేత్రాంతములనుండి నేత్రాపాంగములనుండి నటునిటు వరుసలు కట్టి నల్లని తుమ్మెదలు వరుసతీరినట్లు సముద్భవించు చున్నారు. అంతర్హితు లగుచున్నారు. వారు ఆమె కంటి తుదలనుండి సముద్భవించు మన్మథులా? ఆ నేత్రములు పద్మములన్న భ్రాంతి చేత సమీపించు భృంగమాలలా? ఇది యెట్టి భ్రాంతియా? మన్మథుని యల్లెత్రాళ్ళు భృంగములట. వాని నిస్వనము జ్యా నినాదమట. వందమంది మన్మథుల ధనుస్సుల నుండి వినిపించుట వలన భృంగీ సంగీతనాదము ఝణేల్లు ఝణేల్లు మని రజతపర్వతగృహా ప్రతిస్వానమైన తొలియెద్దు రంకెలవలె నున్నది. కనులవంక చూచుటయేమి? ధ్వని వినిపించుటయేమి? అతని కేమియు అర్థము కాలేదు. తానామె ముఖదర్శనము చేయుచున్నాడా? వట్టి కన్నులలో చూచుచున్నాడా? ఒక యూహ మరల తోచినది. ఆమె వదనము నందలి ప్రసన్న త్వము ప్రసన్నతావధిగా కనిపించు ననుకొన్నాడు. అమృతపుబావి చిరుకెరటమువోలె నుండు నను కొన్నాడు. వసంతర్తు వంతయు ఒక్క క్షణమునందు చొచ్చినట్లుండు ననుకొన్నాడు. తానామె యొక్క కన్నులలోననే చూచుచున్నాడు. ఆ కన్నులలో నొక్క వసంతమేమి? శతసహస్రవసంత కిసలిత పుష్పిత శోభ యంతయు నున్న ట్లున్నది. తాను వాంఛించిన దొక్క వసంతమే. తనకు కన్పించుచున్నది శతసహస్రవర్ష వసంతములు. ఇది నిత్యవసంతము. ఇవి యేమికన్నులు? వరిపాలము కంకెలతో మొక్కజొన్నపాలము కండెలతో శరత్కాల పూర్ణిమానిశ నిర్మేఘ చంద్రకాంతితో శ్రూయమాణమగుచున్న రాఘవ పార్థ ధనుర్విద్యాపాటవముయొక్క కౌసల మెరుపులతో నూహ కతీతముగా భాసించుచున్న దేమి? విద్యాపాటవములు కనులకెట్లు కన్పించును. ఒక కీర్తి కనులకెట్లు కనిపించును. బుద్ధికి స్ఫురించును. ఆ స్ఫురణ కన్నులకు కనిపించినట్లని పించును. అతని చేతిలో దండ దండగానే యున్నది.

# 3

"ఆ దండ ఆ ప్రతిమయు నాది కాదు." అతనికి స్మృతి వచ్చెను. "ఆమె మెడలోనే వేసి రమ్మందువా?" ఆమె: "ఆ దండ యామెదే. అందుచేత యామె కంఠమునందే యుండుట మంచిది. ఆమె నా ప్రతికృతి. నేనే ఆమెను. ఆమెయే నేను. ఎక్కడనున్న నేమి? ఈ దండ యెక్కడిది?" ఆయన: "నా ఉత్తరీయపు టంచులను చింపి నేను పేనితిని" ఆమె: "ఎందుకు చింపవలసివచ్చినది?" అతడు మాటాడలేదు. ఆమె: "ఇంత సేపిక్కడయెట్లుకూర్చుంటివి." అతడు: "నిన్ను భావించుచు కూర్చుంటిని." ఆమె: "నన్ను భావించుటవలన నేమి సిద్ధించినది?" అతడు: "అంతసేపు నిన్ను భావించలేదు. ఈ గదియందున్న చిత్రములను చూచుచుంటిని" ఆమె: "అంతయు చిత్రముగానే యున్నది కాబోలు" అతడు: "చిత్రచిత్రముగా నున్నది. ఆమె: "నే నహంకారవతిని" అతడు: "అహంకారము యోగ్యమైనదే. అర్థమైనదే." ఆమె: "ఆ చిత్రమునందు నేను సముద్రమునుండి సముద్భవించితిని. నారాయణునకు ధర్మపత్నినైతిని. అతడు: "ఈవైపు చిత్రమునందు నారాయణునికంఠమునుత్తరించితివి." ఆమె 'నేనుభార్యగా పనికిరానన్నమాట.' ఆయన:నారాయణునిమీద నీకెందు కంత కోపము వచ్చినది?" ఆమె: "గ్రంథములలో లేదా?" అతడు: " నేనుచదివినట్లు లేదు. నాకు తెలియదు. హయగ్రీవమూర్తియనిమాత్రమే విన్నాను". ఆమె: "నేనైనను చదివినదే. వాడెవడో రాక్షసుడున్నాడట. వానిని లక్ష్మీదేవి మనసా భావించినదట. అది తెలిసికొని నారాయణు డామె యందు దోషమారోపించెనట. లక్ష్మీదేవికి కోపమువచ్చి నారాయణుని శిరస్సు నరికినదట." అతడు: "ఇప్పటికి నా మనస్సు కుదుటపడినది. లక్ష్మీదేవిని లక్ష్మీదేవిగా చెప్పుచున్నావు కాని నేనని చెప్పుటలేదు. ఈ కథాచిత్రము లన్నింటియందు లక్ష్మీ స్థానీయురాలుగా నీ ప్రతికృతులనే నిర్మింపించితివి." ఆమె: లక్ష్మియనగా నేమి? శ్రీ సమృద్ధి. ధనలక్ష్మి ధాన్యలక్ష్మి మొదలైనమాట లున్నవి గదా! వందపుట్ల ధాన్యముకళ్లములో రాసిపోసినచో నది లక్ష్మి. పదివేల బంగరు నాణెము లొకచోట కుప్పపోసినచో నది లక్ష్మి. ఒక మహావీరుడు శత్రువుల నప్రతిహతుడై నిర్జించినచో నది శౌర్యలక్ష్మి. లక్ష్మియనిన నింతియే. ఒకని యందు ఒకతెయందు యౌవనము సమృద్ధిగా నున్నది. దానిపేరు యౌవనలక్ష్మి. సమృద్ధియైన రాజ్యమున్నది. అది రాజ్యలక్ష్మి. నేను లక్ష్మిస్థానీయురాల నెందుకు కాకూడదు ? నాయందు సౌందర్యలక్ష్మి యున్నది. యౌవనలక్ష్మి యున్నది. అన్నిలక్ష్ములు నా యందు కలవు." అతడు: "నన్నెందుకు వరించితివి ?" ఆమె: నీ యందు లక్ష్మి ప్రసాదము కలిగించుటకు. నీకు ధనలక్ష్మి నిత్తును. ధాన్యలక్ష్మి నిత్తును. యౌవనలక్ష్మి నిత్తును. శౌర్యలక్ష్మినిత్తును." అతడు: నీవు దేవతవా? వీని నన్నిటిని యెట్లు ప్రసాదించగలవు? ఆమె: " మరల నదియే ప్రశ్నయా?" అతడు:" నేనీ ప్రశ్న నెప్పుడు వేసితిని? ఇదియే మొదటిసారి కదా!" ఆమె:" ఇది పదియవసారి. ఇది వరకెన్నిసార్లు వేసితివో గుర్తులేదు. అది యట్లుంచి నీ హృదయములో నొకవిషయమున్నది . అది మనసు లోనికి కూడ వచ్చుటలేదు. ఆ బొమ్మ చూచినప్పటి నుండి" అతడు: " ఏ బొమ్మ?" ఆమె: " నీవు, నీ చేత నీ యుత్తరీయపుటంచులు చింపించిన బొమ్మ. అప్పటి నుంచి నీ హృదయములో నున్న

యొక భావము పైకి వచ్చుటలేదు . నీకడుపులో దేవ్వుచున్నది." అతడు:" అవును అదేమిటి?" ఆమె:"అదియేమియో చెప్పుదునా? ఆ భయంకరాకారము నీవెచ్చటనో చూచినట్లున్నది. చూచితివి. ఎచ్చట చూచితివో గుర్తులేదు. ఎచ్చటనో చూచితినన్న విషయము కూడ స్ఫురణకు వచ్చుటలేదు"అతడు: " ఎచ్చట చూచితిని?" ఆమె: "ఇది రెండవ ప్రశ్న ." అతడు: మొదటి దేమి?" ఆమె: నీవుదేవతవుకావు. నాకు వరమెట్లునిత్తు వన్నది ." అతడు: అది ప్రశ్న కాదు." ఆమె: " కాక పోనిమ్ము. ఇవి రెండుసమస్యలు." అతడు: మరియును సమస్యలు కలవు. నీవు నన్ను వరించితివి.." ఆమె:"నీవు నన్ను కోరితివి. అందుచేత నీపేరు చెప్పగా నే నౌనంటిని."అతడు: " నేనునిన్నెప్పుడు వరించితిని?" ఆమె:"ఇదిమూడవసమస్య" అతడు:"ఈసమస్యలకు పరిష్కార మెప్పుడు? నీవుభార్యవు. నేనుభర్తను. నేనునీమెడలోపుస్తె కట్టితిని." ఆమె: "నీవునా మెడలో పుస్తెకట్టలేదు." అతడు: "నందు నంది సాక్షు లున్నారు." ఆమె: " సాక్షియనగా అక్షితో కూడుకొన్నవాడు. వారి కక్షులులేవు." అతడు: "అంతమందిలోనెవ్వరికినిలేవా?" ఆమె: "వారిలో నొక్కని కున్నవి. అతడు నన్నుతెలిసికొన్నాడు."అతడు:"ఆయనను నీవెరుగుదువా?" ఆమె: "అతడు కాశ్మీర దేశీయుడు. వృద్ధ బ్రాహ్మణుడు. నీవెంట వచ్చినవాడు" అతడు: "అతనిపేరు నీ వెరుగుదావా?" ఆమె."నీకు స్నేహితుడైన మంత్రియున్నాడే వానికి తెలియునుగదా?" అతడు: "నీవు నన్నెందుకు వరించితివి. నా ప్రాణములలో సముద్రమథనము కల్పించుటకా? నా గుండియను కవ్వము చేసి చిలుకుటకా? నామనస్సును గగ్గోలుపఱచుటకా?" ఆమె: ఎంత పిరికివవు. నేను గదిలోపల మెట్టిన కాలు వెనుకకు తీసినచో మంచముమీద పండుకొన్నవాడవు పండుకొన్నట్లు లేచుటయు లంఘించుటయు నన్ను పోకుండ పట్టుకొనుటయు చేయగల్గిన పిరికివి. అట్లు ఊచ్చపోదు వేమి!" అతడు "నీవు లక్ష్మీదేవివి. నా యందు ప్రసన్నురాలవైతివి. నన్ను వరించి వచ్చితివి. నేను తెలిసియు తెలియలేకున్నాను. నన్నెందుకు మోసము చేసెదవు?" ఆమె: "నిన్ను మోసము చేయుట యనగా నేమి?" అతడు: "నీవు నాకు భార్యవు. నేను భర్తను. మనకు వివాహమైనది. ఇది ప్రథమ సమాగమ దినము. ఒక శృంగారరసము లేదు. ఒక కరుణా పాంగము లేదు. ఒక లజ్జాభినయము లేదు. ఒక పజ్జకు చేరుట లేదు. ఇది శోభనపుగదిగా లేదు." ఆమె: "ఎట్లున్నది?" అతడు "గురుశిష్య సంవాదమువలె నున్నది. ఒక దేవతయు వాని భక్తుడును వారి సంవాదమువలె నున్నది." ఆమె: "నే నెవరను?" అతడే "నాకు తెలియదు." ఆమె: "ఈ చిత్రముల నన్నింటిని దర్శించితివికదా! నే నెవ్వరనై యుందును?" అతడు: "అదియట్లుంచి ఈ చిత్రము లెవరు రచించిరి? ఆ ప్రతిమ నెవరు నిర్మించిరి? వీని కెంతకాలము పట్టినది? నేను నీ సంబంధము నంగీకరించితినని నీకు తెలిసిన తరువాత నడుమనున్నది నాల్గుదినములు. ఆ నాల్గుదినములలో నింతపని చేయుట యెట్లు సాధ్యమైనది? ఆ శిల్పు లెవరు? వారు దేవతలా మనుష్యులా? వారెంతమంది? తక్కినవట్లుంచుము. నీ రూపమును చూడకుండ శిల్పి చిత్రించలేడుకదా! విఘ్నకంఠ కర్తనవేళ నీ ఘోరాకారమును రచించెనే? నిన్ను చూడకుండ చేయలేడుకదా! నిన్ను చూచి వా డెట్లు బ్రతికినాడు?" ఆమె: "ఆ బొమ్మను చూచి నీవును బ్రతికియే యుంటివి కదా!" అతడు: "నేనా బొమ్మను మాత్రమే చూచితిని. వాడు నీ ఘోరా కృతిని ప్రత్యక్షముగా చూచినాడు." ఆమె! "నీవును నా ఘోరాకృతిని ప్రత్యక్షముగా

చూచితివి. ఇది మూడవ సమస్య" అతడుః "ఈ దండ ప్రతిమాకంఠమున వేయవలయునా?" ఆమె "నీ వామెకే పుస్తె కట్టితివి. ఆమె మెడలోననే వేయుము.'' అతడుః "నేను నీమెడలోననే వందమందిసాక్ష్యుల సమక్షమున పుస్తె కట్టితిని." ఆమెః "ఇందాకనేకదా యనుకొంటివి. మంగళ సూత్రబంధనవేళ నేను రాలేదని. వివాహమంటపమునందు బంభరము పరిభ్రమించుచుండగా నీమనస్సు నీమనస్సులో లేదని." అతడుః "అది వట్టి శిలాప్రతిమ. అది కూర్చుండగలదా? నడువగలదా? పరుండగలదా? చూడగలదా? పెండ్లి పీటలమీద పుస్తెకట్టినది నేనీ ప్రతిమకు కాదు." ఆమెః "ఓయీ! నీవు పుస్తెకట్టినది యామెకే. నీవామెయందే రమించుచున్నావు. ఆ ప్రతిమయొక్క సర్వావయవములు స్పృశించినావు. రమించినావు. ఆమెను చుంబించినావు. పోయి యా ప్రతిమను తీసికొని రమ్ము. ఆమె వచ్చును. ప్రతిమను జాగ్రత్తగా తీసికొని రావలయును. క్రింద పడిపోయినచో ముక్కలుముక్క లగును. తీసికొనివచ్చి యామె నా పానుపుమీద పండుకొనబెట్టుము. ఆమె నడచును. కూర్చుండును. పరుండును. దివాసమయములయందు ప్రతిమ. రాత్రులందామెయే నీకు శయ్యాసహచారిణి. ఓయీ! కన్నులయందు నీళ్ళు పెట్టికొనకుము. ఆమె శిలయైకూడ శిలకాదు. నీతో మాటాడదు. నీవు నన్ను కోరితివికదా! ఆమె నా ప్రతికృతి. నిజముగా నా కాకృతిలేదు. దాని కాకృతి యున్నది. నేను లక్ష్మీదేవిని. లక్ష్మియనగా నీకర్థము చెప్పితినికదా! నీ యందు శౌర్యరూపమున నేనుంటిని. ధనరూపమున ధాన్యరూపమున రాజ్యరూపమున యౌవనరూపమున విద్యారూపమున నీ యందుంటిని. నిన్ననుగ్రహించితిని. ఓయీ! లక్ష్మి మానవశరీరముతో నీసంగమమును పొందవలయునా? సంగమమునందు లక్ష్మి లేదు. బహుకాంతాసంగమము సమృద్ధియన్న పేర లక్ష్మి కావచ్చును. అంతియేతప్ప శరీరము లేని వట్టి దేవతామూర్తినైన నా తోడి నీకు సంగమ మెట్లు లభించును? ఈ శరీరము నీకు దృశ్యమాన మగుచున్నది. ఆయనకు కూతురుగా కనిపించితిని. ఆయనయింట పెరిగినట్లు కన్పించితిని. ఈయనకు దత్తురాలైన కూతురువలె కన్పించితిని. నీకు భార్యాకృతిగ కనిపించితిని. నీవు నన్ను భార్యగా కోరితివి. ఇది నాల్గవ సమస్య. ఓయీ! మనము కాశ్మీరముల కెప్పుడు పోదుము.?' అతడుః "నీ వెప్పుడన్నచో నప్పుడు" ఆమెః "నా కెప్పుడైన నేమి? నీ కీ సమస్యాపరిష్కారములు నేను చేసిపెట్టవలయునన్నచో గాశ్మీరములకు పోవలయును. అచ్చట నీకు తెలియజేయుదును" అతడుః "ఆ శిలాప్రతిమ నా సెజ్జపైన నెందులకు?" ఆమెః 'ఓయీ! నీవు నన్ను భార్యగాకోరితివి. నీకు భార్యనైతిని." అతడు. '"ఏమి భార్యవైతివి? నేను నీ మెడకు గంధము రాయుటకుగూడ పనికి రానుకదా!" ఆమెః "ఆ ప్రతికృతిని తీసికొనిపోయి మంచముమీద పండబెట్టు కొనుము." అతడుః "నాస్పర్శనే పరిహరించుచున్నావు కదా!"

అంతట నామె యొక విచిత్రహాసమును చేసెను. అది తుమ్మెద మ్రోతగా పరిణమించెను. ఆమె యిట్లనెనుః "నాపేరు భ్రమరవాసిని. ఇప్పటిపేరు రణరంభ. ఇది నిజముగా కాదు. నిద్రపొమ్ము. కాశ్మీరము లేగిన తరువాత యీ సమస్యలు పరిష్కరింతును.

అంతలో నామె లేదు. ఒక భ్రమరము గదిలో బొంయిమని తిరుగుచున్నది. ఆ ప్రతిమ శయ్యమీదున్నది. ద్వారబంధములు మూయబడినవి. అతడు మంచముమీద పరున్నాడు. నిద్రవచ్చినది. ఒక్కదీపము మిగిలినది. తక్కిన వారిపోయినవి.

# ద్వితీయభాగము

## ప్రథమాధ్యాయము

## 1

మఱునా డుషఃకాలమున నంతిపురములోని పరిచారికలందరు చాలసేపటివరకు నిద్ర మేల్కొనలేదు. ఉషోరేఖలు వారకమున్న పరిచారికలు నిద్ర లేవవలయును. స్నానాదిక కృత్యములు నిర్వర్తించి ధౌతపరిధాన ధారిణులై నియమిత స్థలముల నుండవలయును. రాజభార్యలను రాజదుహితలను రాజస్నుషలను వారు నిద్రమేల్కొల్పవలయును. వారిలో పదిమందియైన వీణావాదన నిపుణ లున్నారు. ఆయా రాజపత్నీ స్నుషాదుహితృ శయ్యాగారములకు ముందు చిన్న పంచాది యుండును. ఆ పంచాదిలోనుండి శయ్యాగారముల లోనికి గవాక్షము లుండును. ఆ గవాక్షములు మనిసియొత్తున పైకి నిర్మించబడి యున్నవి. ఈ పరిచారికలు వీణావాదము చేయగా నీ ధ్వని గవాక్షములనుండి యంతఃప్రవేశముచేసి వారికి మెలకువ తెప్పించవలయును. ఇది సహజముగా తత్తన్నిర్దిష్ట శయ్యాగృహముల నిర్మాణవైఖరి. పరిచారిక లందరాలస్యముగ లేచిరి. అందరు భయభీతలైరి. తొందర తొందరగ స్నానాది నిర్వర్తనముజరిపి పోయి వీణాగృహములందు ప్రవేశింపగా రాజవంశీయు లెవ్వరును పురుషులు కాని స్త్రీలుకాని నిద్రమేల్కొన్నట్లు లేదు. రాజమహిషి ప్రతిదినము వీరి యందరికంటె మున్నే నిద్ర లేచును. ఆమె పరిచారిక లామెకంటె మున్నే లేతురు. స్నుషా దుహిత శయ్యాగారముల పురఃప్రదేశస్థిత వీణల కదలించువారు తమ నియమితకార్యమునకు ప్రతిదినము పోవువేళకే పట్టమహిషి పరిచారికాదర్శనము లగుచుండును. మహారాణి యావేళకే దేవతా పూజామందిరమున నుండును. ఈ నాడంతయు వ్యత్యస్తముగా నుండెను. అల్లుడైన కాశ్మీర రాజుగారి నూతన శుభము కొరకు నిర్మింపబడిన శయ్యాగారముముందు వీణాశాల లేదు. వీణావాదనముకొరకు ఎవ్వరును నిర్దేశింపబడినట్లు లేదు. అందరకును నూత్నదంపతులు నిద్రలేచిరా లేదా? వారికి శౌఖశాయనిక మర్యాదలు జరిగినవా లేవా? మొదలైన పర్యాలోచనాధీనలైనను తొలుత తమ నిర్దిష్టకార్యము లాచరించు ఆ దుహితృదంపతులో ఆ స్నుషాదంపతులో మేల్కొనిన తరువాత వారి కాల్యకృత్య నిర్వహణ కార్యమునందు నియమితలైన పరిచారికా పరిచారకులకు వారి నప్పగించి వీరందరును మందమంద గమనములతో సన్నని గొంతులతో పలికికొనెడి మాటలతో నాదిగినాదిగి నడచుటలతో తత్కార్యము తమకు నియమితము కాదన్న ధైర్యముతో వెళ్ళిరి. ద్వారబంధము మూసియున్నది. అది పెద్ద కవాటము. దానిని తెరచుటకెవ్వ రోపుదురు. నిర్ణీతులైన పరిచారకులు చేయవలయును. వారైన నల్గురైదుగురు పట్టినకాని కవాటము తెరుపుపడదు. అది పురుషులు చేరరాని స్థలము. లోపల నూత్న రాజదంపతులు తెల్లవారువరకు మేల్కొని యుండిరో, ప్రొద్దుపోవువరకు కేళీవిలాసములయందు మున్గియుండిరో, ఉషోరేఖ లుదయించువేళ నిద్రాసక్తులైరో యింతవరకు మేల్కొనలేదు. తలుపులు

తెరచుటయా వీణావాదనము చేయుటయా? వీణావాదనము చేసినచో వా గాన విస్వనము శయ్యామందిరమున ప్రవేశించు గవాక్షములు లేవు. తలుపులు మూసి యున్నవి. యేమి చేయవలయునో తెలియరాక వారిలో గొందరు దీనిని రాజమహిషికి నివేదించుటకు పోయిరి. ఆమె యేమి చేయును? ఎవరైన తలుపులు తెరచినచో నిద్రాసక్తులై పరస్పర పరిష్వంగమునందు నొడళ్లు తెలియక చీరలునేరక వారు నిద్రించుచున్నచో తద్దర్శనము దోషము. అది అమర్యాదాహేతువు. వారియంతట వారు మేల్కొనవలయును. వారు తలుపులు తట్టవలయును. ఇదియేమి? ఈ శయ్యాగృహనిర్మాణ సర్వభారము తాను వహించిన పెండ్లికూతురు-ప్రాతఃకాలకృతవీణానిస్వన ప్రయాణయోగ్య గవాక్షనిర్మాణము చేయించలేదేమి? ఆమె కేమి తెలియును? ఏవో తన యూహలబట్టి శయ్యాగృహనిర్మాణము చేయించుకొన్నది కాని, ముక్కు పచ్చలారని బాలిక. యీ నిర్మాణము చేయుంచుకొన్నది. ఆమె సరే. తన్నిర్మాణమైన తర్వాత పట్టమహిషి చూచెను కదా. పరిచారికలు చూచిరికదా. వీరైనను చెప్పలేదు. అందరును తద్గృహగత శిల్పనిర్మాణ మహాలక్ష్మికి ముగ్ధలై పోయిరి. అందరు నాశ్చర్యచకిత లైరి. శిల్పులే విభ్రాంతి పొందిరి. తన పుట్టినింటినుండి యామె కొందరు శిల్పులను తెచ్చెను. వారు మహానిపుణులు. అన్నిటికన్న నందరకు ప్రతి మహాలక్ష్మీకథా చిత్రమునందు లక్ష్మీదేవి బొమ్మయొక్క యాకృతి ఈమెగా తీర్చిదిద్దించుట యబ్బురము గొల్పెను. అదియొక విలాసభావముగా వారంగీకరించిరి. ఆమె కోరి కాశ్మీరరాజా నంగీకరించెను. అతనితోడి యేమి రహస్యానుభూతి పొందవలయునని యెంచెనో? సర్వత్ర నున్న లక్ష్మీ రూపములందు తన ప్రకృతి వానికి గన్పింపజేసి వానిని లోభపెట్ట నెంచెనో! వానికి విశేష సౌఖ్యానుభూతి కలిగింపనెంచెనో! వానిని దిగ్భ్రాంతిపొందింప నెంచెనో-! ఆమె తమయింటికి వచ్చినదాది రాజునకు నామె తమకడుపున పుట్టిన బిడ్డగా నైపోయెను. రాణికి తన చివరసంతాన మన్నట్లు తోచెను. రాజస్నుషలు నామెను తమకు గౌరవస్థానముగా మన్నింపసాగిరి. ఆమె యెంతచెప్పిన నంతగా నుండెను. ఈ కేళీమందిర నిర్మాణసమయమున గవాక్ష నిర్మాణము చేయవలెనని వారిలో కొందరికి తోచినను చెప్పుటకు వారు సాహసించలేదు. ఆమె సర్వజ్ఞురాలు. ఆమెకు దెలియనిది తమకు తెలియునా? మరియు గవాక్షముపెట్టినచో ద్వారబంధమునకు పైభాగమున కుడియెడమలనున్న గోడలలో పెట్టవలయును. ఆ గోడలకు లోపలిభాగమున నొకవైపున నిలువున చిత్రమున్నది. మరియొకవైపున ప్రతిమయున్నది. చిత్రప్రతిమోపరిభాగములందు సన్నని గవాక్షములు నిర్మించ వచ్చును. ఆ ప్రదేశమంతయు లతా కుడుంగ తరుశాఖా కోకిల మయూరపుష్ప ఫలాదులచేత చిత్రితమై యుండెను. అచట గవాక్ష నిర్మాణము చేసి తచ్ఛిల్పసౌందర్యమును చెడగొట్టుకొందురా? ఈ శయ్యామందిరమున కింత కవాటమెందులకు? ఒక రాజమందిరమునకు సభామందిరమునకు పెట్టినంత కవాట మున్నది. అంత కవాట మున్నగాని ద్వారబంధపు కమ్ములు విశాలముగా నుండవు. అంత విశాలముగా నున్నగాని బహురమణీయ చిత్రనిర్మాణమునకు వీలుండదు. కవాటమంత పెద్దదియగుటచేత ద్వారములంత పెద్దవి. పెద్దవియగుటచేత మిక్కిలి దళసరివి. దళసరి వగుటచేత భారములు. అందుచే సులభముగా తీయరానివి. ఇంచుమించుగా నొక దుర్గమునకు నిర్మించిన ద్వారబంధముకాని, కేళీమందిరమునకు నిర్మించిన ద్వారబంధము కాదు. యింక నీద్వారబంధము ముందు భార్యాభర్తలు

కేళీమందిరప్రవేశము చేసినతర్వాత నెవ్వరు నుండకూడదు. పరిచారకులు పనికిరారు. ఆ తలుపు లామెయే వేసికొనవలయును. ఆమెయే తీసికొనవలయును. అంతటి సుకుమారి యింతటి బరువైన తలుపులను లాగగలదా? మరి కడచినరాత్రి తలుపులు లాగబడినవికదా. బంధింపబడినవికదా! పెండ్లికొడుకు మహాబలశాలి. అతని బాహుబలము జగత్ప్రసిద్ధము. భారతదేశమున నాడు వానియంత ధనుర్విద్యాకుశలి, బాహుబలవంతుడు, ఖడ్గవిద్యానిపుణుడు లేడని ప్రతీతి. అతడెప్పుడో దండయాత్ర బయలుదేరి సర్వభారత ధరాపతులను గెలిచి సామ్రాజ్యము నిర్మించునని తదాధిపత్యము వహించునని లోకమున ప్రథకలదు. ఈ రాజా యీ పెండ్లికుమార్తెను తెచ్చి తాను వివాహము చేయుటకు కొంతవరకు వానితోడి చెలిమి నభిలషించి యిట్లుచేసెనని యనుకొనుటకూడ కలదు. అతనికీ తలుపులు లాగుట కష్టమా? అట్లే కావచ్చును. వారిద్దరును నిదుర మేల్కొనవలయును. వారే తలుపులను తెరువవలయును. అప్పుడుకదా పరిచారికల ధర్మములు ప్రారంభమగును. వారంద రిట్లు గుబ్బిసలాడుచుండగా రణరంభ తన నియమితమైన పూజామందిరమునుండి వినిర్గమించి సర్వాభరణభూషితయై ధౌతవస్త్రధారణియై మొగమునందు నిడివి కస్తూరి బొట్టునడుమగుండ్రగా నమర్చిన కుంకుమపూవుపొడి, కల యై శ్రవఃకల్హారపుష్పయై, లీలారవింద హస్తయై వదులుగా వేసిన జడయందు నిర్మించిన పూజాపుష్పములగుత్తులతో మందమందగమన నిరాకృత రాజహంసీ మధురమూర్తియై యచ్చటికి వచ్చెను. వారందరును నివ్వెరపోయిరి. ఆమె లోపల నిద్రపోవుచున్నదని వారి యూహ. తలుపులు తెరచుట ఎట్లని వారిభయము. ఈమె ఎప్పుడు లేచి స్నానాదిపూజాదికములు జరిపినది? భర్త యొంటరిగా శయ్యామందిరమున నిద్రాళువై యుండెనా? ఈమె భర్తను నిద్రలేపుటకు వచ్చినదా? వారి యాశలన్నియు వారి ముచ్చటలన్నియు వారి యుత్సాహగత భావములన్నియు పటాపంచ లయ్యెను. ఆమె శయ్యామందిరమునుండి నిద్రాలసయై, స్ఖలితగతియై, సువిస్పష్ట నఖక్షత ఖిన్నకపోలాధరయై, నలిగిపోయిన చీరతో శతశీర్ణ కంచుకముతో చిక్కిరిబిక్కిరియైన తలకట్టు గోళ్ళతో దువ్వుకొని యేదో రీతిగా ముడివేసికొనిన జుట్టుతో, చెరిగిపోయిన తిలకముతో, సగముసగము తుడిచివేయబడిన రాలిపోయిన పాద లాక్షాచిహ్నములతో, స్విన్న మనోహరమూర్తియై, ఖిన్న నయనాభిరామమూర్తియై, ఛిన్న కంఠగత రత్నహారయై, భిన్ననేత్రగతదర్పయై, సమాసన్న మన్మథ హేలాగమన లీలాతనూడోలా మూర్తియై వచ్చునని చూచి ముసి ముసి నవ్వులు నవ్వికొందమని ఆమెను పడిపోకుండపట్టి కొందమని అడుగులలో నడుగులు వేయించికొనుచు స్నానమందిరమునకు తీసికొని పోవలయునని. రాజవంశస్త్రీలతో పరిచారికలకు తొలితటి చనువు ప్రారంభించు సమయము లట్టివి కనుక తద్వేళాప్రతీక్షమాణ భావలైనవా రందరుకృంగిపోయిరి. ఉస్సురనిరి. పెట్టుకొనిన యేదో ఆశ భిన్నమైనట్లు భావించిరి. ఆమె వచ్చెను. ప్రతిదినము ప్రాతః కాలమునం దామె యెట్లుండెనో యట్లే యుండెను. నిశాభాగ పరిఖిన్నమూర్తిత్వ లక్షణము లేవియు లేవు. స్నానముచేసి పూజచేసికొన్నను ఆమె శరీరమునందు బడలిక కన్పించలేదు. కన్నులయందరమోడ్పులు లేవు. సన్నగా తూలిపోవుట లేదు. ప్రస్ఖలగతి లక్షణమే లేదు. నిన్నసాయంకాలము రెమ్మయందు వడిలిపోని త్రుంచబడని పుష్ప మెట్లున్నదో నేటి ప్రొద్దున నట్లే యున్నది. మల్లీ పుష్పమైనచో ప్రాతఃకాలమునకు రెక్కవిడిలిపోయి తనంతట రాలిపోవుస్థితిలో

నుండును. శిరీషము ముడుచుకొనును, చేమంతిపువ్వునందుకూడ హిమార్ద్రత కనిపించును. ధాత్రియందున్న యే పుష్పములైనను హిమపాతఘాత చిహ్నమో తీవ్రవాతసంపాత చిహ్నమో వెలార్చును. నందనవనీపుష్పము లెట్టివో వారికి తెలియదు. ఆ పుష్పములు వాడవో రేకలయందు ముడుతలుపడవో కాంతియందు క్లాంతినందవో? ఈమె నందనవనీ పారిజాతము. రజతాచలో ద్యాన పుష్పకదంబము. వైకుంఠపురీ కేళీకాంతార సంతానము. ఆమె కనుసన్నల ఎవరిదారిని వారు నిష్క్రమించిరి. అంతట తలుపు తెరువబడెను. పెండ్లికుమారుడు తత్పూర్వమే నిద్ర మేల్కొనెను. కనులు తెరచెను. ఆమెవంక చూచెను. లేచెను. ఆమె నెమ్మదిగా పాన్పుకడకుపోయి ప్రక్కమీది దుప్పటిని సర్దెను. అతనిని దీసికొని పోయెను. పరిచారకుల కప్పజెప్పెను.

# 2

మఱునాడురాత్రి మరల కొలదిగా ముచ్చటలు సాగినవి. అంతనెక్కువసేపు లేదు. వారాంగనలు బ్రాహ్మణ పుణ్యస్త్రీలు తొందరగానే వెడలిపోయిరి. కొంత చెండ్లాటయు గంధపూతలును తములపాకులు కొరుకుటయు చేయించుటకు ప్రయత్నములు చేసిరి. పెండ్లికొడుకే అంగీకరించలేదు. పాటలు సాగినతరువాత నిన్నటికంటె విశేష మేమనగా పెండ్లికూతురు నేడు సిగ్గుపడుట లేదు. పెండ్లికొడుకుగూడ నామెవంక సుంత బెరుకుగా చూచుటలేదు. పరస్పరము యథేచ్ఛముగా చూచుకొనుచుండిరి. పెండ్లికూతురు పెండ్లి కొడుకును జూచి నడుమనడుమ నవ్వుచుండెను. అతడు మాత్రము తిరిగి నవ్వుటలేదు. వారిలో కొందరిట్లనుకొనిరి. "నిజమే. వరించిన దీమె. అతడు కాదు. ఆమె కతనియందెంతో ప్రేమయున్నది. అతడును ప్రేమకలవాడే. తనప్రేమ బహిష్కరించుటకు ప్రయత్నించుటలేదు. పురుషుడుకదా! అందులో మహారాజా. అంతకంటె మహావీరుడు. ఠీవియును దర్పము నెచటికి పోవును?" కొంతసేపటికి నొక ముత్తయిదువ ఒక తములపాకు చుట్టచుట్టి పెండ్లికూతున కిచ్చెను. ఆమె దానిని కొరికెను. ఆ ముత్తయుదువ దాని నామె చేతిలో నుండి తీసికొని పెండ్లికొడుకు చేతి కిచ్చెను. పెండ్లికొడుకు దాని నట్లే తనచేతిలో నుంచుకొనెను. తాను కొరకలేదు. పారవేయలేదు. అందరు వెడలిపోయిరి. అతడిట్లనెను: "నేడే కాశ్మీరమునకు పోవలె నంటివికదా! మనము పగలు కలసికొనలేదు. నేను నిర్ణయించుటకు వీలులేకపోయినది. నీకోసము నేను వెదకుచువచ్చిన నంద ఏమనుకొందురోయని కొందలపడితిని. రేపు వెళ్ళుదమా?" ఆమె: "ఇది రెండవరాత్రి, మూడు రాత్రులైనతరువాత పోదము. అది న్యాయముకదా!" అతడు: "లోకదృష్టితో చూచిన న్యాయమే. ఇది యలౌకికవ్యవహారము." ఆమె: "అవును. నేనీ లోకమునకు సంబంధించినదానిని కాను" అతడు: "ఇప్పుడీలోకమునందే కనిపించుచుంటివికదా! ఒక రాజుకడుపున పుట్టితివికదా! పెరిగితివికదా! అందరు స్త్రీలవలెనే వయసు వచ్చిన తరువాత స్త్రీత్వమును కంటివికదా! అన్నియు లోకమునందు జరుగుచున్నట్లే జరుగుచున్నవి" ఆమె: "గర్భాధానపుగది లోకముకాదు. లోకమనగా చూచునది. చూచుటలో లోక

సామాన్యముగా నాలోచించుటయు నున్నది. భార్యాభర్తలు గదిలోనికి పోయినచో వారేమిచేయుచున్నారో యెవ్వరును చూడరు. లోకసామాన్యముగా నూహింతురు. ఆ భార్యయందు భర్త కనురాగము లేదనుకొనుడు. భర్తయందు భార్యకులేదు. వారినడుమ సంసారములేదు. భార్యాభర్తలగుటచేత సందరును వారు సంసారము చేయుచున్నారనియే యనుకొందురు. అట్టి సంసారములు కొన్నాళ్ళకు బయటపడును. వాడామెను వదిలిపెట్టును. ఆమె లేచి పోవును. కాని మూఢలోకము వారు కలసియున్నన్ని దినములు సంసారము చేసిరనియే యనుకొనును. లోకముయొక్క దృష్టి యెట్టిదియో తెలిసినదా? తానొకవిధముగా నాలోచించుట కలవాటుపడినది. అట్లే యాలోచించును. దానికి నుత్సర్గశాస్త్రమునందే విశ్వాసము. అపవాదశాస్త్రముయొక్క జ్ఞానము దానికి లేదు. వట్టి యుత్సర్గశాస్త్రప్రమాణము కలది లోకము. అందుకనియే వారిని పామరు లందురు." అతడు: "అదిసరే, దీనికొఱకు జన్మయెత్తుట యెందులకు? ఇంత శ్రమయెందులకు? మానవులవలె దేవతలు కష్టపడుట యెరుగరు." ఆమె: "ఓయీ! నీవెంతవీరుడవో అంత పండితుడ వగునో కాదో నాకు తెలియదు. పాండిత్యము విలక్షణముగా నుండును. వేదమంతయు చదువును. అతనిని పండితుడందురు. అతని ప్రపంచికజ్ఞానము విచార్యము. అట్లే శాస్త్రములందు గూడ. మీ కాశ్మీరదేశముయొక్క గొప్పదనము మీకు తెలియునా? కాశ్మీర దేశముయొక్క యాధిక్యము రెండు విద్యలలో నున్నది. అచ్చట నొకవిధమైన శైవము వృద్ధిపొందినది. స్థూలముగా దానిని కాశ్మీరశైవ మందము. రెండవది సాహిత్యశాస్త్రము. అలంకారశాస్త్రము రసవిషయిక పర్యాలోచన నిక్కడ జరిగినంత భారతదేశములో మరియొకచోట జరుగలేదు. ఇది రహస్యము. రసములు తొమ్మిది. అందులో ప్రధానమైనది శృంగారరసము. శృంగారము రెండువిధములు. సంభోగ శృంగారము, విప్రలంభశృంగారము. విప్రలంభ శృంగారము మరల రెండువిధములు. భర్త బ్రతికియుండి పరదేశగతుడై తిరిగివచ్చును. సంభోగము కలుగునన్న యాశతో పొందెడి విరాలి యొకటి. భర్త చనిపోయినాడు. అప్పుడును విరహ మున్నదికదా! అది విప్రలంభ శృంగారమా, శోకరసమా యన్న ప్రశ్న. రసమునకు మూలస్థాన మేది? మననముచేత పంచేంద్రియ వ్యవహారాతీత మైన యొక జీవలక్షణమును స్పృశించుట, అంతఃకరణపు టెల్లలను స్పృశించుట.నిర్విషయమైన విషయి యొక్క స్వరూపావబోధ కొంచెముగా కలుగుట. ఇది కావ్యగతమైన రసలక్షణము. "రసోవైసః" అన్న వేదవాక్యమునందలి రసశబ్దమునకు దీనికి పెద్ద సంబంధము లేదు. ఈ వ్యవసాయ మెవ్వరిదని యడిగిరట. మాకును నీ ప్రాంతముయొక్క ప్రభువునకును కలిసినది. మా యుమ్మడి వ్యవసాయ మన్నాడట. ఇరువది నాగళ్ళు దున్నుచున్నవి. ఇందులో మీసి యెన్ని నాగళ్లయని యడుగగా ఆ చివరినాగలికి గట్టియున్న కుంటియెద్దు నాది. అదియే మా యుమ్మడితనము. కావ్యగతరసమునకు 'రసోవైసః' లో ఉన్న రసమునకు సంబంధ మిట్టిదని చెప్పవచ్చును. ఆ కుంటియెద్దు లేకున్నచో నిజానికి నాగళ్ళిరువది కావు. కాని యిరువది. ఎద్దుకుంటిది. రసమట్టిది. ఇంతకును రసము మననముచేత సిద్ధించునది. భర్త చనిపోయినాడు. నాయిక యున్నది. ఆమెకు భర్త చనిపోయెనన్న విశ్వాసము లేదు. చనిపోయినను తప్పకుండ మరల వచ్చునన్న విశ్వాసము కలదు. ఎప్పుడు పునస్సంభోగాశ యున్నదో అప్పుడు శృంగారరసము. ఆ యాశ పొందుటకు వీలులేదు. అయినను నాయికానాయకు లాశయం దభివ్యాప్తచిత్తులై యున్నారు.

ఇద్దరిలో నొకరే యున్నారు. సామాన్యముగా రసభావము నాయికాశ్రయమైయుండును. పురుషాశ్రయమైకూడయుండును. కాని వ్యభిచారాదిభావములు నాయికాశ్రయముగా ప్రవచింపబడును. ఒక దంపతులున్నారు. వారిద్దరికిని సంగమప్రాప్తి లేదు. ఇద్దరిలో నొకరియందు సంగమువాంఛ యున్నది. అది శృంగారరసమే. సంభోగముకంటె విప్రలంభము గొప్పదికదా! ఎందుచేత గొప్పది? అనుభవవ్యభిచారి సాత్వికభావముల యొక్క బాహుళ్యముచేత. మరల నిందులో నింకొకప్రశ్న యున్నది. రసము సామాజిక నిష్ఠమా? నటనిష్ఠమా? యని. శ్రవ్యకావ్యమైనచో నీ ప్రశ్నలేదు. నిస్సందేహముగా పఠితృ నిష్ఠము. శ్రవ్యకావ్యమునందు హృదయమునకు తాదాత్మ్యస్థితి యంగీకరింపబడినచో దృశ్యకావ్యమునందు నటనిష్ఠము కూడ కావచ్చును. ఎంత నటనిష్ఠమైనను యొడలు తెలియని శవ ముండదుకదా! జీవలోకమే యిట్టిది. అఘము చేయుచుండును. ప్రక్కనే ధర్మముకాదనుకొనుచుండును. దేవుడులేడనుచుండును. చెవిలో పోటు వచ్చినచో దైవమునకు మ్రొక్కును. ఇది లోకము. నిజమునకు గాఢాంధకారమైన ప్రదేశ మెక్కడనున్నది? నీవు కటికచీకటిలో కూర్చుండుము. కొంతసేపటికి నీకా చీకటి యలవాటై నీ వాచీకటిలోననే చూడగలుగుదువు. కంటితో చూచి యేమి చేసెదవు? వస్తువులను తెలిసికొందువు. గ్రుడ్డివాడు కంటితో చూడడు. వాడు స్పర్శతో తెలిసికొనుచున్నాడు. తెలిసికొనుట సమానమే. తెలిసికొనుటయే పరమార్థము. అట్లే యేక విషయగతమైన బుద్ధితో మననముచేయుట ప్రధానము. అచట శృంగారరస మున్నది. తాను మిక్కిలి ప్రేమించుచున్న భార్య వ్యాధిగ్రస్తురాలై మంచమున పడియున్నది. అది బ్రతికిలేదు. చచ్చిలేదు. వీడేకపత్నీ వ్రతుడు. అచటి సంభోగవాంఛ యెచటనున్నది? అది భూతకాలికమా? భవిష్యత్కాలికమా? అన్ని రసములలో శృంగారరసమంత ప్రధానమైన రసము లేదు. అంతకంట విచారణచేత శాఖోపశాఖలుగా విజృంభించగలిగిన రసము లేదు. ఒకడు దేవతాస్త్రీ యందు భావనకలిగి యున్నాడు. ఆ దేవతాస్త్రీ వానికలభ్యకాని వాని ననుగ్రహించినది. శపించలేదు. వానిని నాశనము చేయలేదు. వానిననుగ్రహించినది. వానియందలి యాభావమును తానొక లీలగా హేలగా నంగీకరించినది. ఓయీ! లోకము విచిత్రమైనదిసుమా! ఒక మహారాణి యున్నదనుకొనుము. సేవకులలో నొకడామెయందు కామవాంఛ కలిగియున్నవాడుండును. ఆ కామవాంఛను వాడు వ్యక్తీకరించలేడు. కొన్ని సూక్ష్మభావవ్యక్తీకరణ సమయములందు రాణి గ్రహించును. వానిని తిరిగి ప్రేమించునా? ప్రేమించదు. వానిని సంహరించునా? సంహరించక పోవచ్చును. అది రాజునకు తెలిసినచో వాడు నిస్సంశయముగా హరింపబడును. రాణి వానియందలి భావమును గుప్త పఱచును. తనకు తెలియనట్లు నటించును. అట్టి రాణియొక్క మనఃప్రవృత్తిని కొందఱు కామముగా భావింతురు. కొందఱౌదార్యముగా మన్నింతురు. కొందఱు దయగా విచారింతురు. అది యట్లుంచుము. ఈ సృష్టిలో మరియొక చిత్రమున్నది. సర్వావయవపుష్టి కలిగి యౌవనలక్ష్మి తాండవించునట్లు చెక్కబడిన స్త్రీ శిలావిగ్రహమున్నది. గొప్ప శిల్పి వ్రాసిన చిత్రమున్నది. వానిని గూర్చి భావించి తపించెడివారున్నారు. అచట శృంగారరస మున్నదా? సంభోగాశ లేనేలేదు. సంభోగమన్నభావము వట్టి మనోగతమై యున్నది. అఘటిత పదార్థగతమై యున్నది. అచ్చట

సంభోగాశ యెట్టిదనగా యిందాక లోకమని చెప్పితివే? ఆ లోకము యొక్క స్థూలదృష్టి యెట్టిదో యట్టిది. నాకు కోరికలేదు. నాకు వాంఛలేదు. నీవు నారాయణునియందు లగ్నబుద్ధివని నన్నందువా? ఆ నారాయణు డెవ్వరు? నే నెవ్వరు? లోకదృష్టితో మేమున్నాము. మఱియు నొకటి చూడుము. నీ వొక స్త్రీని చూచితివి. మోహించితివి. లోకమునందు పలుస్త్రీలు కలరు. ఆమెనే ఏల మోహించితివి? ఆమె యందున్న స్త్రీత్వమును మోహించితివా? అది సర్వసామాన్యమైనది. ఆమెయొక్క సౌందర్యమును చూచి మోహించితివి. స్త్రీ భావానుషక్తమైన తచ్ఛరీరగతమైన సౌందర్యమును చూచి మోహించితివి. తద్గతస్త్రీత్వమునకు, తద్గతసౌందర్యమునకు నవినాభావముగా భావించుచుంటివి. వాని రెంటికి నవినాభావ సంబంధము లేదు. ఆ సౌందర్యము కొంత భావనానిష్ఠము. కొంత తచ్ఛరీరగతావయవ విన్యాసనిష్ఠము. ఓయీ! తత్సౌందర్య మెంత తాత్కాలికము! అందుచేత నీ వొక స్త్రీని మోహించితివన్నచో నీ కంటె మూఢుడు లేడన్నమాట. మోహములేనిచో లోకములేదు. ఆ లోకమునకు సంబంధించి మోహము నీచేత నూహింపజేయు చుండును. దేవత లనుగ్రహించుట యనగానే భావనా పరంపర నీ జీవలక్షణమో నీకు సంతోషదాయకమో తద్భావనా పరంపర నీయందు సాగనిచ్చుట. దానికి దోహదను చేయుట. లోకమునందు దయతో దేవతలు మానవరూపధారిణు లగుదురు. న:-నవజన్మతో వాడు పరమయోగి కాకపోయినచో "రసోవై సః" యన్నస్థితి పొందలేడు. కావ్యరసమువంటి రసమును పొందగలడు. దానికి మననము ప్రధానము. ఆ మననమును సమృద్ధిగా సమృద్ధ్యధిదేవత నీకు ప్రసాదించినది. దానికి కావలసిన సామగ్రి యంతయు సమకూర్చినది."

అనిన పెండ్లికూతువంక పెండ్లికొడుకు నిస్తబ్ధములైన కనులతో చూచుచుండగా పానుపుమీద ప్రతికృతి కనిపింపగా నెదురుగా పెండ్లి కూతురు లేకుండగా భ్రమరీ నినాదము ప్రారంభించగా నిదురముంపు వచ్చి తాను పాన్పుపై పండుకొనగా గది తలుపులు మూయబడెను.

# 3

మూడవరాత్రి ముత్తయిదువలకు వారకాంతలకు నుత్సాహము లేకపోయెను. కడచిన రెండురాత్రులు మహారాణి యన్యకార్యమగ్ను రాలై కూతునల్లుంద్ర మురిపెములు పట్టించుకొనలేదు. ఆమె ఈనాడు వత్తునన్నది. ఈ దత్తపు తల్లి వచ్చునని పెండ్లికూతునకు తెలిసినది. రాణి యామెకు వార్తపెట్టెను. ఈవార్త పెండ్లికొడుకువైపు ముత్తయిదువులలోగూడ వ్యాపించెను. అట్లు పెండ్లికొడుకునకుగూడ తెలిసెను. పెండ్లికూతురు ప్రవచించిన అస్తినాస్తి విచికిత్సాహేతువుగానున్న శృంగారరస భావనా మయమైన పరిస్థితులలో రాజమహిషి వచ్చుటయేమి? ముచ్చట లెట్లు సమకూరును? అతని కేమియు తోచలేదు. అతడు మనసులో గగ్గోలుపడుచుండెను. ఈవివాహమేమి? ఈస్వయంవరణమేమి? తానిందులో

తగుల్కొనుటయేమి? ఈ రాజాకంటె తాను గొప్పరాజు. మేము కార్యమును మా కోటలోననే చేసికొందుమని నిన్ననో మొన్ననో పెండ్లికూతును తీసికొనిపోయినచో అచ్చట యీ గోలయెట్లు జరిగిన నేమి? ఇచ్చట నలుగురిలో నప్రతిష్ఠపాలగుచున్నట్లు కనిపించుచున్నది. తమయిద్దరికి సంబంధములేదని యీపాటికి దాసదాసీజనము లందరికి తెలిసియుండును. వారు తన్ను గూర్చి యే మనుకొందురు? నిజమే తాను గొప్ప మహారాజు, గొప్పవీరుడు. ఇది యేమిస్థితి? తన్ను తృతీయాప్రకృతి యనుకొనరుకదా! అతనికి కోపమువచ్చినది. ఏమైననుసరే ఈనాడు తాను విసరివేసిన చెండు పెండ్లికూతురు --మరల విసరివేయ వలయును. తాను కోరికిన తమ్ములపు మడత యామె కోరికతీర వలమును. తా నామె మెడకు గంధము రాయును ఆమె మరల రాచితీర వలయును. అట్లు జరుగనిచో తానేమి చేయవలయును? పానుపు మీద నుండి కోపముతో హఠాత్తుగా లేచిపోవును."ఆమె నాకు భార్య కాదు. ఆమె మానవురాలు కాదు. అది యంతయు వట్టి నటన. తానులక్ష్మి దేవి యనుచున్నది. ఆమె భూతమో పిశాచమో ఎవ్వరికి తెలియును? నన్నింతవరకు మ్రింగలేదు. నే నందుకు సంతోషించుచున్నాను' అని యందరితో చెప్పును. తనదారిని తాను పోవును. ఒక పెద్ద రగడ పెంచును. లేదా "ఆమె స్త్రీ కాదు. ఆమె పురుషుడును కాదు. ఆమె ఎవ్వరో నాకు తెలియదు. ఆమె సంసారము చేయుట కనర్హురాలు" అని చెప్పును. ఇది యామె కప్రతిష్ట కదా! ఆమె తాను దేవత ననుకొనుచున్నది కదా! ఆమె దేవత్వ మేదో దీని చేత పరీక్షితమగును. నా కైదారు సమస్యలు చేసి పెట్టినది. ఈ సమస్యల కన్నిటికిని పరిష్కారము కాశ్మీరముల కేగిన తరువాత చేసిపెట్టునట. అది అక్కడ నెందుకు చేయవలయును? ఇక్కడ నెందుకు చేయరాదు? చేయదలచినచో నిక్కడనే చేయవచ్చును. ఇక్కడనే చేయనిమ్ము. అని యతడు గట్టిగా నిశ్చయించుకొనెను. ప్రొద్దు క్రుంకినది. కొంచెము రాత్రి గడచినది. వార కాంతలును బ్రాహ్మణ స్త్రీలును వచ్చిరి. తొలుత పెండ్లి కుమారుడు వచ్చెను. ఈ నా డతడెంతయో ఠీవిగా వచ్చెను. ఎంతయో కోపముగా వచ్చెను. ఏదో దృఢ నిశ్చయముతో వచ్చినట్లుగా కనిపించెను. అతడు వచ్చెను. చిత్రములను పరిశీలించు చుండెను. బ్రాహ్మణ స్త్రీ లొకవైపున, వారాంగన లొకవైపున తొలగియుండిరి. కొంత సేపటికి రాజమహిషి పెండ్లికూతును వెంటబెట్టుకొని వచ్చుచుండెను. ఆ పెండ్లికూతురు పరమముగ్ధ . లజ్జాభావ పట్ట భద్రురాలు ఆ సౌందర్యమున కవధిలేదు. పెండ్లికూతురు నిన్నటివలె మొన్నటివలె లేదు. అదియేదో బ్రహ్మదేవుడు కొంతమంది యచ్చరలను కరగించి యామెగా పోసెనేమో? ఆమె కన్నెత్తి చూచుట లేదు. ఆమె క్రీగంటి ప్రసారముక్రింద సన్నని రాళ్ల కడిగిన నేలపై సలమండలపు లోతు నమ్ములొవు కాలువ ప్రవహించుచున్నట్లుండెను. వసంతకాలమున వికసించిన తోటలోని పుష్పములన్నియు యొక విలక్షణమైన గాలిచేత దుల్పబడి యొక సన్నని కాలువగా ప్రవహించుచున్నట్లు కనిపించెను. అన్నిటికన్న నాశ్చర్య మేమనగా తల్లి కూతుండ్రిద్దరు నొకటియేవిధమైన చీరలు తాల్చిరి. ఆ చీరలను వర్ణించుటకు సామాన్యమానవులకు సాధ్యముకాదు. అవి మానవులచేత నేయబడినట్లు లేవు. ఒక్కొక్క దేశములో నొక్కొక్క వస్తువు విలక్షణముగా సంపాదితమగుచుండును. ఇది కులూతదేశము. "కు" అనగా భూమి. "లూతము" అనగా సాలెపురుగు. ధాత్రికి సాలెపురుగువంటి దేశమని యర్థము. సాలెపురుగు తాను పటము నెట్లల్లునో యా

దేశమునందు వస్త్రము లిట్లల్లుదురని యర్థమేమో? ఒక్కొక్క రాజ్యములో ఆ దేశము యొక్క రాజునకు తదితర దేశాధిపతులెరుగనియా! దేశమునం దుత్పత్తి యయ్యెడి వస్తువులలో నొక విలక్షణమైన విశిష్టమైన వస్తూత్పత్తి జరిగి యది ప్రత్యేకమైన యా రాజభోగముగా నుండును. ఈ వస్త్రము లట్టివేమో తెలియదు. అవి దారములతో నేసిన చీరలేనా? ఒక వెలుగు వ్యాపించినదా? వెలుగే దారములై వెలుగు దారములని చెప్పవలయునా? వెలుగైనచో వెలుగు వ్యాపించినంతమేర తత్రత్యములైన వస్తువుల యభివ్యక్తి జరుగును. పొగయో మంచో యైనచో వస్తువుల యభివ్యక్తి జరుగదు. పొగకు వెలుగున కంత కాంతి లేదు. వెన్నెలకున్నంత కాంతి పొగకున్నంత చిక్కన మంచుకున్నంత శీతలత కలిగిన యా చీరలు చిత్రముగా నున్నవి. వాని యంచులు బంగరుపూలు. సన్నని రత్నములు తళతళలు. ఆ తల్లి కూతుండ్రును జూచి అచ్చటి బ్రాహ్మణ స్త్రీలును వారకాంతలును నివ్వెరపోయిరి. కదలలేకపోయిరి. పెండ్లికొడుకు వారివంక యాదృచ్ఛికముగా చూచెను. అతని కనులు మిరుమిట్లు కొలిపెను. కొంతసేపటికి నిస్తబ్దత వాసెను. బ్రాహ్మణవృద్ధ స్త్రీ యొక్కరిత పెండ్లికొడుకువద్దకు పోయి "పెండ్లి కుమారులు పానుపుమీదికి దయచేయవలయు" ననెను. అతఁ డేమిచేయును? ఆ దేశము రాణి నగౌరవముపరచునా? తన్ను తాను తక్కువపఱచికొనునా? అతని కేమియు తోచలేదు. మాటాడకుండ పోయి పానుపుపై కూర్చుండెను. పెండ్లికూతురు పానుపుమీద నెదురుగా గూర్చుండెను. కొంతసేపు నృత్యము కొంతసేపు పాటలు నైన తరువాత కులూతదేశ రాజపట్టమహిషి తనమెడలో ముత్యాలహారమును దీసి కూతు చేతిలో నుంచెను. పానుపుమీద కూర్చునప్పటినుండి యా పెండ్లికూతు రొక విలక్షణముగా మారెను. ఆ మారుపెవ్వరికిని తెలియలేదు. ఆమె యా ముత్యాలహారమును పెండ్లికొడుకు చేతిలోనికి విసరివేసెను. అందరికీ నాశ్చర్యమువేసెను. పెండ్లికొడుకే నిస్తబ్ధుడై పోయెను. అట్లు జరుగునని యత డనుకొననేలేదు. ఇంతలో నతడు తెప్పరిలి చెండు మరల విసరివేసెను. సుంతకాలము చెండ్లాట సాగెను. ఆమె తలయెత్తి చూడలేదు. ఒక వారభామిని తములపాకు చుట్టి పెండ్లికొడుకు చేతి కందించెను. అతడు కొరికి యామె చేతి కీయగా దానిని పెండ్లికూతున కందిచ్చెను. ఆమె తీసికొని దానిని తానుకూడ కొరికి మరల నా వారభామిని కిచ్చెను. ఆమె మరల తెచ్చి పెండ్లి కొడుకునకిచ్చెను. అతడు దానిని చేత గ్రహించి యుంచుకొనెను. పెండ్లికొడుకు పెండ్లికూతుమెడకు గందమును పూసెను. ఆమె మరల పూసెను ఆనాడు వచ్చినంతమంది బ్రాహ్మణుల ముత్తయిదువులుకాని వారస్త్రీలు కాని మొదటిదినముకూడ రాలేదు. అందరి సందేహములు పటాపంచలైనవి. వారుపడ్డ యనుమానమంతయు నిరాధార మనిపించెను. అందరిస్థితికంటె పెండ్లికొడుకుస్థితియే యనూహ్యమాన మయ్యెను. ఇదియేమి రహస్యము? కడచిన రెండురాత్రుల స్థితియేమి? యామె యుపన్యాసములేమి? ఈ శోభనశాలాగత చిత్రములేమి? ఆమె లక్ష్మీదేవియగుట యేమి? ఇట్లు మానవసంపర్కము నకంగీకరించుటయేమి? తాను కోపముతో చేయదలచికొన్నవన్నియు నేమైనవి? అతడు మనస్సులేని వానివలె నుండెను. వారి వేడుకలన్నియు నై పోయినవి. వారిదారిని వారు పోవనారంభించిరి రాణికూడ బయలుదేరినది. పెండ్లికూతురుకూడ బయలుదేరునట్లు కనిపించెను. ఒక వృద్ధ బ్రహ్మణస్త్రీ "అమ్మా! మీరు లేవవలదు" యనెను. ఆమె మాట నంగీకరించినట్లు పెండ్లికూతురు. కూర్చుండెను. అందరును వెడలిపోయిరి. రాణియొక్క

యాజ్ఞచేత గదితలుపులు మూయబడెను. పెండ్లికుమారుడు పెండ్లికుమార్తెవంక నట్లే చూచుచు కూర్చుండెను. ఆమె కదలదు, మెదలదు. ఇంతకు మున్దున్న చైతన్యమంతయు నేమైనది? పూలచెండ్లాడినది. గంధము పూసినది. తములపాకులు కొరికినది. చిరునవ్వులు నవ్వినది. క్రీగంటిచూపులు ప్రసారము చేసినది-స్త్రీలందరు వెడలిపోయిన తరువాత నిమేషమైనను గడచినది. అతడు పలుకరించెను. ఆమె మాటాడలేదు. అతనికి కోపము వచ్చినది. "నీకంటె నా గోడలోని ప్రతిమ మేలు" అన్నాడు. అనుచునే యా ప్రతిమయున్నచోటికి చూచెను. అచ్చట నా ప్రతిమ లేదు. అతని పై ప్రాణములు పైన పోయెను. అతఁడు హఠాత్తుగా మంచముమీద పడిపోయెను. అతని స్వభావములో నేడ్చుట కన్నీళ్లుకార్చుట లేవుగనుక నతడా పనులు చేయలేదు. మహాతపస్సు చేసి మహాశ్రమపడి దేవీదర్శనమగు వేళకు నిశ్చైతన్యుడై నేలపడిపోయిన వానివలె నతడు పానుపుపై పడిపోయెను. అతనినుండి చైతన్యము లేదు. అతని నెవరో తాకినట్లయినది. ఆ స్పర్శతో నతనికి చైతన్యము వచ్చినది. కన్నులు తెఱచి చూచెను. ఆమె కన్పించెను. పానుపుపై చూచెను. ఆమె లేదు. ప్రతిమాస్థలమునందు చూచెను. అచ్చట ప్రతిమయున్నది. ఆమె యిట్లన్నది. "నిన్న నీకు మోహము యొక్క స్వరూపము చెప్పితినికదా! స్త్రీత్వము నీవు మోహము పొందిన యొకానొక స్త్రీయందలి సౌందర్యము. ఆ ప్రతిమయందు నీకు కావలసిన సౌందర్యమంతయు నున్నది. ఆ ప్రతిమయందు స్త్రీత్వములేదు. అది స్త్రీయేకాని బొమ్మగనుక దానియందు స్త్రీత్వములేదు. నీవు పరమోద్వేగము కలవాడవు. రేపు మనము కాశ్మీరములకు పోవుచున్నాము. నీ సమస్యల నన్నింటి నచ్చట పరిష్కరింతును. ఓపికపట్టుము. నీ యూహ యొక్కటి నిజమైనది. "ఆమె స్త్రీకాదు పురుషుడు కాదు. సంసారమున కయోగ్య' యని యితరులతో చెప్పనెంచితివికదా! అది చాల నిజము: మనము కాశ్మీరములకు పోవుటకు పది దినములు పట్టును. అప్పుడే మరల కలసికొందము" అంత భ్రమరీనాదము. నిద్ర.

# ద్వితీయాధ్యాయము

## 1

కులూతమునుండి కాశ్మీరమునకు రెండు త్రోవలు కలవు. ఒకటి త్రిగర్తమునుండి హిమవత్పర్వతములలోనికి పోయి అటునుండి కాశ్మీరములకు రావలయును. రెండు గాంధారముల లోనికి పోయి తక్షశిలద్వారా ఎగువకు కాశ్మీరములకు పోవలయును. మొదటిత్రోవ వెంట బోయినచో మార్గము శిలామయముగ నుండును. కాశ్మీర దంతావళములు శిలామార్గములయందు బోవుట యలవాటైనవైనను శిలామార్గములందు వానికి సుంత యిక్కట్టు కలుగును. ఒక్కొక్కప్పుడు సూదులవంటి రాళ్ళు పాదముల యందు గ్రుచ్చుకొనుటయు నవి గీపెట్టుటయు మావటీండ్రు బాధపడుటయు జరుగును. ఆ మార్గము చక్కగా నిర్మితముకాదు. ఇంటికిపోయిన తరువాత గుఱ్ఱములకు నేనుగులకు పది పండ్రెండు దినములు విశ్రాంతియు, గిట్టలకు పాదములకు నౌషధలేపము, వానికి పరిచర్య చేయవలసి వచ్చుచుండును. లేనిచో ప్రధానముగా నాంబెల నుపయోగ పఱుచ

వలయును. ఆ యుంటెలమీద నెంత మెత్తని పరుపులు వేసినను వానిమీది ప్రయాణము ఉయ్యాల జంపాలలుగా నుండును. పెండ్లికూతురు పేరు భ్రమరవాసిని. ఈ పేరు పెండ్లికొడుకున కొక్కనికే తెలియును. తక్కినవాఱందరకు తెలిసిన పేరు రణరంభాదేవి. చోళరాజు తన కూతునకు రణరంభయని పేరు పెట్టెను. కాశ్మీరమునకు చోళదేశము మిక్కిలిదవ్వు. రణరంభ కాశ్మీరాధిపతియైన రణాదిత్యుని వరించినపుడు చోళరాజైన రతిసేనుడు - రణాదిత్యుడు వివాహమునకు చాల దవ్వురావలసి యుండునని తన మిత్రుడైన కులూతాధిపతి యింటికి కూతును రణరంభను పంపెను. అక్కడ వివాహము జరుగును. రణాదిత్యుడు కాశ్మీరములనుండి సులభముగా వచ్చును. సులభముగా వెళ్ళునని రతిసేనుని యభిప్రాయము. వివాహమునకు రతిసేన మహారాజుగాని యాయన భార్యగాని రాలేదు. చోళరాజ్యమునుండి కొంత సేనయు, పరిచారికా పరిచారక జనమును, పది యేన్గులును, వందగుఱ్ఱములును కనకాద్యాభరణములును చోళరాజు పంపించెను. రణాదిత్యుడు కాశ్మీరములకు తిరిగిపోవునపుడు తెలిసెను. అవియన్నియు నల్లునకు నరణముగా పంపించెనని. వారందరు పెండ్లికొడుకు వెంట కాశ్మీరములకు బయలుదేరిరి. ఇదికాక కులూత దేశ మేనుగులకు ప్రసిద్ధి. కులూతాధిపతి రణాదిత్యుడు తనకు గూడ నల్లుడే కనుక యాయన గూడ యరణమిచ్చెను. ఆ యరణము ప్రధానముగా వంద యేనుగులు. ఇట్లుండగా భాషా భేదముచేత నిన్నాళ్లుగా, మరియు నిప్పుడు మార్గ మధ్యమున కొన్ని యిబ్బందులు కలుగుచుండెను. చోళులు దాక్షిణాత్యులు. కులూత దేశ ప్రజలు నౌత్తరాహులు. కాశ్మీరీయులు వారి భాషవేరు. అది కాశ్మీర భాష. కాశ్మీర కులూత భాషలకు కొంత సాన్నిహిత్యమున్నది. కాని చోళభాషకు నుత్తర దేశ భాషలకు సాన్నిహిత్యము తక్కువ. చాళుక్యుల భాషకు చోళుల భాషకే కొంత దవ్వు. చాళుక్యుల భాషలో సంస్కృత శబ్ద బాహుళ్య ముండును. చోళుల భాషలో దేశ్య శబ్దము ఎక్కువగా నుండును. ఒక భాష అర్థమగుటకు ప్రధానముగా రెండు కష్టములుండును. శబ్దము లర్థమగుట వేఱు. ఒక్కొక్కపుడు సామాన్యముగా సర్వశబ్దములు సర్వభాషలందు సంస్కృతజన్యములగుటచేత కొంతకొంత వికృతినందినను, జాగ్రత్తగా చూచినచో శబ్దమదియని గుర్తునకు వచ్చును. తద్భవభాషయందు నర్థవిపరిమాణ మున్నను అట్టి శబ్దముల సంఖ్య తక్కువగా నుండును. మఱియు శబ్దములయొక్క యర్థము ప్రసంగావదితమై సంయోగ వియోగాది లింగములచేత, సందర్భముచేత, నిర్దేశముచేత తెలియవచ్చును. ప్రధానమైన బాధ ప్రత్యయములందురు. క్రియా రూపములందు నుండును. వెళ్ళు, చూచు, కొట్టు, తిను, పరువెట్టు మొదలైన సామాన్యక్రియారూపముల యర్థము హస్తాదిసంజ్ఞలచేత నిరూపితము కావచ్చును. తిరస్కరించు, వలచు, ప్రయోగించు, మొదలైన ధాతువులయర్థములు నిరూపింప బడవు. నిజానికి సర్వభారతదేశమందు సంస్కృత భాషయే రాజభాష. అన్ని రాజ్యములయందు వ్యవహారము సంస్కృతములోననే జరుగును. మంత్రులు, సేనానులు, మహోద్యోగులు, వ్యవహర్తలు, సంస్కృతమును చదువుకొందురు. ఆసేతు శీతాచలము సామాన్యభాష సంస్కృతము. రామేశ్వరమునందు తోటలలో పనిచేయు కూలివాడు వారణాశీ క్షేత్రమునకు పోయి విశ్వేశ్వరుని దర్శనము చేయవలయుననగా, బదరీ క్షేత్రమున కేగి నారాయణుని సేవించి రావలయుననగా వానికి సంస్కృతము రాదు. అటునించి యిటుగాని యిటునుంచి యటుగాని మహాక్షేత్ర దర్శనలాలసులైన

సామాన్యులును క్షేత్రా జీవులునైన యాత్రికులు గుంపులుగా చేరి బాగుగా సంస్కృత భాష నెరిగిన వానిని తమ వెంట తీసికొనిపోదురు. అనాదినుండి నేటివరకు భారతదేశమున నిదియే పరిస్థితి. ఇప్పుడు రణరంభవెంట వేయిమంది చోళ సైన్యము, రెండువందలమంది పరిచారికలు, వందమంది పరిచారకులు వచ్చిరి. వారికి సంస్కృత భాష రాదు. వచ్చిన సేనలో మువ్వురు నలువురు సేనాపతులున్నారు. వారికి సంస్కృతభాష వచ్చును. రణరంభ సంస్కృతమునందు మహావిద్వాంసురాలు. ఆమె చదువులో- చూపించినచో అంటుకొని పోయెడిదట. ఆమె గ్రహణ శక్తికి చదువు చెప్పిన విద్వాంసులు కూడ నివ్వెరపోయిరట. ఆ సైన్యములకు నీ సైన్యములకు సామాన్యమైన ధర్మమొక్కటియే. అది రాజభక్తి. కాశ్మీరీయులకు రాజభక్తి, కులూత చోళ దేశస్థులకు రణరంభాగత మైన భక్తి భావము. అందరును కలసిమెలసి యుండుటలో చిన్ని చిన్ని భేద భావములు వచ్చును. అన్నిటికి పరిష్కారము రణాదిత్యుని దగ్గఱ రణరంభదగ్గఱ. ప్రయాణములో వారిద్దరి కలయికయు కొంచెము దుర్ఘటముగా నుండెను. రణరంభ తన యరణపు సైన్యముతో తన పరిచారికా పరిచారకులతో వెనుక వచ్చు చుండెను. రణాదిత్యుడు ముందు పోవు చుండెను. వారందరు గాంధారములలో నుండియే పోవలసి వచ్చెను. ఒక రాజు సైన్యము మరియొక రాజు రాజ్యమునుండి పోవుచున్నచో స్నేహ పూర్వకముగా వెళ్ళు చున్నను మొదట ననుజ్ఞ కావలయును. రణాదిత్యుడు పెండ్లికి తరలివచ్చునపుడు శైలమార్గమున వచ్చెను. అచట నున్నవి చిన్నచిన్న రాజ్యములు. ఎక్కువమంది కాశ్మీరములకు లోబడినవారు. అనుమతి లేకుండ కాశ్మీర సైన్యము తమ రాజ్యములోనుండి వెళ్ళినను నేమియు చేయలేనివారు. ఆసైన్యము తమ మీదికి రాలేదు. తమ గ్రామములను దోచికొనలేదు. పెండ్లికిపోవుచు మార్గముగా తీర్చికొనిరి. ఒకటి రెండు దినములు నిలచిరి. వారి బత్తెములు వారే తినిరి. గాంధారములలో పోవుట నట్లుకాదు. రణాదిత్యుడు తాను పెండ్లికి తరలివచ్చునపుడే తిరిగివచ్చునపుడు గాంధారములలో నుండి వత్తుము, అనుజ్ఞ నిప్పించవలసినదని త్రిగర్త గాంధారాధిపతులకు వార్తపెట్టెను. ఇద్దఱు సేనాధిపతులను పంపెను. త్రిగర్తమునకు వెళ్ళినవాడు తిరిగి వచ్చెను. గాంధారములకు పోయినవాడు రాలేదు. ఈ యనుమతి పట్టి యాచారము. అనుమతి కొఱకు సేనాపతి వెళ్ళెను కనుక దాని యంతట నదియే వచ్చును. దాని కొఱ కెదురు చూడ నక్కరలేదు. అది వచ్చినట్లుగానే భావించి ప్రవర్తించవచ్చును. గాంధారములో నుత్తర భాగమున సింధునదియొక్క మొదటి పాయలు రెండు దాటవలయును. ఒక నది వరదల మీద నుండెను. దాటుటకు వీలులేక సైన్యము తీయొడ్డున నాల్గైదు దినములు నిలువవలసి వచ్చెను. చోళులకు సముద్రము దగ్గరిది. చోళ సైన్యములో చాలమంది సముద్రము నెఱిగినవారు. సముద్రములో నీదుటయు చేపలు పట్టుటయు నలవాటైనవారు. కులూత కాశ్మీర సైన్యముల కీ నేరవిడి తక్కువ. అంత సైన్యము ప్రయాణము బయలుదేరిపోవునపుడు మార్గమునందు కొన్ని దినము లుండవలసి వచ్చునని అంచనావేసి బత్తెములు తెత్తురు. వస్తుభాండారాధిపతులకు నాల్గు దినము లెక్కువ ప్రయాణమయ్యెను. పాథేయముయొక్క కార్శ్యమును గూర్చి భీతి కలిగెను. నది వరదలమీద నున్నది. వీలైనంతవరకు నదిలో చేపలను పట్టుకొని భుజించవచ్చునని, సేనాపతులు - వారు వేయిమంది, వీరు వేయిమంది యయిన సైన్యమున కాజ్ఞలిచ్చిరి. చోళ సైన్యము-పొంగి వచ్చు నదిలో, నృత్యము చేయు

నదిలో, తరంగ ఘట్టనము చేయు నదిలో, నురుసులు గ్రక్కు నదిలో, తటములొరసికొను నదిలో, సుళ్ళు తిరుగు నదిలో, ప్రపాతము చేయు నదిలో వీరే చేపలవలె తిరిగి చేపలను సమృద్ధిగా పట్టుకొనిరి. అందులో అవి మంచినీటి చేపలు సముద్రములో వలె ఉప్పు నీటి చేపలుకావు. ఆ మంచినీరెట్టిది? గంగానది యొక్క తొలిపొతలో హిమగిరి శిఖరములనుండి, ఉపత్యకల నుండి నాయౌషధీ సమ్మిశ్రితారోగ్య మిశ్రిత జలములో నుండి వచ్చినది. సంగ్రహించిన మత్స్య భారము వారికి చెరిసగముగా రావలయును. నిజాని కీ నియమము లేకపోయినను సౌహార్దము చేత నట్లు జరుగవలయును. చోళ సైనికులు తమ దేశమును వదలి పదిపదేను దినములైనది. అలవాటు పడిన ప్రాణములు కనుక మత్స్యాహారమునకు వారికి మొగము వాచినట్లైనది. చోళసైనికులు మత్స్యములను వండికొని తినుచుండిరి. ఆ సువాసనలు కులూత కాశ్మీర సైనికులకు సోడుముట్టినవి. వీరడుగుటయు, వారు నోటితో పేదనకుండ చేతితో లేదనుటయు, వీరికి కోపములు పెరుగుటయు, తాము మగసెండ్లవారమన్న యహంకారము తొలుత చిన్ని చిన్ని పుడకలతో రగిలించినదియై, తరువాత కట్టెలు వేసిన నెగడియై నెగడెను. కత్తులు దూయుట దాక వచ్చెను. తొలుత నుండియు కాశ్మీర కులూత సేనలకు చోళ సైన్యమన్నచో కొంత యేవగింపు. తిరస్కారము. తక్కువతనము. ఔత్తరాహ లాజానుబాహులు. విశాలవక్షులు. దృఢకాయులు. చోళులు పొట్టివారు. నల్లనివారు. అందుచేత కాశ్మీర కులూత సైనికులు చోళులను సులభముగా నదుపులో పెట్టగలమనుకొనిరి. పరస్పర సంఘర్షణము జరుగువేళకు చోళసైన్యము తక్కువదిగా కన్పించలేదు. చోళులెంతమంది దెబ్బలు తినిరో ఔత్తరాహులంత కంటె నెక్కువ తినిరి. మరణము లటునిటు చెరిసమానముగానే యుండెను. అంత సేనాపతులు కలిపించుకొనుట సర్దుబాటుచేయుట జరిగినను వ్యవహారము రణరంభా రణాదిత్యుల దగ్గఱకు పోయెను. విచారించగా విచారించగా వడసారము వివాదము యొక్క మూలభూతమైన విషయమిట్లు తేలినది. కాశ్మీరీయులు మత్స్యముల చెరి సగమనిరి. చోళులు వారికి పావువంతు మిత్తుమనిరి. ఔత్తరాహుల కర్థము కాలేదు. "పదియో పరకయో యిత్తుమని వారనిరి" యని వీరనుకొనిరి. చతుర్థ భాగమన్నచో తెలిసెడిదే. ఇది మొదటిమెట్టు. మాట యర్థము కాకపోవుట దీనికి హేతువయ్యెను. అటునిటు చనిపోయినవారు దొమ్మి జరిగినచోట పడియుండిరి. వారు చనిపోయినసి సేనానులును, సైనికులును చనిపోలేదని రణరంభ. భార్యభర్త లిద్దఱును పోయి చూచిరి. రణరంభ పోయి వారినందరిని స్పృశించెను. అందరకు నూపిర యాడుచున్నది. గాయపడిన వారినందరను స్పృశించెను. అందరకును బాధలు ఉపశమిల్లెను. అది సంధ్యాకాలము. వారందరును బ్రతికిరి. మరునాటి ప్రొద్దున నౌత్తరాహులైన సైనికుల ప్రధానములైన గుడారములముందు మత్స్యములు ప్రోగులు పడియుండెను. అందఱు యథేచ్ఛముగా నారగించిరి. అర్ధ రాత్రము నందు చోళ సైనికులు తీసికొని వచ్చి వాని నచట వేసి పోయిరని కులూత కాశ్మీర సైనికులనుకొనిరి. "మరల నిట్టి వివాదము జరిగినచో ప్రధానులైన వారిని తీవ్రముగా దండింతుమని" రణాదిత్యుడు చెప్పెను. "వారి కావిద్య తెలియును. రేపు కొండలలో మీరు వేటాడుదురు. వారు పార్వతేయులు కారు. వారికి కొండలలోని వేట చేతకాదు. మీరు తెచ్చినది వారికి సగమిత్తురా" అని రణాదిత్యుడనెను. రణరంభ అర్ధ మందహాసము చేసెను.

# 2

అప్పటినుంచి భిన్న ప్రదేశములందు భిన్నములైన యూహలు ప్రబలెను. చనిపోయి లేచినవారు కథలు చెప్పనారంభించిరి. ఒకడిట్లనెను. "గడ్డములున్నవి. మీసములున్నవి. కరిముద్దులవలె నున్నారు. మట్టలాగూలు మట్ట చొక్కాలు తొడిగికొని యున్నారు. నన్ను తీసికొనిపోయినారు. ఎక్కడికి తీసికొని పోయినారో తెలియదు. ఒక యెత్తయిన పీటమీద రత్నకంబళము పఱచియున్నది. దాని మీద నాయన కూర్చున్నాడు. ఆయన కన్నులు ఎఱ్ఱగా నున్నవి. చంద్ర నిప్పులవలె నున్నవి. ఆయన కారు మేఘమువలె నున్నాడు. ఆయనకు పెద్దకోరలున్నవి. కాలాంజనపర్వతము వలె నున్నాడని చెప్పవచ్చును. మేలిమి బంగారు వన్నె పట్టు బట్టధరించి యున్నాడు. ఆయన కుడిచేతిలో పెద్ద గద యున్నది. ఎడమచేతిలో సన్నని పగ్గములున్నవి. ఆయన ప్రక్కనే యొక పురుషుడున్నాడు. అతడేదియో పుస్తకములను తిరుగవేయుచున్నాడు. ఆ ప్రక్కనున్న పురుషుడు నన్ను చూచినంతనే యిట్లనెను : "వీడు కాదు. వీనిని తీసికొని వచ్చితిరేమి? వాడు వీనివలెనే యుండును. మీరు పొరపడితిరి కాబోలు. ఇట్లు చాలసార్లు జరుగుచున్నది. వీని మూలముగా మానవ లోకములో నొక దురభిప్రాయ మేర్పడుచున్నది, చచ్చిపోయినవారు మరల బ్రతుక వచ్చునని. వీనిని తీసికొని పోయి యచట వదలి పెట్టిరండు. వీడు చనిపోయిన చోట సుంత దూరములో ఒక గ్రామమున్నది. ఆ గ్రామము నిజముగా వీడు చనిపోయిన చోటనే యుండవలయును. కాని యొకరాజు వివాహము చేసికొని తన స్వంత సైన్యముతో నరణముగా వచ్చిన సైన్యముతో నాపల్లె కభిముఖముగా వచ్చుచుండెను. ఆపల్లెలోని జనమందరు భయపడి తమ యిండ్లు వదలి పారిపోయిరి. ఆ పల్లె ప్రజలకు వారు తమ పల్లియ మీదికి దండయాత్రకు వచ్చుట లేదని వారొక పెండ్లి వారని క్రమముగా తెలిసి యచటికి పదిగవ్యూతుల మేర తాత్కాలికముగా విడిసిరి. రేపు ప్రొద్దుటికి పెండ్లివారు వారి త్రోవనవారు పోదురు. తమరు వచ్చి తమ పల్లియ నాక్రమించుకొనవచ్చునని యనుకొనుచుండగా నా రాత్రి బ్రహ్మ ప్రళయముగా కొండలలో వర్షములు కురిసి తెలవారకముందు విపాశానది వరదల మీద వచ్చినది. ఆ రాజసైన్యము నాల్గుదినము లచ్చటనే యున్నది. ఈ భటులా స్థలమునే చూచిరి. కాని ఆ వ్యక్తిని చూడలేదు. వీనిని తీసికొనిపోయి అచ్చట వదలి పెట్టిరండు. అచటికి నాల్గు గవ్యూతుల మేర నా పల్లె ప్రజలు విడిసిన చోట సరిగా వీనివంటివాడే యుండును. వానిపేరు కాలభటుడు. తీసికొనిరండు." అని నన్ను వదలిపెట్టిరి. వాడు నన్ను తీసికొని వచ్చెను. నేను బ్రతికితిని. మీరు పోయి అచ్చట చూచినచో ఆ కాలభటుడన్నవాడు మరణించియుండును." అని చెప్పగా కొందరు సైనికులు తత్ప్రదేశమునకు పరువెట్టిరి. ఆ నదికి వీరు విడిసినచోటికి కుడిగా నాల్గు గవ్యూతుల మేర పోవగా నచ్చటి పల్లె ప్రజలందరు గుమ్ములై యుండిరి. ఆ నది వచ్చునని వారనుకొనలేదు. నదివచ్చుట గుర్తు పట్టి పిల్లలతో మేకలతో దూరదూరముగా పోయి అచ్చటనున్న యొక చిన్ని గుట్టపై నిలిచిరి. ఆగుట్టమీద నాల్గైదు చెట్లుండెను. నదీ ప్రవాహములో కొట్టుకొని పోయినవారెవ్వరును లేరు. ఒక చెట్టుక్రింద కూర్చుండి పదిమంది యేడ్చుచుండగా నీ సైనికులు పోయి వారి దుఃఖహేతువు నడిగిరి. వారిట్లనిరి. "అయ్యా ఇంతవరకు

రోగములేదు. రోష్టులేదు. వరదలు వచ్చి మమ్ము ముంచునను కొంటిమి. ఇతడసహాయ శూరుడు. గొప్ప బలవంతుడు. మా పదార్థములన్నియు వరదలో కొట్టుకొనిపోకుండ వాని నన్నిటిని నొక పెద్దమూటగట్టి తానొక్కడును మోసికొని వచ్చినాడు. నిన్న సాయంతనము వరకు క్షేమముగనే యున్నాడు. కారణమేమియు లేదు. కూర్చున్నవాడు కూర్చునట్లుగానే చనిపోయెను" అని ఏడ్వ నారంభించిరి. వీరతని పేరడుగగా వారు "కాలభటుడు" అని చెప్పిరి. ఆసైనికులు తిరిగివచ్చి యీ కథను స్కంధావారములో వ్యాపింపజేసిరి. ఇట్లు చచ్చి బ్రతికినవారు మరి తొమ్మండుగురు కలరు. అందరునూ తలా యొక కథయు చెప్పిరి. నాల్గయిదు కథలు సరిపోయినవి. తక్కిన వానికి సాక్ష్యములేదు. ఇట్లుండగా సైన్యములో రెండు విధములైన విశ్వాసములు బయలుదేరినవి. ఒక విశ్వాసము క్రొత్తరాణి మహాదేవి, భగవతి, వైష్ణవి, మహామాయ. ఆమె చావు బ్రతుకులమీద నధికారము కలది. రెండవ విశ్వాసము "మూర్ఖులట్లే భావింతురు. ఆ చనిపోయినవారు నిజముగా చనిపోలేదు. యమభటులు ప్రమాదవశమున వారిని తీసికొని పోయిరి. వదలిపెట్టిరి. వారు బ్రతికిరి. ఇచ్చట క్రొత్త రాణికి చావు బ్రతుకుల మీద నధికార మెక్కడిది? ఆమె దయావంతురాలు. వచ్చి పరామర్శించెను." ఇట్లు రెండవవారు. మరి మూడవవారు "ఔనయ్యా! మీరు చెప్పినట్లే యొప్పుకొందము. మేమందరము గాయపడితిమి. ఆమె మా శరీరములను స్పృశించెను. మాకు బాధ తగ్గెను. దీనికేమందురు?" అనగా సమాధానము లిట్లు వచ్చెను. "ఓయి వెర్రి బాగుల వారలారా! ఆమె మహారాణి. అంతఃపుర స్త్రీ. అంతఃపురమునుండి ఎప్పుడును వెలుపలికిరాదు. క్రొత్త పెండ్లికూతురు. మన జన్మలలో మన మట్టి సౌందర్యవతులను చూడము. ఆమెయు మానవస్త్రీయే. కాని ఆ ధనము, ఆ భోగము ఆ పెంపకము ఆ అసూర్యంపశ్యతనము ఆ పాలమీగడలమీది బ్రతుకు, పరమ సుకుమారమైన యాహారము, శ్రమ యనగా నెట్టిదో యెరుగక పోవుట, కాలు క్రింద పెట్టకుండుట, ఆమె తలచికొన్నంతలో కోరికలన్నియు తీర్చబడుట, ఆమె యెట్లుండును? ఒక దేవత భూమికి దిగి వచ్చినట్లుండును. ఎన్నడును కనిపించని రాణి, స్వర్గమునందలి దేవతా స్త్రీ లిట్లుందురేమో యన్నట్లున్న రాణి, కనిపించుటతోడనే మీ యొడళ్లు మీకు తెలియలేదు. ఆమె మిమ్ము తాకినంతనే మిమ్ము మీరు విస్మరించిరి. ఇది మనో లక్షణమే తప్ప ఆమె యొక్క దేవతాత్వము కాదు."

ఇట్లుండగా రణాదిత్యుడానాటి రాత్రి రాజభోగము లన్నియు సమర్చబడిన తన గుడారములో పండుకొనెను. భార్యాభర్తలిద్దరును పోయి గాయపడిన వారిని, చనిపోయిన వారిని చూచి వచ్చిరి. రణరంభ వారిని తాకుట, కొందరు బ్రతుకుట, కొందరికి గాయముల బాధ పోవుట తాను ప్రత్యక్షముగా చూచెను. అతడాశ్చర్య పడుచుండెను. ఇద్దరును విడిపోవు వేళకు భార్య చిరునవ్వు నవ్వెను. అది చిరునవ్వు కాదు. సగము నవ్వు. ఆమె ఎందుకు నవ్వెను? తాను తిరిగి నవ్వలేకపోయెను. తిరిగి నవ్వుటకు కారణము కన్పించలేదు. సగము నవ్వుటకు యామెకు గల కారణమేమి? తన గుడారమునకు రమ్మని యామె నాహ్వానించుటకు రణాదిత్యుడు భావించెను. ఆమె రానన్నచో తానేమి కావలయును. తనకు మర్యాదా భంగము. ఆమె వెంట నామె చెలికత్తె లున్నారు. వారి యభిప్రాయములో తానేమగును? మూడు నిద్దురలైన తరువాత భార్య మీద భర్తకు నధికారము లేనిచో తన ప్రేమ వ్యక్తము సంగతి యేమి చెప్పవలయును? మ్రాకై వంగనిది మ్రానై వంగునా? తన సంసారము సాగినట్లే! తన

సుఖభావము పుష్పించినట్లే! తన వంశము ఫలించినట్లే! రణాదిత్యునకు మూడు దినములు తన సుఖ భావములను గూర్చిన భావన. కులూతమును వదలినప్పటినుండియు సంతానమును గూర్చిన భావన. అశ్వమేధయాగము చేసిన శ్రీరామునికి బంగారు సీతయైనను ప్రక్క నుండెను. మూన్నాళ్ళు తన ప్రక్క పండుకొనిన రణరంభ బంగారు రంభ కాదే! మరకతమయము. బంగారము మెత్తని లోహము. అందులో రాగియో మరే లోహమో కలుపనిచో నగలకు పనికిరాదు. వాణెము చేయవలయునన్నను పఱలోహము కలుపబడవలయును. అచ్చమైన మేలిమి బంగారము మెత్తనిది. వంచవచ్చును. శ్రీరామ చంద్రుని సీతాదేవియట్టిది. ఆమె కొంత కాకపోయిన కొంత యయినను మెత్తనిది. సహజముగా సీతాదేవియొక్క హృదయము మెత్తనిది. ఆ సంగతి తెలిసిన శ్రీరామచంద్రుడు తన భార్యా ప్రతిమను బంగారముతో చేయించుకొన్నాడు. ఇది శిలా ప్రతిమ. తాను చేయించుకొన్నది కాదు. ఆమెయే తన హృదయ లక్షణమునందు పొందు పఱచి తన ప్రతిమను తాను చేయించుకొన్నది. ఆ ప్రతిమకు కాలు చేతులాడును. చక్కగా ప్రక్కకొత్తిగి పండుకొనుట చేతనగును. తా వన్మాత్రమైన తన సంసారమునందు తాను స్త్రీ సంగమ సౌఖ్యమును వాంఛించుట నాల్గయిదు దినముల క్రిందటి విషయము. ఆ యాశ పూర్తిగా వదలిపోయినది. అంతియే కాదు. తన సంగతి నలుగురితో చెప్ప కొందమన్నను వీలులేదు. ఆమె అంత గడుసరి. ఆమె విచిత్రముగా నేదో ప్రతివ్యూహము పన్నును. తాను చివరి దినమున పూలచెండు విసరెను. గంధము పూసెను. తమలపాకును కొరికెను. ఇంక నేమున్నది. సూర్యుడు పశ్చిమమున నుదయింపబోవుచున్నాడనుకొంటిని. ఇట్లు చూడగా వది తూర్పే. ఇట్టి భార్యతో సంసారమును, సంతానమును. తన గోడెవరితో చెప్పి కొనవలయును?

రణరంభవెంట చెలికత్తెలున్నారు. అందరు నందకత్తియలే. ఒక వంద సౌందర్యము లొకచోట నున్నవి. దేని వైలక్షణ్యము దానిదే. అందరిలో రణరంభ నిస్సందేహంగా మహా సౌందర్యవతి వలె కనిపించుచున్నది. ప్రత్యేక ప్రత్యేకముగా వారి వంక చూచినచో వారు సౌందర్యవతులనిపించునే కాని వారివంక చూచి మరల నటు చూచినచో సూర్యునిముందు దివ్వెటీలు. ఇట్లుండగా వారిలో నొక్కార్తుక యున్నది. ఆమె నిదివరకు చూడలేదు. ఇదివరకు చూడలేదనగా నెప్పుడు చూచును. అతడు కులూత దేశములో రాచకన్నియల నెరుగునా? రణరంభవెంట కులూత దేశాధిపతి తోడుగా నరణముగా పంపబడిన స్త్రీల నందర నతడెరుగునా? అతడు కొందరి నెఱుగును. తన కార్యమైన మూడు దినములయందు పాన్పుపైని ముచ్చటలు నెరుపుటకు వచ్చిన స్త్రీల నెరుగును. వారిలో నెక్కువమంది వృద్ధ బ్రాహ్మణ స్త్రీలు. మరి కొందరు వారకాంతలు. రాజదుహితలు రాజస్నుషలు రాలేదు. రారు. ఇతడు వారి నెట్లెరుగును? ఈ కనిపించిన స్త్రీ పరిచారిక కాదు. బ్రాహ్మణ స్త్రీ కాదు. రాజస్నుషయో, రాజదుహితయో కావలయును. ఆమె చోళాంగనయా? కులూతాంగనయా? అదియును తెలియదు. చోళరాజ స్త్రీలు ఫాలములందు విభూతులను ధరించు చున్నారు. వారియందదియొక వైలక్షణ్యము కానిపించుచున్నది. రణరంభ కూడ తన జన్మ స్థానమందలి యాచారము నవలంబించి ఫాలమునందు విభూతి దాల్చినది. ఆ క్రొత్త బాలిక ఫాలభాగమున విభూతి రేఖ లేదు. ఆమె స్త్రీకాదు. బాలిక కాదు. ఆమెయందు యౌవనము మొగ్గ తొడిగినది. ఆ యౌవన ఛ్ఛాయ సీతాకోక చిలుక

రెక్కవిచ్చినట్లున్నది. ఆమెనుండి యొక కాంతి ప్రసరించుచున్నది. ఆమె యెవ్వరు? పరిచారికలలో నటువంటి స్త్రీయుండదు. ఆమె యౌవన ప్రధాన దేహళీదత్తమణి దీపిక ఆమె రాజస్నుష కాదు. స్నుషయైనచో రాజకుటుంబములయందు నాడబిడ్డవంటి వామె యత్తింటికి పంపరు. సామాన్య సంసారములందు పెండ్లికూతువెంట బంధువులైన స్త్రీ లామె యత్తవారింటికి పోదురు. అచ్చట నామెకు క్రొత్తగా నుండును. ఎరిగి యుండిన మొగముండదు. అచటి పరిచయము ప్రబలువరకు పుట్టింటి వారెవ్వరో యామె వెంట నుందురు. అట్టి యాచారము రాజకుటుంబములందు లేదు. ఈ యువతి రాజదుహిత కావలయును. కాని తాను కులూత రాజధానిలో నాల్గయిదు దినములుండెను. ఆ రాజానకు ముచ్చురు కుమాళ్ళని తెలిసికొనెను. ఆ బావమరదులలో నిద్దరిని జూచెను. ఆయనకు కూతుండ్రెంతమంది? ఎంతమందికి వివాహము లయ్యెను? ఎంతమందికి కాలేదు? తా నీవిచారణయే చేయలేదు. అది యడిగినచో తప్పేమో? మర్యాద కాదేమో? శ్రీనగరము నుండి తన వెంట వచ్చిన పరిచారికలకు తెలియదు. కులూతదేశ రాజ రాజాంతఃపుర పరిచారికలవద్ద తనకు చనువులేదు. ఇంతకు తనకెక్కడ తీరినది? మొదటి దినమంతయు తనకోసమై యొరగపెట్టబడియున్నదన్న భ్రాంతి కల్పించిన యమృతపు చేరువంటి రణరంభను గూర్చిన యాలోచన తోడే సరిపోయెను. తక్కిన రెండు దినములు క్రొత్తక్రొత్త సమస్యలు, తనకు తోచని పరిష్కారములు. తోచిన పరిష్కారములు పరిష్కారములు కాకపోవుట. దుఃఖము, ఆవేగము, ఉపశమము, కోపము, రోషము, చివరకు ప్రశాంతి అన్నిటికి మించిన యాశ. ఆహా! ఆశయెట్టిది? తీరరాని దాహము వేయుచున్నది. సముద్రపుటొడ్డున నిల్చున్నాడు. అది త్రావరాని జలమని తెలియును. సముద్రమునంతయు త్రావవలయునని కోరిక. ఏదో భాగ్యరేఖచేత ఆ సముద్రజలమంతయు శర్కరామిశ్రిత జలమగునన్న వాంఛ.

# 3

మఱునాటి ప్రొద్దుటకి కులూత కాశ్మీర సైనికుల ప్రధాన స్కంధావార పట గృహము ముందు బ్రహ్మాండములైన మత్స్యముల రాసులు పడియుండెను. ఎట్లు పడియున్నవి? ఎవరు తెచ్చిరి? అన్ని చేపలనెవరు పట్టిరి? చోళ సైనికులు భయపడి యర్ధరాత్రమునందు పోయి, తెల్లవారులును చేపలనుపట్టి కులూత కాశ్మీర సైనికుల కోపములు పోవుటకు నిట్లు చేసిరా? ఎంతచేసిన నొక్కరాత్రియందు నిన్ని చేపలను పట్టుట సాధ్యమా? సముద్రములోనైనచో నిన్ని చేపలను పట్టవచ్చును. ఒడ్డున పల్లెలలోనున్న పల్లెవాండ్రు పదిపదేను గవ్యూతుల మేర పరుచతగిన వలలను చిన్ని చిన్ని పడవలలో బయలుదేరి గంగలో అనగా సముద్రములో (పల్లెవాండ్రు సముద్రమును "గంగ" యని యందురు) అదివరకు సముద్రములో నీరు లేదుకదా! కపిలర్షియొక్క కోపముచేత సాగరులు భస్మీ భూతులు కాగా చిన్న చిన్న బూదిదిబ్బలుగా పడియుండగా, భగీరథుడు తపస్సు చేసి స్వర్గమునుండి గంగను ధాత్రికి తెచ్చెను. గంగానది ఆ సాగరులేర్పడిన బూది దిబ్బలను నింపెను. అందుకనియే దానికి సాగరమని పేరు వచ్చినది. సామాన్యముగా ప్రకృతిశాస్త్రవేత్తలు ఖగోళశాస్త్రవేత్తలు జలమే గడ్డకట్టి భూమిగానైనదని, కొంత భాగము సముద్రముగా

మిగిలినదని చెప్పుదురు. దానికి సామంజస్యము కుదరదు. ఈ భూగోళము అనంతాకాశములో నున్నది. గడ్డ కట్టిన మేరయు కట్టని మేరయు వట్టి జలముగ గట్లు లేని గుండ్రని చెరువుగా నాకాశమున నున్నదా? అది సాధ్యమా? సూర్యగోళమున్నది. అది యంతయు నగ్నిమయము. అది గోళముగా ననంతాకాశమున దాని యంతట నది నుండుట లేదా? అట్లే యీ యనంతాకాశమున నొకచోట జలముగా నుండగా చక్రముగా దానియందలి శ్రవణశీలమైన జలబిందువులు జలాణువులు పరస్పరాకర్షణశక్తి చేత నొక చోట నుండరాదా? అన్న ప్రశ్న పుట్టవచ్చును. అగ్నియొక్క లక్షణము వేరు. జలముయొక్క లక్షణము వేరు. అగ్ని దహన శీలమైనది. జలము శ్రవణశీలమైనది. అగ్నియింధనము నాశ్రయించి యుండును. జలము పల్లము నాశ్రయించి ప్రవహించును. సూర్యగతవహ్ని అనింధనమైనదా? నట్టి వహ్ని యింధనము లేకుండ నొక గోళముగా కట్టి జ్వలనశీలమై యుండునా? ఉండినచో యుండవచ్చును. జలమట్లు కాదే! అది ప్రవహించవలయును. ఆకాశమునందు యథేచ్ఛముగా గాలివలె తిరుగుచుండవలయును. వాయువు గోళముగా నేర్పడి, యొక్క గ్రహముగా నగుట కనిపించదు. అట్లే జలము కూడ తానొక గోళముగా నుండి కొంత ఘనీభవించి ధాత్రియై, కొంత జలముగానుండి సముద్రమగుట కలదా? సూర్యమండలముయొక్క పైభాగ మంతయు మహాగ్నిమయము. తద్గర్భమంతయు కూడ నగ్నిమయమే కావలయును. కాకుండ నెప్పటికి నారిపోని నిత్యజీవమైన మనకు తెలియని యింధనమైన పదార్థము సూర్యమండలగర్భవర్తియై యున్నదా? అచ్చటికి పోయినచో దగ్ధపటలమగుటయే తప్ప మరియొక దారిలేదు. కనుక చంద్ర కుజమండలములమీదికి ప్రకృత ప్రకృతి శాస్త్రము దండెత్తినట్లు, సూర్యమండలము మీదికి దండెత్తుటకు వీలులేదు. ఔను. కాదు. ఈ భూమండలమంతయు తొలుత నొక జలమండలము. మనకు తెలియని యనంత విషయములలో నిది యొకటి. ఇది ఆకాశములో వ్రేలాడుచున్న యొక్క పెద్ద నీటిగోళము. అది విశ్లథము కాకుండ నెందుకున్నదో మనకు తెలియదు. చెదరిపోకుండ నెందుకున్నదో మనకు తెలియదు, అని యంగీకరించి సాదృశముగానున్న ఈ మహాపాథోగోళము నటునడిమినుండి ఘనీభవించుచు వచ్చి వచ్చి ధాత్రిలో పైభాగమున నాల్గవవంతు భూఖండములుగా నేర్పడి, తక్కిన మూడువంతులు సముద్రములుగా మిగిలిపోయినవా! పర్వతములయొక్క యున్నతత్వమెట్లు గణించబడినదో సముద్రములయొక్క లోతుకూడ నట్లే గణించబడినది. ఈ భూమియొక్క యాకారము తేలి నూట తొంబదియైదు కోట్ల సంవత్సరములయినదని యచ్చటివా రిచ్చటివారంగీకరించు చున్నారు. ఇంతకాలము తక్కువ కాలము కాదు గదా! ఈ నడుమ సముద్రములు పొంగివచ్చి ధాత్రీ ఖండములను ముంచివేసినట్లున్నది. కాని సముద్రములోనుండి భూమి పైకి పొడిచికొని వచ్చినది. కాని జలమయమైన భాగము ఘనీభవించి ధాత్రియైన భాగము కనిపించలేదు. ఏదియైన నొక సిద్ధాంతము చెప్పినచో ఆ సిద్ధాంతముయొక్క లక్షణము కొన్ని వేల ఏండ్లమీదనైన భూగోళమునందో, మానవ సృష్టిలోననో ఎచ్చటనో యొకచోట దృశ్యమానము కావలయును. ఒక పరిణామము జరిగినది. ఆ పరిణామము పరిణామమైనచో అది కొంతదూరము వచ్చి యాగిపోవునా? తెలియదు. ఇదియంతయు నెందుకు చెప్పవలసి వచ్చినదనగా పల్లెవాండ్రు సాగరమును గంగ యందురు. గంగానది **యుత్తర దేశమునందు** ప్రవహించుచున్నది.

ప్రాక్సముద్రమునందు పడుచున్నది. ఆ గంగానది సముద్రములో కలిసెడి స్థల మెక్కడ? ఆంధ్రదేశముయొక్క సముద్రతీర మెక్కడ? చోళరాజ్యమునంటియున్న సముద్రతీరమెక్కడ? ఇక్కడి పల్లెకారులు సముద్రమును గంగ యనుట యేమి? దీని కొకటి చెప్పవచ్చును. ఈ పల్లెకారుల పూర్వులు భగీరథుని వంశమువారు. లక్షలాది సంవత్సరములు జరిగినను వారి వంశమునం దా మాట నిలచియున్నది. వారు నిర్ధనులైరి. అనాగరకులైరి. అపండితులైరి. వారికి రాజ్యములు పోయినవి. లక్షల సంవత్సరముల మీద వారికి మిగిలినది భగీరథుడు తపస్సు చేసి గంగానదిని ప్రవహింపజేయగా నా గంగయే సముద్రమైనది. కనుక నేటికిని వారు సముద్రమును గంగ యనుచున్నారు. ఈ యొక్క మాటయు మిగిలి, తక్కినదంతయు సర్వనాశనమైనది యనియా చెప్పవలయును. ఆ పల్లెకారు లట్లు గంగలోనికి చిన్నచిన్న పడవలమీద కెరటములలో బరువైన పదార్థములతో వలయొక్క అంచులు కదలకుండ గవ్యూతుల దూరముగ చుట్టును వేసికొని వత్తురు. రెన్నాళ్ళుంచి లేదా యొక దినముంచి ఆ వలను చివళ్ళు పట్టుకుని లాగికొనివత్తురు. అందులో పది పడవలకు సరిపోయినన్ని చేపలు వచ్చును. పెద్దవి. చిన్నవి. ఒక్కొక్కప్పుడు తత్తత్పరిసర ప్రదేశముల యందున్న జనుల కందరకు కొన్ని నెలల గ్రాసము వచ్చును. అంతపని యొక్క రాత్రిలో పొంగివచ్చిన విపాశానదిలో చోళ సైనికులు చేయుట సాధ్యముకాదు. లేనిచో యిది యెట్లు సమకూడినది? క్రొత్త రాణియొక్క యనుగ్రహముచేత సమకూడినది. ఆమె దేవతామూర్తి. తన పుట్టింటి సైనికుల వలననే కల్లోలము జరిగినది. ఈ సైనికులందరు కాశ్మీరములకు పోవుచున్నారు. అది తన అత్తిల్లు. వీరందరచ్చట నుండవలయును. వెళ్ళుచునే మార్గ మధ్యమున విన్ని కాలుష్యములతో, నీ యంతః శ్శైత్యములతో, నీ విరోధ భావాంకురములతో వెళ్ళినచో నచట వీరి స్థితి భద్రముగా నుండదు. వీరు కాశ్మీరములలోననే నిలచిపోవుదురు. నాల్గయిదేండ్లయిన తరువాత నా భాష నేర్చికొందురు. అచ్చటనే పిల్లలను గందురు. వారు కాశ్మీరీయులగుదురు. వీరి పిల్లలకు రెండు మూడు తరములైన తరువాత నప్పుడు మఱియొక కాశ్మీరరాజు నప్పటి చోళరాజు కూతును పెండ్లి యాడినచో యా చోళరాజు తన కూతునకు నొక వేయిమంది చోళసైన్యము నరణముగా నిచ్చినచో వీరి సంతతివారే వారిని పరదేశీయులు పరభాషీయులుగా వేళాకోళము చేయుదురు. తిరస్కరింతురు. చప్పరింతురు. ఏమి చిత్రమైన సృష్టి. ఏమి చిత్రమైన మానవ ప్రవృత్తి. మానవులకు తత్కాలమే తప్ప అనంతకాలము లేదు. కాని కృత్రిములు, కుత్సితులు, దుర్జనులు, రాజ్యాధికార వాంఛా దుష్టులు. బహుకాల భావనతో ప్రజలను గికురింతురు. జీవుని లక్షణమునందే వాని జననము వాని కూడు గుడ్డలను, వాని దేశమును తద్విషయిక జ్ఞానమును మించిపోయిన ఒక తెలివియున్నది. ఆ జీవుడు సర్వమైన తెలివికి గూడు. ఆ తెలివిలో నొక దేశము తత్కాల తద్దేశగత జీవిక. మిగిలిన తెలివినేమి చేయును? ఈ జీవిక చుట్టును పటము నల్లును. పట్టి కులూత వ్యవహారము. యోగులు ఆత్మారాములు, నిరహంకారులు, నిరపేక్షులునైన ఋషులు తదనంతకాలమును చూతురు. ఈ ఖండకాలము వారి పాదతలమునందంటుకొన్న బురదవలె నుండును. కాని దేవతలున్నారు. వారు మనుష్యజన్మ యెత్తినచో మానవులవలె ఖండకాలజ్ఞాన సంపన్నులుగా ప్రవర్తింతురు. కాని మహర్షులవలె యనంత కాలజ్ఞాన సంపన్నులు. దేవతలలో మహర్షులలో కొంతమంది కొంతమంది మానవసృష్టియందు దయగలవారు.

అచ్ఛమైన ఋషులాత్మారాములు. అచ్ఛమైన దేవతలు స్వదేవతాత్వ మహిమ విష్ణులు. మానవ సృష్టియందు దయకలిగిన ఋషులు వేదోపనిషత్ స్మృతి పురాణాదులను నిర్మించిరి. నిర్మింతురు. మానవ జీవితమునందు సుఖమును సంపాదించుటకు ప్రయత్నములు చేయుదురు. అట్లే మానవులందు దయ కలిగిన దేవతలు తాము దయ చూపించదలచిన స్థలమునందు మానవాతీతమైన తమ శక్తుల నుపయోగించి, మానవాలభ్యమైన విషయములు మానవలభ్యములగునట్లుగాచేసి, మానవుల నాశ్చర్య చకితులుగా చేయుదురు. ఈ మహాప్రకృతి యున్నది. దీని పేరు నియతి. దీనియందొక నియమము నిష్ఠమై యున్నది. అది గణితశాస్త్రము వంటిది. రెండును రెండును కలిసిన నాలుగేయగును. ఐదుకానేకాదు. అట్లే కారణము కార్యము. కారణౌచిత్యమును బట్టి కార్యౌచిత్యము. సముద్రములో పల్లెకారులు సంవత్సరము పొడుగునను వేసికొనిన వలను పాతికమంది పడవమీద పోయి దానిని సముద్రము నందు పఱచి కొన్నాళ్ళయిన తరువాత చచ్చిచెడి చేయంగల విన్నపములైన దానిని లాగి పది పడవలకు పట్టినన్ని చేపలను లాగ కల్గుట నియమము. అదియొక నియతి. అర్ధ రాత్రమునందొక యామ మాత్రమున పొంగిన నదిలో నైదారు పడవలు పట్టు చేపలను వేయిమందియైనను సరే పోయి పట్టకల్గుట నియమము కాదు. అది నియతికాదు. అనగా సృష్టిలో నట్లు జరుగదు. అట్లు జరుగుటకు మానవాతీతమైన యొక శక్తి కావలయును. సృష్టికిమించిన యొక ధర్మము సృష్టికి మించిన యొక నియమము, నియమము కాని యొక నియమ మాచరణలోనికి రావలయును. దానిపేరు దేవతాశక్తి. సర్వ సృష్టిలోని నియమములు, సామాన్యముగా మానవ బుద్ధికి తెలియును. తద్దేశగత తత్కాలగత తత్పదార్థగత నియమములు తత్రత్యులకు నిస్సంశయముగా తెలియును. ఆ తెలివిడికి మించిన పని జరిగినచో దృశ్యమాన మగుచున్నచో నది మానవశక్తి కాదు. సృష్టి యొక్క ధర్మము కాదు. సృష్టిలోని నియమము కాదు. పంచభూతములు వానిదారినవి ప్రవర్తించుచున్నవి. వానియందొక నియతి పరినిష్ఠితమై యున్నది. దానికి మించినది దేవతాశక్తి.

అందుచేత రణరంభ మానవ స్త్రీవలె కనిపించుచున్నను దేవతామూర్తిగాని పట్టి మానవురాలు కాదు. ఈ సంగతిని సేనానులు మఱియు గొందరితరాధికారులు పోయి రణాదిత్యునితో చెప్పిరి. ఒక సృష్టి నియతికి బాహిర మైన విషయము జరిగినపుడు దానిని గూర్చి భావించువారు సామాన్యముగా ముప్పిధములుగా నుందురు. మొదటివారు దేవతామహిమయని వెంటనే యంగీకరింతురు. రెండవవారు లౌకికములైన కారణము లను సన్నిధానపరచుటకు యత్నించి, వారి యత్నము ఫలవంతము కాకపోయినను తాము కల్పించికొనిన సమాధానము నందు విశ్వాసముతో పండితమ్మన్యులై ప్రవర్తిం తురు. మూడవవారు దానిని పట్టించికొనరు. "మనకెందుకులే" యందురు. కొంత వెక్కిరింతురు. దానిని నమ్మరు. ప్రత్యక్షముగా చూచి నమ్మరు. వారి వివేక మెట్టిదనగా "ఇది అహేతుకముగా కనిపించుచున్నదికదా! దీనియందేదో హేతుకల్పనయైన చేయ వలయును" అన్న ఊహ పొంతకు కూడబోరు. అజ్ఞులు మూడుచోట్ల నుందురు. ఒకచోటు మాత్సర్యము. రెండవచోటు రాజా. మూడవచోటు అబోధోపహతత్వము. రణాదిత్యుడు రెండవచోటు. కాని యాయన సేనానులు చెప్పిన మాటను వినెను. కనులు పెద్దవి చేసెను. ఆలోచనానిమగ్నుడైనట్లు కనిపించెను. ఆమె దేవతయనుటకు తనకు వాలుకరాలేదు. భార్యయని తక్కువ పఱచుటకు గుండెచాలలేదు.

# తృతీయాధ్యాయము

## 1

రణాదిత్యుడు, రణరంభ వెంటనుండగా చూచిన పిల్ల, రణరంభయొక్క మహారాజ్ఞి భోగార్హమైన పటకుటీరములో నేడ్చుచు కూర్చుండెను. ఏడ్చుటయనగా బిగ్గరగా గొంతెత్తి యేడ్చుటకాదు. రాజకుటుంబములో నట్టిది యలవాటు లేదు. రాజకుటుంబములలో నేడువరు. వారికి సహజముగా కోపము వచ్చును. దాసదాసీలమీద కోపింతురు. ఏడుపనునది పసితనములో పిల్లలు చేయుదురు. వారికేదో కావలయును. అది వెంటనే లభించదు. పిల్లలేడ్తురు. తల్లి వెంటనే పాలీయదు. ఏదో పనిమీద నుండును. తల్లి వచ్చెడిలోపుగా నేడ్తురు. రెండు మూడేండ్లు వచ్చువరకు వారు చిన్నచిన్నవి కోరుదురు. అవి లభ్యములుకావు. వానికొరకేడ్తురు. తల్లులు బుజ్జగింతురు. లాలింతురు. వారు కోరిన వానికి ప్రత్యామ్నాయ మఱియేదో యిత్తురు. పిల్లలు వానిని త్రోసివేయుదురు. ఏడ్తురు. ఈ రీతిగా సామాన్య సంసారములయందు పిల్లల కేడుపలవాటుగాన, ఆ ఏడుపే పెద్దయైన తరువాత కూడ నేడ్చుచుందురు. బంధువియోగము వచ్చును. పెద్దవాండ్రేడ్చుచుందురు. పిల్లలా దుఃఖమును చూతురు. ఆ ఏడుపును నేర్చుకొందురు. బిగ్గరగా నేడ్చుట, చేతులు గుంజికొనుట, గగ్గోలుపడుట, కన్నుల వెంట నీరు కారుట - యివి యన్నియు పేద కుటుంబములలో సామాన్య సంసారములలో జరుగును. ధనవంతుల కుటుంబములలో పిల్లలయేడ్పున కంత ప్రసక్తి లేదు. వేళకు పసిపిల్లల యాకలి తీరినచో వారు సగానికి సగమేడువరు. జీవులయందాశ యెట్లుండును? తామెరిగియున్న దానిని, చూచిన దానిని వాంఛించుటగా నుండును. ఎఱుగని దాని నెవ్వరు కోరరు. మోటారుకారు నెఱుగుదురు. అది కావలెనని కోరుదురు. యేనుగును చూతురు. అది కావలెనని కోరుదురు. పిల్లలు మోటారునుగాని, యేనుగునుగాని యెప్పుడును చూడనిచో అది కావలెనని కోరుదురా? కోరరు. సామాన్యుల పిల్లలు వీధుల వెంటగాని, తమ వాకిళ్ళలో నెవ్వరో వచ్చినప్పుడుగాని మోటారును జూతురు. అది కావలెనని యేడ్తురు. వారికి మోటారున్నది. ఆపిల్లలు పోయి దానిలో నెక్కుదురు. అది కావలెనని కోరుట యెట్లు? యేడ్చుట యెట్లు? దృశ్య మానములైన వస్తువులన్నియు లభ్యమానములగుచుండగా దుఃఖమేమున్నది? దృశ్యమానములుకాని వాని గుఱించి కోరికయే లేదు. ఇది లోకముయొక్క లక్షణము. కనుక మహారాజా పిల్లలు దుఃఖము నెరుగరు. యేడువరు? కాని యేడుపనునది జీవియొక్క లక్షణము. శరీరమునకేదో బాధ కలుగును, యేడ్పు వచ్చును. రాచబిడ్డలకు శరీరమునకు బాధ కలుగువా? కలుగదు. బయటనుండి బాధ కలుగదు. ఆంతరమైన బాధ కలుగవచ్చును. ఎంత పోషణగల శరీరమైనను లోన నేదో వ్యాధి యుదయింపవచ్చును. రాచబిడ్డయని కడుపునొప్పి వచ్చుట మానివేయును-చెవిలో పోటురాకుండా మానునా? వెన్నులో బాధ, మరి శరీరమున నెచ్చటనో బాధ నిష్పందేహముగా కలుగును. అపుడు ఏడ్పు వచ్చును. బాధ వెంట దుఃఖము కలుగును. ఆ బాధ శారీరకము కావచ్చును. మానసికము కావచ్చును. ధనవంతులయొక్క

శారీరకములైన బాధలు సులభముగా తొలగింప బడవచ్చును. మానసికములైన బాధ లున్నవి. అవి ఎట్లు పరిహృతములగును? వారికి మానసికములైన బాధ లెట్లుండును? మానసికమైన బాధ యనగా దేనినో వాంఛించుట, యది లభ్యము కాకపోవుట.యనగా, వాంఛించినది లభ్యము కాక పోవుట లేనేలేదు కదా! బాధ యెట్లనగా వాంఛించినది ధనముచేత లభ్యమైన వస్తువైనచో నది సులభముగా లభించును. అపుడు బాధలేదు. కాని వాంఛ చాల విలక్షణమైనది. వాంఛకొక యౌచిత్యమున్నది. ఆ యౌచిత్యము వాడు జన్మించిన కుటుంబము, వానికిగల సంపద, వానికిగల మర్యాద, వానికి గల యధికారము మొదలైనవాని పరిధులలో నున్నచో నా వాంఛకు పరిపూర్తి కలదు. ఎగుళ్ళు దిగుళ్ళున్నచో ఆ వాంఛకు పరిపూర్తి లేదు. ఒకరాజాగారి కూతుతో నాడుకొనుటకు పొరుగువారి పిల్ల వచ్చు చుండును. ఆపొరుగువారుకూడ ధనవంతులైనను వారికి రాజకుటుంబమునకు గల మర్యాద యుండదు కదా! ఈ రాచకూతురు వారి యింటికి పోయి యాడుకొందుననును. తమ కూతురు వారి యింటికి పోవుట వీరికి మర్యాద కాదు. పిల్లను వెళ్ళనీయరు. పిల్ల మనస్సు బాధపడినదన్నట్లే గదా! జీవులలోననే స్వభావ భేదము లనంతములుగా నుండును. ఓరినాయనా! ఓసి తల్లీ ! మనము గొప్ప వారము. వారి యింటికి పోవుట మనకు మర్యాద తక్కువ కనుక నీవా విషయములో నేడువవద్దు అని పిల్లలతో చెప్పుదురు. ఆ పిల్లల జీవలక్షణములలో రజోగుణ మెక్కువ పాలున్నచో నీ మాటలు వారికి నచ్చును. నచ్చుటయే కాదు. వారిలో నొక రాచఠీవి బయలుదేరును. అదివరకే నంకురితమై యున్నచో నేడు ద్విదళమగును. కొందరి జీవలక్షణములో రాజసము పాలెక్కువ యుండదు. అధికముగా సత్త్వమే యుండును. అంతేకాదు. కొందరు పిల్లలలో విచారణా లక్షణ ముండును. "మనమెందుకు వెళ్ళకూడదు. మర్యాదయనగా నేమి? వారు మన యింటికి వచ్చుటలేదా?" ఇత్యాది ప్రశ్నలు కొందరు పిల్లలు వేయుదురు. అచట దుఃఖము ప్రారంభమగుచున్నది. బాల్యము గడచినది. యౌవన మారంభించుచున్నది. ఇది మానవ సృష్టిలో గడ్డు సమస్య. అంతవరకున్న కోరికలన్నియు లోకములందలి వస్తువులను చూచుటయు, వానిని వాంఛించుటయు వరకే. యౌవనోదయ మగుటతోడనే దృశ్యమానము కాని వస్తువునందు అంతరాంతరమున నుండి యొక కోరిక బయలుదేరుచున్నది. లోకములో స్త్రీ పురుష ప్రవృత్తి సామాన్యులందరికి దృశ్యమాన మగుచునే యున్నది. సహజమయిన యూహ చేత యౌవనోదయ మైనంతనే, ఒక్కొకపుడు యౌవనోదయము కాకమునుపే ఈ వ్యవహారము కరతలామలకమై పురుషులకు స్త్రీ వాంఛ, స్త్రీ కి పురుష వాంఛ కలుగుటలో నబ్బురము లేదు. సంఘములు కలుషితములై కలుగకపోవుటలోననే యబ్బురముండును. అచ్చమై సంప్రదాయ రమణీయమైన రాజాంతఃపురములందు బాల బాలికల కిట్టియూహలు కలుగుట కష్టము. "అచ్చమై సంప్రదాయ రమణీయమై" యన్న రెండు విశేషణములను వేయుట యెందులకనగా సామాన్యముగా రాజవంశముల యందు కూడ దుర్నీతి ప్రబలియుండును. ధూర్తులైన సేవకులు, పరిచయాధిక్యతగల సేవకులు, ధనసంపాదనా సక్తులైన సేవకులు రాచకొడుకులకు ప్రధానముగా దుర్వ్యసనముల నలవరుతురు. రాచ కూతుండ్రలో నిది తక్కువయైనను దాసీజనము వలన నచ్చుటకూడ లేదని చెప్పుటకు వీలుండదు. కాని ఆ బాలిక పెరిగిన రాజవంశము స్వచ్ఛమైన రాజవంశము. అచట నిట్టి దుష్టములైన సంస్కారములు కలుగుటకు

పీలులేదు. ఆమెకు యౌవనోదయమైనది. ఆమెకు తెలియకుండ మనసులో నేదో వాంఛ యుద్భవించినది. ఆ వాంఛ నిదమిత్థమని యామెకే తెలియదు. మఱియు మానవ జన్మ ఎత్తినంతనే శరీరము కలిగినంతనే యొక లక్షణమున్నది. కాలు సేతులు కలవు. శిరస్సు కలదు. మొగము కలదు. పరున్నప్పుడు చేయి తల్లిమీదనో దాదిమీదనో వేయుదురు. మొగము మొగమునకానింతురు. చేతితోపాటు కాలుకూడ వేయుదురు. పండుకొన్నప్పుడు కాలుసేతులు ప్రక్కకు చాచుట శరీరముయొక్క స్వభావము. అది దేహము యొక్క పాటునకు సులువు. అందొక సూక్ష్మమైన సౌఖ్యమనుభూతమగు చున్నది. తలక్రింద దిండు నుంత సుఖము నిచ్చినట్లు యొత్తిగిలి పండుకొన్నప్పుడొక కాలు సరిగా ప్రక్కకాని యుండును. రెండవ కాలు సెజ్జమీద నానదు. అచట నొక యెత్తుండినచో తలక్రింద దిండువలె నిది యొక సుఖము నిచ్చును. ఎతావతా చెప్పున దేమనగా శరీరగతమై తదవయవ విన్యాసహేతుకమై శరీర నిర్మితిలోననే ప్రక్క నింకొక శరీరముండుట సహజవాంఛితమై యున్నది. వాంఛాంతర్భూత సహజతమై యున్నది. యౌవనోదయాత్పూర్వము యిది సహజత్వము. యౌవనోదయా నంతరము యీ సహజత్వము అన్యాపేక్షముగా భాసించును. శరీరమునందీ సహజత్వము దానికోసమే సృష్టింపబడినదేమో? ఇది యౌవనోదయవేళా వికారము. ఆ బాలికపేరు అమృతప్రభ.

జీవుని యందు వాంఛ యుండును. ఆ వాంఛ ఎట్టిదో జీవునకు తెలియదు. వాంఛానుకూలమైన వస్తుదర్శనమైనప్పుడు గాని యా వాంఛ మూర్తి కట్టదు. ఆవాంఛకు రూపమేర్పడదు. "ఓహో! యిన్నాళ్ళు నాలో తెలియకుండనున్నది యిది కాబోలు" ననిపించును. విచారణశీలురకట్లనిపించును. విచారణశీలురు కానివారికి వెఱ్ఱులెక్కును. పాపము వారు దానిని తెలిసికొనలేరు. తద్దర్శనమువలన వారు బాధ నెక్కువగా ననుభవించుచుందురు. అది యిదమిత్థమని వారికి తెలియదు. తెలిసినవారు బోధించెడి వరకు వారి కవగతము గాదు. ఎవరైన చెప్పినచో నొకవేళ నది కాదనికూడ వారు వాదింతురు. తత్ప్రాప్త్యనంతరమున గాని తద్బాధాపనోదనము జరిగిన తరువాతగాని వారికివాని యందలి హేతుహేతు మద్భావము గోచరించదు. వాంఛలో కాలుష్యము లేదు. అధర్మముండవచ్చును. భావనామయ ప్రపంచకమున నధర్మము, కాలుష్యము, కాలుష్య మాలిన్యాది శబ్దములు కొన్ని కొన్నిచోట్ల గౌణప్రయోగములు. అధర్మమును కాలుష్యమందుము, పంకమందుము. పంకమనగా నిజముగా బురద. దానిని పాపార్థమునగూడ వాడుదుము. ఈ రీతిగా యచ్ఛమయిన ప్రకృతిగల స్త్రీపురుషులకు యౌవనోదయమైనంతనే యొక పురుషునితోడనో యొక స్త్రీతోడనో సంయోగము కలుగవలెనన్న, వారికి తెలియని వాంఛ బయలుదేరును. అందరి శరీరములు మలమాంసాది భూయిష్ఠములే. కాని యెవ్వరును తమకు తాము శుభ్రస్నాతు-శుభ్రపరిధానులునై తమ శరీరగత మాలిన్య భావన చేయరు. అది శరీరగత ధర్మముగా భావింతురు. పరులను గూర్చి విచారించునపుడు వారి శరీరములయొక్క యేతాదృశనిర్మితి పరిగణింపబడును. సామాన్యముగా చెప్పినచో ప్రతివాడును చీదును. అంబూకృతి చేయును. ఇది పరులు చేసినపుడు వీని కసహ్యము వేయును. అట్లే రాచబిడ్డల విషయమున సామాన్యములయందు కంటె పరశరీరస్పర్శ సహింపరానిదిగా నుండును. తమ బంధువులు తమ్ము తాకుదురు. పరిచారికాపరిచారకులు స్పృశింతురు. అది యలవాటై నిత్యధర్మమై యది పరస్పర్శగా కనిపించదు. వీరు కానివారితో స్పర్శ పరస్పర్శ. మానవునిలక్షణ మెంత విలక్షణమైనది. అట్టి రాచకూతుంర విషయములో

యౌవనోదయ మేమిచేయుచున్నది? ఇన్ని యడ్డంకులుగల పరపురుషస్పర్శను వాంఛించుచున్నది. ఈ వాంఛ తత్పురుషాపేక్షకము. వరుసవెంబడి చెప్పినచో తన తీవిని తన దర్పమును పరిత్యజింపవలయును. పరస్పర్శాసహనమును విడవవలయును. తనెన్న డెరుగని దైన్యము తన్నావహించుచున్నది. మున్నెరుగని దుఃఖభావము కలుగుచున్నది. అననుభూత పూర్వమైన రోదనధ్వని కంఠమునందు సముద్భవించుచున్నది.

అమృతప్రభ యేడ్చుచున్నదనగా నిట్టిపరిస్థితులలో సమన్వయము జరుగవలయును. పరిచారికలు పోయి రణరంభతో నామెస్థితిని చెప్పిరి. రణరంభ యామెను తీసుకొని వచ్చుచున్నప్పుడే యమృతప్రభతో నిమేషార్ధమునుకూడ నామెనెడబాసియుండనని వాగ్దానముచేసి తీసికొనివచ్చినది. ఎడబాసి యుండకుండుట యన్నమాటకు సామాన్యకుటుంబములలోని యర్థము వేరు. రాచకుటుంబములలోని యర్థము వేరు. సామాన్యకుటుంబములలో గృహవసతులు తక్కువ, నల్గురైదుగురు కలిసి యొకచోటనే నిద్రింతురు. రాచకుటుంబములలో నట్లుకాదు. ఎవరి నిద్రాశాల వారిదే. ఒక్కొక్కరిగది సామాన్యుల యిల్లంత యుండవచ్చును. అచ్చట నేమి జరిగినదో రెండవగదిలోనికి తెలియువేళకే కొంతవేళపట్టును. మ్లేచ్ఛులలో కొన్ని దేశములలో నొకకుటుంబములో నల్గురున్నచో నెవరు నిద్రించుగది వారిదే. రొహావధలు జరుగుచుండును. తక్కిన వారికి తెలియదు. కాని పరిశుభ్రత దృష్ట్యా యది మంచిదే. సాంఘికమైన యొక లక్షణముచేత సన్నిహితత్వమందలి భద్రతాగుణ సంపాదనచేత నది మంచిదికాదు. ఎవరియాచారము వారిది. అమృతప్రభను నిముస మెడబాసి యుండ ననగా నిచ్చలు తనకన్నులయెదుటనే నుంచికొందునని యర్థము కాదు. సామాన్య కుటుంబములలో నది యర్థము. నిచ్చట ననగా శరీరధర్మములను భావించినచో దానికర్థము లేదు. మనుష్య సాధ్యమైనంత శరీరధర్మ నిర్వహణ యోగ్యమైనంతకాలము జాగ్రత్తవహింతునని యర్థము. అమృతప్రభకు వేరె గుడారమున్నది. ఆ గుడారము రణరంభయొక్క పటకుటీరమునకు దగ్గర. నిముసములో నచటివార్త నిచటికందును, పిలుపందును, యనియర్థము. అమృతప్రభ దుఃఖపడుచున్నదనగా పరిచారికులకు తెలిసినంత సులభముగా తొందరగా రణరంభకు తెలియుట యెట్లు? అమృతప్రభ నామె తల్లి రణరంభవెంట నెందుకు పంపించినది? యౌవనవతియై వివాహయోగ్యమైన బాలికను రాజపత్ని యెవరైన నిట్లు పంపింతురా? తన భర్తకు చెలికాడైన మరొకరాజా కూతురువివాహముకొరకు పదునేనుదినముల క్రింద తమ యింటికి పంపబడెను. ఆ పదునేనుదినములలో నామె తలలో నాలుకవలె మెలగెను. పూసలలో దారమువలె నుండెను. తన కడుపున పుట్టినబిడ్డవలెనే నటించెను. ఆమె మహానుభావురాలు. మహిమవతి. ఆమెయందు దేవతాలక్షణములు కలవు. ఆమె వానిని గ్రహించెను. అయినను పెండ్లి యీడువచ్చిన తనకూతునామె వెంట పంపించుట న్యాయమా? యిది మాయయా?

## 2

"అక్కా! నాకు భయమువేయుచున్నది." "ఎందుకమ్మా! అమ్మగారిని వదలివచ్చితినని దిగులుగా నున్నదా?" "అదికాదు." "వది పొంగివచ్చినది. మనమేమి యగుదుమో యన్న భయమా! నేనున్నానుగదా!" "అదియునుకాదు". "ఆ సైనికు లీ

సైనికులు పోరాడుచున్నారు. కొందరికి గాయములు తగిలినవి కొందరు చనిపోయినారు. మరల నట్లు జరుగునేమో? వారు మనమీదకు వత్తురేమో? మర్యాదోల్లంఘనము చేయుదురేమో యన్న భయమా?" "అదియును కాదు అక్కా! నీ వున్నంతవరకు నాకా భయములేదు. నాకే భయమును లేదు." "మరి భయమువేయుచున్న దంటివికదా! "ఇది నాకు తెలియుటలేదు. లోనుండి గుబులుగా వచ్చుచున్నదా! వచ్చుటలేదు. ఏదైన యాపదసంభవించునని యనుకొనుచుంటినా? నీవుండగా నా కట్టిది సంభవించదని నాకు తెలియును. అక్కా! నీవు మా కోటకు వచ్చిన నిముసమునుండి నీ వన్నచో నాకు ననురాగమైనది. మా యింటికి నొక దేవత వచ్చిన దనిపించినది. అమ్మగారికి నీ వన్నచో చెప్పరానంత మక్కువయైనది. అమ్మకు మక్కువ యెంతయున్నదో గౌరవమంతయున్నది. అక్కగార్లున్నారు. వారికి నీయందుగౌరవమేగాని మక్కువ లేదు. నన్నడిగినచో నీ యందు మక్కువ యెవరికుండును? గౌరవమే యుండును. నీవన్నచో మక్కువయన్నచో నచ్చముగా మక్కువ నాకొక్కర్తుకకే యున్నది. గౌరవము లేదని కాదు. గౌరవమున్నచో మక్కువ నుండి పుట్టిన గౌరవముకాని, దానియంతట యది ఘటిల్లిన గౌరవము కాదు. తక్కినవారికి నీ యందు గౌరవముకలిగి యింటిలో నాడబిడ్డవలె న[illegible]నికనుక మక్కువ కూడ పెంచికొన్నారు. అక్కా! యొక్కటి చెప్పుదునా? మన తండ్రులకెంతయైన స్నేహముండవచ్చును. ఇద్దరును కలసి కాశీ క్షేత్రముననో, నవద్వీపముననో సహాధ్యాయులు కావచ్చును. తరువాత నెన్నియెన్నియో సన్నివేశములచేత నా సౌహార్దము ద్విగుణీతము బహుగుణము కావచ్చును. కాని యందులో నొకాయనకూతురు రెండవయాయన యింటికి పెండ్లి చేసిపెట్టుమని పంపబడినచో, రెండవయాయనకును తగినంత కుటుంబము పెరిగినది. వారిద్దరికి స్నేహముకాని యా కుటుంబమును యీ కుటుంబమును నొకరిమొగ మొక రెరుగరు. స్థూలముగ నొకే ప్రేయోభావ ముండవచ్చును. మానిసులు సన్నికృష్టులైన తరువాత నెవరి యలవాట్లు వారివి. నెవరి యిష్టానిష్టములు వారివి. నెవరిదర్పములు వారివి. వెంటనే ఆదుకొని పొదురని నమ్మకము లేదు. ఒకరిద్దరి నడుమ సౌహార్దము కలుగవచ్చును. ఒకచోట ద్వేషము పెరుగవచ్చును. మఱియొక చోట నిరాదరముండ వచ్చును. ఇంకొకచోట నేమియు లేదు. వట్టి సూన్యభావము. మానవులు మానవులు కలిసినప్పుడు పరస్పర భావము లెట్లుండునో చెప్పలేము. అట్టిస్థితిలో నక్కా! నీ వన్నచో నింటిల్లిపాదికకు నొక మహాగౌరవ మేర్పడినది. గౌరవ మేర్పడుటకేమి? ఆవలివారి ప్రతిభాధిక్యత చేత విద్యాసంపత్తిచేత మరియు నధిక గుణములచేత కలుగవచ్చును. ప్రేమ ఏర్పడుట కష్టము." "సరేనమ్మా! నీవు చెప్పిన దంతయు నిజమే కావచ్చును. నన్ను పూర్తిగా విశ్వసించి వచ్చితివి. నన్ను నీవు విశ్వసించుటయే కాదు. అమ్మగారు కూడ విశ్వసించిరి. నాన్నగారితో నచ్చచెప్పిరి. నిన్ను నావెంట బంపిరి. ఇది రహస్యమనుకొమ్ము. నీవు నా వెంట వచ్చితివని యెవ్వరికిని తెలియదు. నీ వెవ్వరవో కూడ దెలియదు. చోళదేశ పరిచారికలు నీవు కులూతరాజా కూతురవనుకొనుచుండిరి. కులూతదేశ పరిచారికలు చోళరాజా కూతుర వనుకొనుచుండిరి. ఏ కులూతదేశ రాజ పరిచారికలు నిన్నెరుగరో వారిని నీ సేవకై నియోగించితిని. ఇప్పుడు వచ్చిన భయమేమి? నేనుండగా నీ కేమియు భయములేదు. నిన్ను పూవులలో పెట్టి మరల నీ తల్లిదండ్రుల కప్పగింతును." "అక్కా! నా భయము

నాకే విద్దూరముగా నున్నది. ఊరకయే లోనుండి దుఃఖము వచ్చుచున్నది. ఎందుకో తెలియదు. నేను విచారించితిని. కారణము గోచరించలేదు." "ఒక్కటి చెప్పుము. ఇది యెప్పటినుండి ప్రారంభమైనది?" "రాత్రినుండి మొదలు పెట్టి ది. నిద్దురపోవుదమని విశ్చయించితిని. నిద్దురపట్టలేదు. చాలసేపు ప్రయత్నించితిని. నాకు నిదుర రాకపోవుట నే నెరుగను. కనులు మూసికొన్నంతలో నిముస మట్లోయిట్లో నిదురవచ్చును. ఆహార పదార్థములలో నేదైనా ఎగుడు దిగుడు జరిగినదేమో యని విచారించితిని. ఏమియును జరుగలేదు. పరిచారికను పిలచి చెప్పుదమునగా నేమని చెప్పుదును? నిద్దుర పట్టుటలేదని చెప్పుదును. చెప్పినచో నామె నిన్ను నిదురలేపును. నీవు వత్తువు. ఇప్పటికివలెనే నవ్వుదును. నాకు నిద్ర పట్టనిది చాలక నీ నిద్రకూడ భంగపరుపవలయును." "వరదలమీదనున్న నదిని చూచితివి. ఆ సైనికులను చూచితివి. గాయములను చూచితివి. అంత జనమును చూచితివి.ఇట్టి పరిస్థితులు నీ వెన్నడును చూడలేదు. అందుచేత మనస్సు గగ్గోలు పడినది. నాకు తెలిసినంతవరకు యింకొక కారణము కనిపించుట లేదు." "ఇవి కారణములు కావచ్చును. వరదల మీదనున్న నదిని చూచితిని. నా కందముగా నున్నది. మనస్సున కాహ్లాదకారిగా నున్నది. పొంగి ప్రవహించుచున్న నది సంతోషము కలిగించును. భయమును కలిగించునా? అ ప్రవహించుట మన మీదికి ప్రవహించినచో నేమైపోదుమన్న యూహ కలిగినచో భయము సముద్భూతమగును. మనమీదికి ప్రవహించుటకు వీలే లేనప్పుడు అది సంభవమే కానప్పుడు ఆ యూహ యెట్లు వచ్చును? వచ్చినను దానికి బలము లేదు. ఇంక సైనికులు, గాయములు, నెత్తురు చూచితిని. చూచినప్పుడు సుంత వెగటుగా నున్నది. క్రొత్తగా నున్నది. వారందరు నీ సేవకులు. నీ యదుపాజ్ఞలలో నున్నవారు. అంతబాధలో నుండికూడ నీ ప్రత్యక్షమునందు తమ బాధలు ప్రదర్శించుటకు భయపడినవారు. వారిని చూచినచో కొంతజాలి కల్గినది. భయము కలుగలేదు. నేను దీనిని గూర్చి విచారించితిని. అది కారణమేకాదు" "అయినచో నొక్కటియే కారణము కావలయును. మీ బావగారిని నీవు చూచితివా?" "చూచితిని." "ఆయన నిన్ను చూచెనా?" "నాకు తెలియదు." "ఎందుకు తెలియదమ్మా! నిన్నాయన చూచెను కదా! వట్టి చూచుటకాదు. దీర్ఘముగా చూచెను. నేను పరిశీలించితిని. అతడు నిన్ను చూచుటలో నేదో యొక వైలక్షణ్యము లేకపోలేదు. అతడు నిన్ను చూచుచుండగా నీవు కళవళపడితివి. చీర సర్దుకొనుటకు ప్రయత్నించితివి. నీ యుత్తరీయము నీకు తెలియకుండ జారిపోయినది. ఒక లిప్తకాలమున నది జారిపోయినదని కూడ నీకు తెలియలేదు. మరులిప్తలో సర్దుకొనుటకు ప్రయత్నించితివి. సర్దుకొనుట చేతకాలేదు. ఆయనయే కాశ్మీర దేశాధిపతి. ఆయన పేరు రణాదిత్యుడు. ఆయనను పెండ్లిచేసుకొనుటకే నే నంగీకరించితిని."

అంతట నమృతప్రభ మొగమున చేతులిడుకొని నిజముగా నేడ్చెను. రణరంభ యామె నక్కున కత్తుకొని యోదార్చెను. అమృతప్రభ యిట్లనెను: అక్కా! నీవు చెప్పినట్లే జరిగినది. నా కర్థముగుటలేదు. ఆయనను చూచి నేనెందుకు నివ్వెరపోయితిని. ఇది నీ యెడల నేను చేసిన ద్రోహమేమో యన్న భావము యింతకు మున్నే స్ఫురించినది కాని నీవు దగ్గరకు తీసికొని లాలించుటతో నా సందేహము తీరినది. నీ కిది కోపహేతువు కాదు. ఇందులో నీ యెడల నేను చేసిన ద్రోహచింత కాదు. మరల విచారించినచో నీ భర్త నా వంక చూచెను. నేను కళవళపడితిని.

చెప్పరానంత సూక్ష్మమైన కాలములో నా యొడలు నాకు తెలియలేదు. అందుకొరకు నా మీద నీకు కోప మెందుకు రావలయును? అది నీ యెడల నేను చేసిన ద్రోహ మెందుకు కావలయును? అట్టి యూహలు నాలో నెందుకు జనించవలయును?" అనగా రణరంభ నవ్వి యిట్లనెను. "ఓసి చెల్లెలా! నీకు యీ సంగతులు తెలియవు. నీకు వయసు వచ్చినది. వట్టి అమాయకురాలవు. శృంగారరస విషయమున నిన్ను వట్టి ముగ్ధవందురు. ఇంతకంటె సుకుమారమైన ముద్దరాలితనము మరి యెచ్చటను కనిపించదు. నీకీ భయము పోవలయునన్నచో నొక మార్గమున్నది. నీ వాయనను చూచితివి కదా! అప్పుడు కళవళపడితివి కదా! రాత్రి నిద్దుర పట్టనప్పుడు నీ వాయనను గూర్చి భావించితివా?" "నా కాయన యెవ్వరో తెలియదు. నీ విప్పుడు చెప్పగా తెలిసినది. ఆయన యెవ్వరో యనుకొంటిని. కాశ్మీర దేశ ప్రభువని నీ భర్తయని నే ననుకొననుగూడలేదు." "ఇది చాల విచిత్రమైన ఘట్టము. ఓసి చెల్లెలా! నీవు స్త్రీవి. స్త్రీ జన్మ యెత్తితివి. నీకు యౌవనోదయ మైనది. లోకములో పురుషులు స్త్రీలను పెండ్లియాడుదురు. ఒక స్త్రీ యొక పురుషుని ప్రేమించును. ఒకపురుషుడు ఒక స్త్రీని ప్రేమించును. నీ కింతవరకు తెలియునా?" అమృతప్రభ శూన్యదృక్కులతో రణరంభ వంక చూచుచుండెను. రణ: "తెలియదు. భార్యాభర్తలందురు. నాన్నగారును అమ్మగారును కలరు కదా! వారు భార్యాభర్తలు. మీ యక్కగార్లిద్దరకు వివాహములైనవికదా! వారికి భర్తలు వచ్చిరి. ఒక్కటి యడిగెదను. మీ యన్న లిద్దరున్నారు. వారికి వివాహములైనవి. సంబంధములు వచ్చుటయు ఆ పిల్ల నాకు బాగుండలేదనుటయు, ఈ పిల్ల బాగున్నదనుటయు, ఆపిల్లను పెండ్లిచేసికొనుటయు జరిగినదా?" అమృ: "జరిగినది" రణ: ఆపిల్ల ఎందుకు బాగుండలేదు? ఈ పిల్ల యెందుకు బాగున్నది?" అమృ: "అతనికంటె కీమె యందముగా నున్నది." రణ: "అందముగా నున్నచో పెండ్లి చేసికొందురన్నమాట." అని రణరంభ "పెండ్లి యెందుకు చేసికొందురే?" యని కుడిచేతి నడిమివ్రేలి మీద తర్జని నెక్కించి యమృతప్రభయొక్క చెక్కిలి కాచ్చి తర్జనని చెక్కిలిమీదికి విసరి పకాలు[illegible]నవ్వెను. అమృతప్రభకు చెక్కిలిమీద నెఱ్ఱవారెను. కాని కన్నులలో నేదో తెలిసినట్లు కాంతి వెడలెను. అంత రణరంభ "ఓసి చెల్లెలా! రాత్రి పొందినభయమేమి భయము! ఇంకను భయపడెదవు. మరికొన్ని రాత్రులు నీకు నిద్దురపట్టదు. రేపు ప్రొద్దున నిన్ను మరల కలసికొందును. అప్పటికి యీ భయముయొక్క స్వరూపము మరికొంత తేట తెల్లమగును" యని యమృతప్రభను చెలికత్తెల కప్పగించి తాను వెడలిపోయెను. మరునాటి యుదయమున నక్కచెల్లెండ్రు కలిసికొనిరి. రణరంభ "అమృతప్రభా! నీ కీ పాటికి నీ భయముయొక్క స్వరూపము నుంత పాడకట్టి యుండును. నేనొక్కటి చెప్పెదను వినుము. ఇప్పుడు నీ కా భయ మొక్కటియు లేదు. దానికి తోడుగా నింకొక భావ మున్నది. ఆ భావమెట్టిదియో చెప్పుదునా? ఆ రాజును మరల చూడవలెనన్న భావము. ఆ భావ మీ భయమువెనుక నున్నది. దోబూచు లాడుచున్నది." అనగా నమృతప్రభ కన్నులు పెద్దవి చేసి యక్కగారి వంక చూచి "నిజమేనమ్మా ఇది నీ కెట్లు తెలిసినది" అనగా రణరంభ యిట్లనెను. "ఎట్లు తెలిసినదా? స్త్రీ జన్మయెత్తుటతోడనే తెలియును. ఆలోచనతో తెలియును. సర్వజ్ఞత యున్నచో తెలియును. సృష్టిపైన సర్వాధికారమున్నచో తెలియును. సృష్టి నిట్లు చేసినవారికి తెలియును. యౌవన ప్రాదుర్భావవేళా సముత్పన్న చికింకిత

కుట్టమితాదిభావములచేత సంఘుష్టమైన హృదయములు కలవారికి తెలియును. శా స్త్రజ్ఞులకు తెలియును. అన్నింటికిమించి చెల్లెండ్ర మనోభావములు అక్కగార్లకు తెలియవా? ఆ అక్కగా రెట్టియక్కగారు? వట్టి తోడబుట్టినతనము కలది కాదు. అంతరాంతరమునను్న జీవలక్షణసాదృశ్యము గల యక్కగారు. చెల్లెండ్ర మనోభావమును త్రవ్విచూడగల యక్కగారు." అమ్మ: "ఆయన మరల నాకు కనిపించునందువా?" రణ: "ఆయనయు మరల నీవు తనకు కనిపింతువో లేదో యనుకొనుచున్నాడు?" అమ్మ: ఆయనట్లెందుకనుగొనుచున్నాడు, రణ: " మీ రిద్దరు తొలిసారి చూచికొన్నప్పుడు జరిగిన దేమి? ఆయన నిన్ను నిదానించి చూచినాడు. నీవు కళవళ పడితివి. స్త్రీయందు కలవరపడుట ఎట్టిదో, పురుషుని యందు నిదానించి చూచుట యట్టిది. ప్రథమదశలో నిది భేదము. తదనంతరదశలు సమానము. సంయోగవేళయందు భేదముండును. అద్యంతములయందు కించిద్భేదము కలదై, నడిమి భాగము సమానమై ఏ భావము లోకమునందు స్త్రీపురుషులను ప్రేరేపించుచున్నది. నిద్రాహైన్యము, కార్శ్యము, ప్రలాపము, జ్వరము, ఉద్వేగము, ప్రతీక్ష మొదలైన వన్నియు సమానములై నధిక లజ్జ స్త్రీగతమై సంశయాపన్నత పురుషగతమై ప్రవర్తించు నీ వ్యవహారము పేరు "శృంగారరస" మందురు. అది యౌవనోదయము వేళ స్ఫురించును. ఆ పిల్లతన కంటికి నచ్చుట ప్రథమదశలో మొదటి భాగము. ఒక పురుషుని చూచి నీవలెనగుట స్త్రీపక్షమున ప్రథమదశా ప్రథమభాగము" అమ్మ: "అక్కా! నీవు చెప్పినదంతయు నాకు తెలియుచున్నది. తెలియుట లేదు. నీవు చెప్పినదాని తాత్పర్యమేమనగా నే నతనికంటె కందముగా నుంటిని. అతడు నా కెట్లుండెను? ఆయన యందముగా నున్నాడని నే ననుకొనలేదు." రణ: "పురుషుడు సౌందర్యమును వాంఛించును. స్త్రీ వాంఛించునది సౌందర్యమును కాదు. అతనిలోని పుంస్త్వము. ఒక పురుషునిలోని పుంస్త్వము స్త్రీ కభిమతమగును. అది యెట్టిదో ఆ స్త్రీకి తెలియవలయును. భగవంతునకు తెలియవలయును."

# 3

నదులు వరదలమీద వచ్చినపుడు యిది కొట్టికొని వచ్చును. యిది కొట్టుకొనిరాదు అని లేదు. మరియు మహారణ్యములలోనుండి మహాపర్వతములలో నుండి జలము ప్రవాహముగా వచ్చుచున్నచో పులులు అడవిదున్నలు గూడ వచ్చును. అనేక జంతువుల శవములు వచ్చును. పెద్దపెద్ద దూలములు కొట్టుకొనివచ్చును. ఈ రెండు వేలసైన్యము దినముదినము నుభయసంధ్యలయందు చూచుచునే యుందురు. కొందరు నదీకచ్ఛములను వదలిపోవుటయే లేదు. దూరముగా నేదో చూతురు. అది లోభనీయమైనదైనచో ప్రవాహమున కడ్డముపడి యీదుకొనిపోదురు. దానిని తీసికొని వత్తురు. దానిని తాము భద్రముచేసికొందురు. ఎవడు తెచ్చునో యది వాని యాస్తి. పెద్దదూలములు కొట్టుకొనిరాగా కొందరు సైనికులు దాని నొడ్డుజేర్చిరి. వానిమీద తమ గుర్తులు పెట్టుకొనిరి. రేపుప్రొద్దున హఠాత్తుగా వరదలు తీయును. రాజు నదినిదాటుద మనును. వారా దూలమునేమి చేయుదురు ? వెంట తీసికొనిపోదురా? అప్పటికి కాశ్మీరమింకను పదిదినముల ప్రయాణ మున్నది. వారివెంట

శకటములున్నవి. యెడ్లున్నవి. అవియన్నియు రాజుగారి యొక్క సామాగ్రిని మోయుటకే సరిపోవును. తమ దూలములమోయుట కెట్లుపయోగింతురు? పెద్ద పెద్ద తమ దూలములైనచో రెండు బండ్ల క్రింద కట్టితీసికొని పోవలయును. పైన బోలెడన్ని పదార్థములుండును. క్రింద నీ దూలములు. ఎడ్లు లాగవలయునుకదా! కాదయ్యా! ఏనుగులచేత కాశ్మీరము దాక మోయించికొని పొదమన్నచో మావటివాం డ్రంగీకరింపవలయును. అధికారులున్నారు. వారూర కుందురా? సంపాదనచేయు వాడు భవిష్యత్తులో దీని నెట్లు పాలింతుమని జేయడు. సంపాదన చేయుటయే మొదటి ధర్మము. దానిని పాలించెడి మార్గము తరువాత విచారించును. వారి కొక్కటి తెలిసినది. నది తెచ్చుచున్నదికదా యని. నేను తేగల్గుదునుగదా యని. ఒడ్డునకు చేర్చినంత ప్రయోజనములేదు. తా నొక్కడకష్టపడి నదిలోనికి పోయి తెచ్చును. దాని భద్రత కొఱకు, దానిరక్షణ కొఱకు, దానిమీద తనకు కొంత గిట్టుట కొఱకు మరి నల్గురను సహాయపరచుకొనవలయును. ఇది సృష్టిధర్మమువలె గన్పించుచున్నది. కష్టమున తెచ్చినవాడు తాను. తెచ్చెననగా నేమి? నదిలో కొట్టుకొనిపోవు పెద్దదూలమునకు తా నడ్డము కొట్టి దాని సూటిని మరలించెను. అది ప్రవాహము వెంట పోవుచుండగా తానడ్డము తిప్పెను. అట్లు దానిని త్రిప్పుచు కొంతదూరముమేర నొడ్డునకు చేర్చెను. అంతటితో దాని పని యైపోలేదు. దాని ప్రయోజనమున్నచోటికి తీసికొని పోవలయును. ఒక్కడును తీసికొని పోలేడు. బండికావలయును. ఎడ్లు కావలయును. ఇట్లు పదిపండెండ్రు దశలమీదగాని ఆ దూలమును పొత్తుగా సమార్చికొనుటకు వీలులేదు. ప్రతిదశయందు నొక మనుష్యుడు. అందరుభాగస్వాములు. అందుచేత [illegible] దున్నితిని. పండించితినన్న ప్రయోజన మే మున్నది? పండించి నెత్తిన పోసికొనునా? పండించిన వన్నియు తాను నోట క్రుక్కుకొనునా? ఒక పోళసైనికుడు పదిదూలములు నొడ్డుకు పట్టించెను. వానినేమి చేయవలయునో తెలియలేదు. ఆ విద్య వానికి చేతనగును. దూలములు యొడ్డునకు వచ్చినవి. వానిని తన వెంట తీసికొనిపోవుటకు యితర సైనికులు నెవ్వరు నుత్సాహపడలేదు. ఆ పోళసైనికుడిట్లూహించెను: "ఈ కలప నేనెట్లును తీసికొని పోలేను. ప్రక్క నొక్కటియే పల్లె యూరున్నది. వారిచ్చటనుండి లేచిపోయిరి. ఈ కలప యంతయు వారికి దానము చేసినచో వారు గృహనిర్మాణములు చేసికొందురు. వారందరకు నిండ్లున్నవి. ఊరిలో నొక్క దేవాలయమును నిర్మించినచో నీ కలప వాని కీయవచ్చును. దేవాలయములు శిలలతో నిర్మింతురు. దారు నిర్మాణము చేయరు. ప్రధానముగా దేవాలయము శిలానిర్మాణమైనను ధ్వజస్తంభము దారుమయమగును. రెండుమూడు [illegible] దారువులతో నిర్మించవచ్చును. ఒకటియో రెండో శివాలయములు నిర్మించినచో నీ పది దూలములను వారికిత్తును." ఇది యతని యూహ. నది పొంగి వరదలు కట్టెను. తమ రాజకూతురును కాశ్మీరరాజు పెండ్లిచేసికొనెను. పెండ్లివారు కాశ్మీరమునకు తరలిపోవుచుండిరి. దారిలో ఈ నది వచ్చెను. వరదలు వచ్చెను. పెద్దపెద్ద చెట్లు కొట్టుకొని వచ్చెను. వాని మహాస్కంధములను తా నొడ్డునకు పట్టించెను. దీనిని-దూలముల కొరకు వీడా దూలములను తీసికొనిపోలేడు. కనుక నిచ్చట నెవ్వరో శివాలయముల నిర్మించవలయునా? ఏమి యూహ. కాని మానవులు కొందరు విచారణశీలురు. కొందరు మూఢవిశ్వాసములు కలవారు. విచారణశీలురకు వ్యవహారము తెలిసివచ్చును. వారి విచారణమంతయు సమాసన్నముగా నుండును. దాని పేరే

విచారము. మూఢవిశ్వాసముకలవారికి వ్యవహారదశాపరిపాక లక్షణము లుండవు. వారికి వారుకోరినవి హఠాత్తుగా సిద్ధించుట యుండును. ఎందుకు సిద్ధించునో యెట్లు సిద్ధించునో తెలియదు. ఇట్లుండగా నానాటి మధ్యాహ్నమున నదిలో నొకటి కొట్టుకొని వచ్చుచుండెను. అది యేమియనగా నొకచిన్న మట్టి తెప్ప. మొలచిన గడ్డిచేత గడ్డివ్రేళ్ళు క్రింద నల్లుకొని మట్టిపెళ్ళ విడిపోలేదు. ఇంతటి జలసంసర్గము చేత మట్టిపెళ్ళ తడిసి విడిలిపోయి యుండవచ్చును. కాని యా మృత్తు శిలామయమువలె నున్నది. ఈ మట్టిపెళ్ళమీద నల్లని నొక శివలింగమున్నది. ఆ శివలింగమును చుట్టుకొని నల్లని యొక త్రాచు పడగవిప్పి యాడుచున్నది. ఇది యంతయు నదిలో కొట్టుకొనివచ్చుచున్నది. జనము చూచిరి. ఏమి చేయవలయును? దాని నొడ్డునకు తెచ్చినచో నది ఘనమగునా? ఇన్ని దారువుల నొడ్డునకు పట్టించినవాడు శివాలయ నిర్మాణభావన చేసినవాడు పోయి నొడ్డునకు దీసికొని వచ్చును. వీడు శివాలయ భావన చేసెనని వారి కెవ్వరికి తెలియదు కాని సాహసము చేసి తీవ్రమైన నదీ తరంగములలో నీది దారువుల నొడ్డునకు పట్టించిన సామర్థ్యము కలవాడు కనుక వానిని పోయి శివలింగము నొడ్డునకు పట్టించుమని యడిగిరి. వట్టి శివలింగమైనచో వాడు పోయెడివాడే. ఆ శివలింగమును చుట్టుకొనయున్న మహాభుజంగము మాట యేమి? వాడు భయపడి తాను పోనన్నాడు. ఆ కొట్టుకొనివచ్చిన శివలింగమెనను ప్రవాహము లోబడి వెళ్ళిపోయినచో వీరి విచారణ వీరివిచారణయే. దాని "నదీనాం సాగరోగతి" త్వము దానిది. అట్లుకాక నది యొక పెద్ద వృక్షశాఖలో తగుల్కొన్నది. ఆ శాఖ నదీగర్భమున యే రాతికి పట్టినదో యే తుప్పకుపట్టినదో కదలలేదు. ఈ మట్టిపెళ్ళ ఈ శివలింగము ఈ మహాసర్పము తద్వృక్షశాఖా ప్రతిబంధకముగా నిలచినవి కాని దానిలో తగుల్కొనలేదు. ఇది పెద్ద విడ్డూరమైనది. జనమందరు ప్రోవులుపడి చూచుచుండిరి. ఈ వార్త రణాదిత్యునకు చేరెను. రాజు చూచుటకు వచ్చెను. ఒకనది ప్రవహించినప్పుడు నడిమిపాయ దూరముగా నుండును. అచట మహాగాధముగా నుండును. పొంగివచ్చిన జలములు లోతుతక్కువయై తార్యములుగా నుండును. నడిమిపాయ యెక్కువప్పుడు దూరముగా నుండును. ఒక్కొక్కప్పుడే యొడ్డును బట్టియే యుండును. ఇచట నట్లున్నది. పొంగిననీరు దూరముగా నున్నది. అగాధమైన జలము స్కంధావారమునకు సన్నిహితముగా నున్నది. తత్సర్పశివలింగఘటిత శిలాయమమృత్ఖండము దూరముగా నున్నది. అచట పల్లము తక్కువకనుక నిది యే తుప్పకో పట్టి నిలచినది. అచటికి పోవలయుననగా నీ యగాధజలమును తరించవలయును. రాజు శివలింగమును ఒడ్డునకు తెమ్మనెను. రాజాజ్ఞయైన తరువాత ప్రాణములు పోయిననుసరే వెళ్ళవలసినదేగదా! ఈ చోళసైనికుడిదివరకు దారువులను తెచ్చెనుగదా ! భారము వీనిపై బడినది. వానికి ప్రాణములు కొట్టుకొనుచున్నవి. వాడు పోననెను. వానిని రాజువద్దకు తెచ్చిరి. వాడేమి మాటాడుచున్నాడో రాజునకు తెలియలేదు. వాడు చోళభాషలో మాటాడుచున్నాడు. వాడు జన్మచేత పల్లెకారి. సైన్యములో చేరినాడు. మొదట నావికాదళములోని వాడు. చోళదేశములో కొందరు నావికాదళములోని వారలను సైన్యములోనికి చేర్తురు. కొందరు సైనికులను నావికాదళములోనికి చేర్తురు. వారి సాయమున నచట నిచట కొన్నికొన్ని ప్రయోజనములు సాధించ బడవలయును. చోళరాజ్యము పెద్దది. వారిసైన్యములు పెద్దవి.

అందుచేత వానిభాష పట్టి చోళభాషకాదు. పల్లెకారులు వాడెడి భాష, అది సామాన్యభాషకంటె విలక్షణముగా నుండును. వారియాస విలక్షణమైనది. వేరు. వారి శబ్దములే వేరు. వానిభాష విని రణాదిత్యునకు నవ్వువచ్చెను. వాడు చెప్పునది చోళభాషవచ్చినవారికి గూడ తెలియుటలేదు. ఏ భాషయైనను భిన్నభిన్న ప్రాంతములయందు సంఘములో భిన్నభిన్న తరగతులలో భిన్నభిన్నముగా నుండును రాజా రణరంభకు వర్తమానమంపెను. ఈ శివలింగ కథ యామెకును చెప్పిరి. ఆమెయు నమృతప్రభయు రాజా చూచుచుండిన ప్రదేశమునకు కొంచెము దూరముగా నుండి చూచుచుండిరి. రణరంభను రాజా పిలువగా సైనికులు రణరంభాపటకుటీరము కడకు పోయి చూడగా యామె యచ్చటలేకుండుట జూచి నదీతీరమునకు పోయి తీరాచూడగా రాజాగారుయు రాణియు నున్నస్థలములు మిక్కిలి దగ్గరవై జనసమ్మర్దముచేత నొకరికొకరు కనపడకుండుటయే జరిగినదని తెలిసి రాజాగారితో మనవి చేయగా రాజే రణరంభ యున్న స్థలమునకు బోయెను. రణరంభదగ్గర నమృతప్రభ యున్నది. రాజా వచ్చుచుండగనే రాణి రాజను చూచెను. ప్రత్యుత్థానము చేసెను. రాజచ్చట నెవ్వరిని చూడలేదు. అమృతప్రభనే చూచెను. చూచినవాడు చూచినట్లు నిలబడిపోయెను. అమృతప్రభకు మరల రాజదర్శన మయ్యెను. ఆమెయు నట్లే నిస్తబ్ధురాలై నిలచియుండెను. ద్వినిమేషపర్యంతము రణాదిత్యుడు నమృతప్రభయు నిస్తబ్ధులైరి. నిశ్చేతనులైరి. ఒకరినొకరు చూచుకొనుచు యట్లే నిలచియుండిరి. చూచెడివా రందరుకు నీ సంగతి విస్పష్టమయ్యెను. పరిచారికలు చెవులు కొరుకుచుండిరి. రణరంభ కొత్తపెండ్లి కూతురు. ఆమె సముఖమున ఆమె చూచుచుండగా నిట్లు రాజా రణరంభాపరిచారికలలో నొక స్త్రీ వంక నిట్లు నిర్భయముగా లజ్జవిడిచి చూచుట జనులకు నివ్వెరపాటయ్యెను. రణరంభకు కోపమువచ్చు ననుకొనిరి. ఆమె హఠాత్తుగా తత్ప్రదేశము విడి తన పటకుటీరమునకు పోవచ్చును. తన సైన్యమును మరలించి తన పుట్టింటికే పోవచ్చును. భర్త భార్యతో కొన్నాళ్ళు సంసారము చేసిన తరువాత నతడన్యాసక్తుడైనచో భార్య సహించగల్గుట వేరు. మొదటివారము దినములలోననే నిట్లు జరుగుట వేరు. ఆ పరిచారికా సముదాయములలో చాలమంది యమృతప్రభయు నొక పరిచారికయే యనుకొనుచుండిరి. ఆమె రాచకూతురని కొందరికే తెలియును. వారికైనను యామె కులూతరాజ వంశకన్యమో చోళరాజవంశకన్యయో తెలియదు. ఏ రాచకూతురైనను నూతనముగా పెండ్లియైన యీ భార్యాభర్తలనడుమ నిట్లు ప్రవర్తించుటకు సాహసించునా? చోళరాజకుమార్తె యైనచో రణరంభకు స్వయాన చెల్లెలు. కులూతరాజకన్యయైనచో దత్తత వైపున చెల్లెలు. ఏ స్త్రీ తన చెల్లెలిని తన భర్త యిట్లుచూచుట కంగీకరించును? మరియు గ్రొత్తలో నంగీకరించునా? ప్రయాణముగా నత్తవారిం'కి పోవు రాజపడుచు చెల్లెలిని వెంటబెట్టుకొని పోవునా? అది భద్రమా? రాజాలు నూతన ప్రియులు కదా! స్త్రీబ్రతుకు సున్నితము కదా! అరటి యాకు మీద ముల్లుబడినను ముల్లుమీద యరటియాకు పడినను యరటియాకునకే నష్టము.

# చతుర్థాధ్యాయము

## 1

అంత రాణిగారి యాజ్ఞచేత నమృతప్రభ పటకుటీరమునకు కొనిపోబడెను. రాణికి బ్రహ్మాండమైన కోపము వచ్చినట్లుండెను. రాణి ప్రదర్శించుచున్న కోపము కోపముకాదని తెలిసినవారు ముగ్గురే. రాణి, రాజు, అమృతప్రభ. రాణికొక భయము వేసినది. పరిచారకులు, పరిచారికలు తనకు కోపము వచ్చినదనుకొందురు. అమృతప్రభను నేమిచేయుదురో తెలియదు. అందుచేత నామె ప్రధాన పరిచారికను పిలిచి యిట్లు రహస్యముగా చెప్పెను: "ఆమె నా చెల్లెలు. నేను మా తండ్రికి దొరికితిని. ఆమె యాయనగర్భమున జన్మించెను. మా నాయనగారు నాచెల్లెలిని కాశ్మీరరాజున కీయవలెనని తలచినాడు. అందుచేత నాతో పంపించినాడు. నిజానికి రాజుగారి భార్య యామె కాని నేనుకాను. ఆమె నాశ్రయించి నేను వచ్చితిని. అంతఃపురములో నామెయెడ నెవ్వరునిరాదరణముగా దురుసుగా పలుచగా ప్రవర్తింతురో వారి నీ నదీ ప్రవాహమున వదిలిపెట్టెదను" అని చెప్పి యామెను బంపించెను. రాణి పరిచారికతో నేమి చెప్పినదో యెవ్వరికి తెలియదు. అమృతప్రభను కఠినముగా శిక్షింపవలసినదని చెప్పెననుకొనిరి. అమృతప్రభ వెడలిపోయినతరువాత రాజునకు స్మృతి వచ్చెను. రాణి: "ప్రభువులు నా కొరకు వార్త పంపిరట. నేను వత్తమనుకొనుచుండగా తమరే దయచేసిరి." రాజు ప్రక్కనున్న యధికారి వంక చూచెను. ఆ యధికారి యిట్లనెను; "మహాప్రభూ! దూరాననున్న యా సర్పఫణ సమావృత శివలింగమును తీసికొనిరాగలిగిన చోళసైనికుడున్నాడు. వానిభాష మనకు తెలియుటలేదు. రాణిగారికి తెలియును. వాడు దేవిగారితో చెప్పినచో వానిభావము రాజునకు నివేదింపగలరని యనుకొంటిమి. ఇట్లధికారి చెప్పగా నా చోళసైనికుడు రాజ్ఞీసన్నిధానమునకు తేబడెను. సైని: "తల్లీ ! నదివెంట కొట్టికొనిపోవు దూలములను నేను కొన్నింటిని యొడ్డునకు తెచ్చితిని. ఈ ప్రవాహమును చివరిదాక నీదికొనిపోవుట సాధ్యము కాదు. అచటికి చేరినచో నది మహాసర్పము. నన్నేమి చేయునో తెలియదు. ఆ మట్టి పెళ్ళను కొమ్మలోనుండి విడిపరచవలయును. ఆపెళ్ళ ప్రవాహమునబడిపోవును. దూలమైనచో నొకవైపునుండి గోడిగా తన్నినచో నది యడ్డముగా తిరిగి యొడ్డునకు వచ్చుట మొదలు పెట్టును. మరల ప్రవాహమునకు మరలినచో మరల నొక తన్ను తన్నెదను. ఇది యట్టిది కాదు. ఇది గుండ్రని మట్టి పెళ్ళ. చేతులతోడనే పట్టుకొన వలయును. తీసికొని రావలయును. ఏ సమయమున పాము కాటువేయునో తెలియదు. ఒడ్డునకు మరలించుటకు వీలులేదు. ఇది దుర్ఘటమైన కార్యము." రాణి యిట్లన్నది: "ఓయి! ఆ సర్పము తా నెంత శివసేవాపరాయణయో యంతటి ప్రాణభీతి కలిగియుండును. నీ జోలికి రానే రాదు నీ వేమి చేయవలయుననగా కొమ్మలముడిలోనుండి మట్టిపెళ్ళను తప్పించుము. ఆ మట్టిపెళ్ళను నెమ్మదిగా నంచుల యందు యుత్తరీయమునబోసి నీ వీపునకు గట్టికొమ్ము, నీ వీదికొనుచు రమ్ము. ఈ సంగతి సర్పమునకు తెలియనే తెలియదు. అది నీ జోలికే రాదు." సైని: "తల్లీ! చెప్పినంత తేలిక కాదు. విడిపించుట యెట్లు? వీపున కట్టుకొనుట యెట్లు ఈదుట యెట్లు? ఇంతటి ప్రవాహమును నేను

దాటగల్గుదునా?" రాణి: "నేనున్నానుగదా!" సైని: (నవ్వి) "తల్లీ! మీ రున్నారు. అనగా మీ సేవార్థము నన్ను రాజా పంపినాడు. మీ సేవలో నేను చనిపోయినచో రాజసేవలో చనిపోయినట్లు, ఒక ధర్మనిర్వహణమునందు ప్రాణములు వదలిపెట్టి నట్లు. అది యుత్తమలోక ప్రాప్తి హేతువు." రాణి: "నీవుచనిపోవుట మాకు నిష్టము కాదు. మా కా శివలింగము కావలయును. దానితో శివాలయమునిర్మించవలయును. నీవు తెచ్చిన దారువులలో నొకటి ధ్వజస్తంభమగును. తక్కిన దారువులు సేవా గృహనిర్మాణమున కుపయోగించును. నీపేరు చిరుకుట్టి. ఆ దేవాలయమునకు కుట్టిదేవాలయమని పేరు వచ్చును.

అనగా నా సైనికుడు తబ్బిబ్బయ్యెను. ఈమె ఎవ్వరు? రాణియా? దేవతయా? నా మనోభావములీమె కెట్లు తెలియును? మేము వేయిమంది సైన్యము వచ్చితిమి. మా యందరి పేర్లీమెకు తెలియునా? ఈమె యేమి రాణి? కుట్టిదేవాలయమును నిర్మించునా? కాశ్మీరదేశమునందు చోళభాషాశబ్దముతో దేవాలయనిర్మాణము జరుగునా?" అనుకొని అతడిట్లనెను: "అమ్మా! నే నల్పుడను. నా పేర దేవాలయమెందుకు?" అనగా రాణి యిట్లనెను. "ఇచట మూడు దేవాలయములను నిర్మింతుము. అందులో నీ పేర యొకటియుండును. భయములేదు పొమ్ము." అంతట చిరుకుట్టి గంగలో దూకెను. రణరంభ యీ ప్రసంగ సారాంశమంతయు రాజునకు చెప్పెను. సంస్కృతభాషా పరిజ్ఞానము కలిగిన తక్కిన యధికారులు గూడ తెలిసికొనిరి. రాజిట్లనెను: "ఒకటి కుట్టి దేవాలయము. తక్కిన రెంటి పేరేమి?" రాణి: "ఈ నది యింక వారము దినములవరకు తీయదు. అప్పుడు సాహసించి నదిని దాటినను వరదతీసిన పదునేను గవ్యూతులమేర బురద, రొంపి. ఏనుగులు గాని గుఱ్ఱములుగాని నడువలేవు. సైన్యముమాట చెప్పనక్కరలేదు. బండ్లచక్రములు దిగిపోవును. నన్నడిగినచో మరల కులూతదేశమునకు తిరిగిపోయి నెల నాళ్ళయిన తరువాత తిరిగి వచ్చుట మంచిది." రాజా: "నది యడ్డమువచ్చినదని తిరిగి యత్తవారింటికి పోయిన రాజును చూచి తద్దేశ ప్రజలు నవ్వుదురు. బావమరుదులు పరిహసింతురు. స్త్రీ పుట్టింటిమీద మమకారముచేత నట్లు చెప్పునే కాని రాజున కది మార్యదాసహిష్ణువు కాదు." రాణి "రాజేమి చేయును.?" రాజా: " ఇచ్చటనే యొక పట్టణమును నిర్మించును." రాణి: "ఈ దేశము మనది కాదు." రాజా: " ఈ వివాహ మడ్డము వచ్చినదికాని నేను ద్విగ్విజయమునకు బయలుదేరవలయును ననుకొన్నాను. అది యిచ్చటినుండి ప్రారంభింతును" రాణి: "మహారాజా! ఇది యొక పల్లెటూరు. మనకు దెలియక యిందు విడిసితిమి. మన సైనికుల రాక చూచి యీ పల్లీయులు భయపడి పారిపోయి యిచ్చటికి కొంత దూరమున నొక గుట్టమీద చెట్లక్రింద నివసించుచున్నారు. వారి పల్లియను మన మాక్రమించుకొనుటయా?" రాజా: "పట్టణనిర్మాణము జరిగిన తరువాత ప్రధానసౌధములు వారికిత్తము. వారికి తగినంత విత్తము సమకూర్తము." రాణి: "మనము నగర నిర్మాణము చేయువేళకు కొన్ని నెలలు పట్టును. కలవాడు కాలుతీయునప్పటికి లేనివారి ప్రాణములు లేచి పోయినవట. ఆ పల్లీయుల బ్రతుకు కష్టగును." రాజా: "మహారాజ్ఞీ! ఆ పల్లీయులను పిలిపింపుము. వారు మనతో నిచ్చటనే యుందురు. వాస్తుశాస్త్రజ్ఞులు వత్తురు. పట్టణవీధులు, సౌధప్రదేశములు, దొడ్ల ద్రోవలు, వనములు, కాలువలు తీర్తురు. ధాత్రియందు రేఖలు సమకూర్తురు. ఆ పల్లెటూరి వారు తత్పట్టణరేఖాపటమును జూచి యెవరు దేని నెక్కడ

రేపు ప్రొద్దునగాని జరుగుటకు వీలులేదు. ఈ రాత్రి మేము నిరాహారముగా నుండవలయును. రాణి గారికి కూడ తప్పదనుకొనుము." రాణి: "నాకేకాదు. అమృతప్రభకుకూడ తప్పదు." రాజా: అమృత ప్రభ ఎవ్వరు? రాణి:- ఏ బాలికను మొన్న ప్రభువులు చూచి యామెయం దనురాగమును పాదుకొల్పిరో, యే బాలికను నేడు చూచి జగత్తునే విస్మరించిరో ఆ బాలిక" రాజా: "ఆమె పేరు అమృత ప్రభయా?". రాణి: "ఔను." రాజా. "ఆమె యెవ్వరు?" రాణి: "నాకు తెలియదు. ప్రభువు లామెనే యడిగి తెలిసికొనవచ్చును." రాజా: "ఆమె నే డుపవాసముండుట యెందులకు?" రాణి: "మీ యిద్దఱి మనసులు కలసిపోయినవి. ఇద్దఱి జీవితములు కలసిపోవుట కిది ప్రథమ సోపానము. ఆమె భార్యాత్వ పూర్వదశలో నున్నది. ఆమెయు నుపవాసమున్నచో శివానుగ్రహమువలన మీ రిద్దఱు భార్యా భర్తలు కావచ్చును." రాజా: "ఆమె యెవ్వరో తెలియ కుండనెట్లు!" రాణి "తెలియకుండ హృదయములలో నంత దూరము నెందుకు పోయితిరి?

# 2

ఆ పీఠము రాజపటకుటీరములయం దుండవలెనని రాణి, రాణియొక్క పటకుటీరములం దుండవలయునని రాజా. చివరకు రాణి మాటయే గెలిచెను. ఆమె వచ్చినప్పటినుండి చూచుచున్నారుకదా! రాణిమాటయే గెలుచును. రాజాగారి గుడారములందు నొక గుడారమున పూజాదికము జరుపబడు చున్నది. అది యేదో సామాన్యమైన పూజ. రాజా స్నానము చేసి భోజనాత్పూర్వము కొంత పూజాదికమును నిర్వర్తించును. అచ్చట నీ శివలింగమును ప్రవేశపెట్టిరి. చిరుకుట్టికి సైనికోద్యోగమునుండి విరమణనిచ్చిరి. అతడు దేవతాసన్నిధాన వర్తి. అతనియుద్యోగ మేమనగా నా పటకుటీరము ముందు ఖడ్గధారియై నిలుచుండుట. రాజాజ్ఞలేకుండ లోని కెవ్వరును పోవుటకు వీలులేదు. రాజా పోవచ్చును. రాణి పో వచ్చును. పురోహితుడు పోవచ్చును. నాల్గవవారు పోవుటకు వీలులేదు. అచట దేవతాపీఠమును నిర్మించవలసిన మధ్యాహ్న సమయమందు పటకుటీరముయొక్క పై భాగము తీసివేయబడెను. పీఠమును స్థాపించు కర్మకలాప మంతయు జనమందరు చూచిరి. రెండువేలమంది సైనికులు, రెండువందల మంది మావటివాండ్రు, నైదారువందలమంది యాశ్వికులు, కొన్నివందలమంది పరిచారకులు, వేయిమంది పరిచారికలు. వాద్యములు బ్రహ్మాండముగా జరిగెను. సాయంకాలమునకు మరల గుడారము మూయబడెను. రాజాను రాణియు పీఠముల మీద గూర్చుండిరి. చూచుచున్నవారి కొకసందేహము కలిగెను. రాజాప్రక్క కూర్చున్న స్త్రీ రణరంభయేనా? మఱి యెవ్వరైననా? పరిచారికలలో కొందరికి చాల కొద్దిమందికి ప్రక్కకూర్చున్నయామె యమృతప్రభ యనిపించెను. ఆ కొలదిమంది యమృతప్రభ నెరుగుదురు. అమృతప్రభయు రణరంభయు చూచుట కొక్కరీతిగనే యున్నారు. రణరంభ చూచుటకు ఉదాత్తమైన యాకృతిగలస్త్రీ. అమృతప్రభ, యంత యొడ్డు పొడుగు లేదు. సూటిగా నెదురుకుండ చూడకుండ వెనుకనుండియో ప్రక్కనుండియో చూచిన పొరపాటు పడవచ్చును. ప్రక్కకూర్చున్న భార్య సిగ్గుపడ నారంభించెను. ఆమె మొగము రాజానకు సరిగా కనిపించుట లేదు.

వాంఛింతురో వారికి దాని నచ్చట నిత్తము. సరే కాని ఒక దేవాలయము కుట్టి దేవాలయము. తక్కిన రెండు దేవాలయముల పేర్లేమి?" రాణి: "ఆ రెండు పేర్లలో నొకటి చెప్పగల్గుదును. రెండవదానిని చెప్పుటకు ప్రభువులు నాకు కొంత వ్యవధి యీయవలయును. రెండును కలిపిచెప్పుట మంచిదనుకొనుచుంటిని." రాజు: "మేము పోవుచున్నాము. మహారాజ్ఞీ! నడుమ నీ యిక్కట్టుకల్గునని యనుకొనలేదు కదా! పదిదినాలలో కాశ్మీరము చేరుద మనుకొంటిమి. సమస్యలన్ని మిగిలిపోయినవి. ఈ రాత్రి దేవేరిగుడారమునకు మేము వచ్చుట కనుజ్ఞయైనచో తదనుబంధప్రసంగము నిర్వహించవచ్చునని మా కోరిక" రాణి: "ఇచ్చట మనము తేలికగా పదిపదేనుదినములైన యుందుము. ఒక్క యైదుదినములు కడచిన తరువాత ప్రభువులు మా గుడారములకు రావచ్చును. ఇది యంతయు ప్రభువుల స్వాధీనమైనది. రాత్రులందేమి? రాజాగారు దివాసమయములయందు రారాదా? మనము నూత్నదంపతులము కనుక మనకోటలో నైనచో దివాసమయములయందు కలిసికొనుట యవినయలక్షణము కావచ్చును. సుకుమార లజ్జాహేతువు కావచ్చును. ఇది మనకు యథేచ్ఛమైన పాలము. వృద్ధపరిచారికలు లేరు. వృద్ధలైన రాజవంశ స్త్రీలు లేరు. కులంపుపెద్దలు లేరు. మిగిలిన వారుద్యోగులు. ఆజ్ఞా బద్ధులు. భయభీతులు. ప్రభువులు యథేచ్ఛముగా రా వచ్చును." రాజు: "మహారాజ్ఞీ! నా కిది లజ్జాకారణము. సందేహ కారణము. అనుభవదూరమైన విషయమునందు ననుభూత సుఖ విషయమునందువలె ప్రవర్తించుట కఠినయము చేత కావలయును. అభినయమనగా నాట్యములోని భాగము. దేవీ! యాజ్ఞమైనచో నట్లే వత్తును." రాణి: "అయ్యా! ఒక చోట నాశలేదు. ఆశలేనిచోటికి నాశాపరిపూర్తి కలవానివలె పోవుట మీరు చెప్పవట్టిదే. కాని యాశకలచోటికి నాశతో వెళ్ళుటలో తప్పులేదు".

ఇంతలో చిరుకుట్టి సర్పఫణాసమావృత శివ లింగమును తీసికొనివచ్చెను. నిర్భయముగా మట్టిపెళ్ళను యారతిపళ్ళెము వలె చేతితో పట్టుకొని వచ్చెను. జనము మూగిరి. రాణి "ఏమిరా! పాము కరవలేదా?" వాడు: "తల్లీ! ఆ శివలింగము రత్నలింగము. ఆ సర్పము మరకతము. ఈ మట్టిమట్టికాదు. శిల కాదు. శిలయైనచో నీటిలో మునిగిపోయెడిది. మట్టియైనచో కరగిపోయెడిది. ప్రవాహమధ్యమున నా యూహతోచినది."ఈ పాము చేత కరిపించుకొందము. ఇచ్చటనే చనిపోదము. వెంటనే కైలాసమునకు పోదును. ప్రమథగణములలో చేర వచ్చును" అని పామును పట్టుకొంటిని. అది వెనుకకు తిరుగునని కాటువేయునని యెదురుచూచితిని. ఆ పాము చేతికి మెత్తగా లేదు. గట్టిగా యున్నది. రాయివలె నున్నది. అట్లే భయముతీరియు తీరక ఫణాభాగమంతయు స్పృశించితిని. అంతయును రాయియే. అది మరకతము ఇంక భయమేమి యున్నది? మట్టిపెళ్ళ తలమీదపెట్టుకొని యీదికొని వచ్చితిని. ఇంక రాణిగారి దయ." రాజు: "కుట్టి దేవాలయ మిచ్చట నిర్మింతమా? శ్రీనగరమున నిర్మింతమా? రాణి: మూడు దేవాలయములు శ్రీనగరముననే నిర్మింతము" రాజు: "ఈ స్వామి వచ్చినాడు. ప్రవాహములో నున్నంతవరకు పంచభూతములు సేవించినవి. మనదగ్గరకు వచ్చినంతనే స్వామి యూరకుండడు. ఆయనకు ధూప దీప నైవేద్యములు కావలయును. ఒకప్రదేశము కావలయును. సంప్రోక్షణ కావలయును. అంతవరకు నాకపీఠమువలె నుండవలెను. దానికి ప్రతిష్ఠ చేయవలయును." రాణి: "మన పురోహితుడున్నాడుకదా!" రాజు: "ఇది అసుర సంజవేళ. ఆ కార్య కలాప మంతయు

రాజునకే యామె రణరంభయా యింకొకస్త్రీయా యన్న సందేహము కలిగెను. ఆమె యీ పీటలమీదికికూడ ప్రతికృతిని తీసికొనిరాలేదుకదా! కులూతరాజధానినుండి వచ్చునపుడు రణరంభ తనప్రతిమను మందసమునం దమర్చి తెచ్చెనని రాజునకు దెలియును. ఆమెను తనగుడారమ్మునకు రమ్మని రాజు పిలిచెను. ఆమె రాజే తనగుడారమునకు రావలయునని చెప్పెను. అందులోనున్న రహస్యము రాజునకు తెలియును. ఆమె ప్రతిమ రాణిగుడారములో నున్నది. ఆ ప్రతిమను రాజు గుడారమునకు తీసికొనివచ్చుట కష్టము. అట్లైనచో నిప్పుడు పీటలమీది కెట్లు తెచ్చెను? ఆమెను గూర్చిన సంగతులన్నియు నద్భుతములు, నబ్బురములు. మరల రాజునకు పీటలమీద కూర్చున్నది రణరంభయని అమృతప్రభ కొంచెము దూరముగ నున్నదని తెలియును. అమృతప్రభ యుపవాస కృశీభూతాంగియై నిలుచుండెను. ఆమెకన్నులు సుంత లోనికి పోయిన ట్లనిపించెను. అందకత్తెల యందు మెప్పుడైనను లోపించదు. రెండపూటలు భోజనముచేయని యమృత ప్రభాలోచన సౌందర్యము ముబ్బడిగా నుండెను. ఇబ్బడిగా నుండక ముబ్బడిగా నుండుటయేమి? శివధ్యానపరురాలు కనుక శివుడు ముక్కంటికనుక ఇది లోచన విషయము కనుక లోచన సౌందర్యము ముబ్బడి యయ్యెను కాబోలు. ఉత్సవము పూర్తి యయ్యెను. జన మెవ్వరిత్రోవ వారు పోయిరి. ఒక్కవిశేష మేమనగా సదిగవ్వ్యాతలమేర పారిపోయి గుట్టల మీద చెట్లక్రింద నున్న యచ్చటి పల్లీజనమువచ్చి యుత్సవమును చూచిరి. వారికి సుఖమైన భోజనసౌకర్యము కలిగింపబడెను. విత్త మొసంగబడెను. వారివారి యిండ్లు వారి కీయబడినవి. వారు వచ్చి తమయిండ్లలోనే యుండిరి. రాజోద్యోగులు వారిని పోనీయలేదు. వా రదివరకు పేదలు. ఇపుడు వారు సంపన్నగృహస్థులు. రాజసైన్యము వెంట కొన్ని వందల యావులున్నవి. అవి సమృద్ధిగా క్షీరము నిచ్చుచున్నని. ఆ క్షీరము వారియిండ్లకును బోవుచున్నది. ఎచ్చటనుండి వచ్చు చుండెనో కూరలు వచ్చుచుండెను మధుశర్క రాదులు వచ్చుచుండెను. కమ్మనిభోజన మెరుగని యా పల్లీప్రజలు రాజ భోజనమును చేయుచుండిరి. ముదుకగుడ్డలు కట్టెడి యా పల్లీ ప్రజలు వలిపెములు కట్టుచుండిరి. వారికివారికే యాశ్చర్య మయ్యెను. గ్రహచారము మారవలయునుగాని నిన్నటి బిక్షువు నేటి రాజు. వారు కాశ్మీరదేశాధిపతి పెండ్లికి వెళ్ళకపోయినను పెండ్లివారికి జరిగెడు భోగములు వారికి జరుగుచుండెను.

ఆ రాత్రికి రాజు తనతోపాటు రాణిగారుకూడ తన భోజనశాలయందే భుజించవలయు ననెను. రాణి యంగీకరించెను. రాణి యిట్లనెను: "మహారాజా! నా వెంట నమృత ప్రభకూడ వచ్చును." రాజు: "ఆమె ఎవ్వరు?" రాణి: "ఆమెనే యడిగి తెలిసికొనుడు" భోజన మయ్యెను. మూడు కనకపాత్రములు. రాజు రాణి యమృతప్రభ ముగ్గురిపాత్రలు వరుసగా నుండెను. ఈ శివలింగపీఠ నిర్మాణమహోత్సవ సంతోషములో ఉపవాస విరమణవేళావేశములో రాజునకు కొంత విస్మృతి కలిగెను. రణరంభనుగూర్చిన వార్తనంతను విస్మరించెను. ఆమె భార్యయే యనుకొనెను. తాను భోజనము చేయుచు హేలగా తనపాత్రలోనున్న యొక మధుర పదార్థమును రణరంభపాత్రలోనికి విసిరెను. విసరుట జరిగెను. రాజు నకు స్మృతివచ్చెను. ఉత్సవ మంతయు సుఖముగా జరిగెను. ఈ యవివేకపు పనివలన నామెకు కోపమువచ్చునేమో? అచట నిజముగా రణరంభ వచ్చికూర్చుండెను. ప్రతికృతి కాదు. తన యుచ్ఛిష్టము నామె స్పృశించునా? ఒక యను గ్రహముచేత నామె తనయంతట తాను వచ్చి

తనప్రక్క కూర్చుండెను. ఆ మర్యాదను తాను పాలించలేకపోయెను. అతనికి భయమువేసెను. ఈ యూహ యతనిలో కలుగుటకు లిప్తైకదేశము పట్టెను. అతడు విసరెనేకాని విసరిన వెంటనే నీ యూహ వచ్చెను. తల యెత్తనే లేదు. అది యామె కంచములో పడెనో లేదో చూడనేలేదు. అతడింతలో దేరుకొని పర్యాలోచించుచుండగా రణరంభ భోజనముచేయుచునే యుండెను. ఇది యేమి యాశ్చర్యము! అతని చూపు తరువాత కంచము మీదికి పోయెను. సంశయమంతయు నక్కడ కనిపించెను. తానువిసరిన మధురపదార్థకణము మూడవ కంచములో పడెను. అమృతప్రభ యేమి చేయును? ఆమె సిగ్గుచేత తలయెత్తకుండ నారగించుచుండెను. ఆమె కాహారము రుచించుటలేదు. తన యక్కగారి ప్రవర్తన తనకు బాగుగాలేదు. లేదా అంతరాంతరములలో ప్రియముగా నున్నది. తా నుపవాసముండుట యేమి? శివసన్నిధానవర్తిని యగుటయేమి? ఇప్పు డీ భోజనమేమి? శివపూజావేళ తాను పీటలమీద కూర్చుండలేదు. కూర్చున్నట్లు భ్రాంతి. తన కర్థముకాలేదు. పరిచారికాసముదాయము పార్శ్వముననుండగా తానువారిలో నొకర్తుకవెనుక నక్కి యుండెను. ఉన్నదియున్నట్లుగా తాను రాజా ప్రక్క కూర్చున్నట్లు భ్రాంతికలిగెను. ఇది వట్టి యూహ. వట్టియూహకూడ కార్యాచరణమువలె కనిపించునా? మేనునకుమనసునకు నభేద్రప్రతిపత్తిగా బ్రతికెడి యుత్తమజీవుల కట్లుండునేమో? తా నట్టిదా? అమృతప్రభకు లీలగా నా మధురపదార్థకణము రాజా విసరివేసినదవి పాడకట్టెను. అతని యుచ్ఛిష్టము తా నారగించునా? ఆయన యెందుకువేసెను? అక్కగారికి కోపమున్నదా? ఆమె తా నేమియు నెరుగనట్లు భోజనము చేయుచున్నదా? ఇంతకుమించి యొక యబ్బురమైన సంగతి జరిగెను. అమృతప్రభ యేదోవిధముగ తినీతినకుండ తినుచున్నది. కంచమునందలి యొకకణము చేతితోతీసి నోటిలో పెట్టుకొనబోవుచున్నది. ఆ పని యొక యుద్వేగ సమయముగా నున్నది. తాను తీయబోవుకణము రాజావిసరిన మధురపదార్థ మగుట త త్కాలతీవ్రతచేత తా నా కణమును నోటిలో పెట్టికొనుట, నోటిలో నుంచికొనిన తరువాత తెలియుట అంతయు కన్నుమూసి కన్ను తెరచినంతలో జరిగిన దందమా? అనుటకు వీలులేదు. అంత కంటె బహుతక్కువ కాలములో జరిగినది. ఇప్పుడు తననోటిలోనున్న రాజాయొక్క నెంగిలిపదార్థము మ్రింగుటయా? నుమియుటయా? రాజసమక్షమున భోజనము చేయుచు రాజపంక్తిని భోజనముచేయుచు నుమియుటయనగా నది మహాపరాధము, అనాగరకతా లక్షణము. జానపదులు చేసెడిపని. ఆమె యేమి చేయును? తన యక్క త న్నిట్లెందుకు తెచ్చినది? మూడు దినములక్రింద రా[illegible] తన్నుచూడగా నెందుకు కలవరపడినది? నిన్న తా నెంత గగ్గోలుపడినది? దీనికి తన యక్కగారెంత వ్యాఖ్యానము చేసినది. ఆ వ్యాఖ్యానములోని యర్థము తన కెంత సువిదితమైన ట్లున్నది? మొన్నటి తాను నేటి తానా? తాను మొన్న వట్టి యమాయకురాలైన బాలిక. ఊరక చెట్టున పూసిన పూవు. తేటి యన్న యొక జంతువున్నదని, యది తన్ను వాంఛించునని దానియందు తనకు మమకారము కలుగునని యెరుగని పూవు. ఇప్పుడు యా తేటి జంజమ్మని గాలిలో తిరుగుచున్నది. ఆ ధ్వని తన కెంత ప్రియముగానున్నది. కాని యా తేటిని జూచినచో తన కెంతభయముగా నున్నది? అన్నిటికంటె తా నాశ్రయించిన రెమ్మప్రక్కనున్న చివురాకు తనమీద రాలి రక్షించవలసినది- గాలికితాలిగి యా తేటి తనమీదవ్రాలుటకు

పిలిచ్చుచున్నది. తా నున్నచోట నుండి కదలలేదు. ఆ తేట భ్రమణశీలి. అదివచ్చి తనమీద వ్రాలునా? వ్రాలునేమోయన్నభయమా? ఆ భయము వెనుక, వ్రాలవలయు నన్న కోరికయా? ఇది ఎక్కడనైనయున్నదా? తన యక్కగారు తనతో భోజనమునకు రమ్మన్నది. నేను రానవచ్చునే. - అది యేమిటమ్మా? నే నవివాహితను. పితృదత్తను కాను. నీవు నాకు నక్కగారివి. ఆయన నీ భర్త. న న్నిచ్చుటకి భోజనమునకు తీసికొనిపోవుట నీకు న్యాయమా? - యని తాను చెప్పనగా? చెప్పలేదే? చెప్పుటకు తాను భయపడినదే. ఆమె యేమనును? ఆయన నాకు భర్త యైనచో యాయన నిన్ను మూన్నాళ్ళక్రింద చూచినపుడు నీ వెందుకు కళవళపడితివి? నిన్న సాయంకాలమున మీ రిద్దఱొకరినొకరు చూచుకొని యేల విశ్చేష్టులైతిరి? అని యన్నచో నేమి సమాధానము చెప్పవలయును? అందుచేత నోరుమూసికొని వచ్చితిని. అందుచేత నోరుమూసికొని యీ రాజుయొక్క యెంగిలివి తినవలయును." అనుకొని యమృత ప్రభ యా మధురపదార్థమును మ్రింగెను. రాజు చూడలేదనుకొనెను. ఎందుకు చూడలేదు? చూచెను. చూచినచో నేమైనది? ఏమైనది? రేపుప్రొద్దున రాజు తనతో యధేచ్ఛముగా ప్రవర్తింపవచ్చును. తన్ను స్పృశించుటకు గూడ వెనుకాడ నక్కరలేదు. అత డే రహస్యమును చెప్పి యెట్లు ప్రవర్తించినను తాను మారుమాటాడుటకు వీలులేదు. ఆమె కనులలో బాష్పములు నిలచెను.

## 3

"ఇది రాణిగారి గుడారమేనా?" "అవును." రాణి గారు లేరా?" "లేరు. నదీతీరమునకు వెళ్ళిరి." "ని న్నొక్కర్తుకను వదలిపెట్టి పోయిరా?" "ఎవరో పరిచారిక లుండవలయును. వా రెచ్చటికిపోయిరో తెలియదు." "నీవు రాణిగారి గుడారములోనే యుందువా?" "కాదు. నాకు వేరే గుడారమున్నది." "మఱి నిచ్చట నెందుకుంటివి?" "రాణిగారు తాను వచ్చెడివరకు నన్నిందుండు మన్నది" "ఆమె నీ కేమియగును?" "అక్కగా రగును." "ఎటువంటి యక్కగారు?" "ప్రేమగల యక్కగారు. కంటికి రెప్పవలె నన్ను చూచుచున్న యక్కగారు" "అదికాదు నే నడుగునది. ఆమెకు రెండుపుట్టు వున్నవి. నీ వే పుట్టినింటి చెల్లెలవు?"

అమృతప్రభకు రాజుయొక్క గడుసుదనము తన గడుసుదనమును మించినదని తెలిసెను. ఆయన ప్రశ్నలువేయుట తాను సమాధానములు చెప్పుట. తా నెంత ధైర్యవంతురాలనా యనుకొనెను. ఇట్లు ప్రశ్నలకు ప్రతిసమాధానములు చెప్పగలిగిన తాను మూన్నాళ్ళక్రింద నంత కళవళపడుట యెందుకు? మొన్న నంత గగ్గోలుపడుట యెందుకు? అందఱు నున్నప్పుడు లజ్జయా? ఏకాంతముగా నున్నప్పుడు లజ్జ లేదా! అప్పుడు భయమా? ఇప్పుడు లేదా? లేకపోవుటయేమి? భయముగానే యున్నదే! భయ మెందుకు? తన కర్థమగుట లేదే? ఇంతలో రాజునుండి మరల ప్రశ్న యుదయించెను. "నీవు చెల్లెలవు. యెట్టిచెల్లెలివైన నేమి? ఎక్కడి చెల్లెలివైన నేమి? రాజదుహితవు." "అవును." "ని న్నొంటరిగ నీ తల్లి దండ్రు లీమెవెంట నెట్లు పంపించిరి?" "ఒంటరిగా నేమి? మా యక్కగారు తోడున్నదికదా! ఆమె పరిరక్షణ మున్నది కదా!" "ఏమి పరిరక్షణ? నీ విప్పు డొంటరిగా నుంటివి." "ఒంటరిగా నున్న నేమి? ఇది రాణిగారి కుటీరము. రాణిగారి కొక మర్యాదయున్నది. ఆ

205995

శిబిరమునకొక మర్యాదయున్నది. శత్రువులువచ్చి యాక్రమించినప్పుడు రాజాంతఃపురములకు భయమేమోకాని యా దేశపురాజ పరిపాలించుచుండగా యతడు పరాక్రమవంతుడుకాగా నతనిని చూచి శత్రువులు భయపడగా నతని యంతఃపురముల్లో భయ మెట్లుకలుగును? ఏ రాజును తన యంతఃపురముయొక్క మర్యాదను నుల్లంఘించడు." "నా వంటివా డుల్లంఘించవచ్చును." "నాకు భయమువేయుచున్నది. ఈ రాజిట్టివాడని తెలిసినచో మా యక్క యీ రాజును పెండ్లియాడెడిది కాదు" "ఆడినది. ఇప్పుడేమి చేయవలయును. చేతులు కాలినతరువాత నాకుల కొఱకు వెదకి యేమిప్రయోజనము?" "అంతఃపురమర్యాద నుల్లంఘించుటయనగా నేమి?" "ఆమాట నే ననలేదు. నీవేయంటివి. దాని తాత్పర్యము నీవు చెప్పినచో నేను వినవలతును" "ఆమె లేనప్పుడామె యంతఃపురములోనికి వచ్చుటయే మొదటియుల్లంఘన. ఆమె లేదని చెప్పిన తరువాత వెనుకకుతిరిగిపోకుండుట ద్వితీయోల్లంఘన" "తృతీయోల్లంఘన మెట్లుండును?" "అది యుల్లంఘించెడివారికి తెలియవలయును." "నాకు తెలియుటలేదు. ఈ రెండుల్లంఘనములను తెలిసి చేయలేదు. నీవు చెప్పినచో దానినికూడ నుల్లంఘింతును" "రాణిగారు నన్నిచ్చట నుండుమన్నది. ఆమె లేనప్పుడు వేరు వచ్చినను తాను లేనని చెప్పుమన్నది. వారు వెళ్ళిపోదురని యామె యనుకొన్నది. తమ రెవరో వచ్చినారు. మీరు వెళ్ళుట లేదు. నేను మిమ్ము వెళ్ళిపొమ్మని యడుగుచున్నాను. మీరు వెళ్ళనిచో నిది తృతీయోల్లంఘన" "నీవు న న్నెఱుగుదువు, ఎఱుగనట్లు మాటాడుచున్నావు." "నేను మి మ్మెఱుగను." "ఎందు కెఱుగవు? చక్కగా నెఱుగుదువు. మొన్న నా వంక తదేకధ్యానముగ చూచితివి. నావలెనే నిశ్చేష్టురాలవై తివి. శివలింగము పీఠముగా నిర్మించిన నుత్సవసమయమందు నా ప్రక్కకు కూర్చుంటివి. కడచిన రాత్రి నా యుచ్చిష్టము నారగించితివి. నేను కాశ్మీర దేశాధిపతినని తెలియును.నా పేరు రణాదిత్యుడని నీకు తెలియును. న న్నెఱుగనందువు. భార్యవలె నా ప్రక్క గూర్చుంటివి. భార్యవలె నా యెంగిలి భుజించితివి. న న్నెఱుగవా?"

ఆమె ఏమియు మాటాడలేదు.

"ఎఱుగుదువా? ఎఱుగవా?" "అయ్యా! మీ ప్రక్క నేను కూర్చుండలేదు. కూర్చున్నట్లు నాకు భ్రాంతికలిగెను. మీ ఎంగిలి నేను తినవలయునని తినలేదు. మర్యాదోల్లంఘనము జరుగునని తినుట జరిగినది. నేను మొన్న చూచి నిశ్చేష్టురాలనై తిని నిజమే. దానికి చాలకారణములు కలవు. మీరు కాశ్మీరరాజ్యాధిపతులని నాకు తెలియదు. మీవంక నెందుకు చూచితినో నాకు తెలియదు. మా యక్కగారు దానికి వ్యాఖ్యానము చేసినది. ఆమె పండితురాలు ఆమె ముందు మాటాడుటకు మనమెవ్వరము" "నన్నుకూడ కలిపెద వెందులకు? ఆమె ఏమి వ్యాఖ్యానము చేసినది?" "మహారాజా! తమరి నభ్యర్థించుచున్నాను. తమరిప్పుడు వెళ్ళి యామె వచ్చిన తరువాత మరల దయచేయవలయునని ప్రార్థన." "ఆమె యింతలోవచ్చును. ఆమెను ప్రతీక్షించుచు నిచ్చటనే యుండెదను. ఇచ్చట కూర్చున్న నాకుపానీయమేదైన నొసగగలవా? నేను వత్తునని యామెకు దెలియును. ఆమెయే నన్ను రమ్మన్నది. నేను వచ్చెడివేళ కామె లేకుండుట యామె బదులు ని న్నిచ్చటనుంచుట దీనిలోని యర్థమేమి?" "నాకు తెలియదు." "నేను నీ వంక చూచితివి. నీవు కళవళంపడితివి. నిశ్చేష్టురాల నై తివి. నేను నిన్ను స్పృశింతును. నీ వేగుదువో?" "రాజా! నాకర్థమగుటలేదు. నన్ను స్పృశించుట యెందులకు?" "నిన్ను చూచుట యెందులకు? మొదటిది చూచుట. రెండవది

స్పృశించుట. చూసినప్పు డట్టిదివి కదా! స్పృశించినప్పు డెట్లగుదువో యన్న భావము నాకు కలుగుచున్నది" "నా కప్పుడే భయము వేసినది. ఇప్పుడు మఱియు భయమువేయుచున్నది" "అప్పుడు భయమువేసినది. ఆ భయము వెనుక యొక సుఖమో వాంఛయో భాసించినది." "మాయక్క యిట్లే వ్యాఖ్యానము చేసినది. ఆమెయు మీరును నొక్కబడిలోననే చదివినట్లున్నారు" "ఇది యౌవ నోదయమన్న పాఠశాల. సర్వజీవులు దానియందే చదువుదురు. అందరి చదువునొక్కటియే. విషయమొక్కటియే. చదువులో కొందరు సుకుమారముగా చదవుదురు. కొందరు ముగ్ధత్వముతో చదువుదురు. కొందరు ధూర్తముగా చదువుదురు. కొందరు రాక్షసముగా చదువుదురు. నీది ముద్దరాలి చదువు. అది యట్లుంచుము. నీకిప్పుడెక్కువ భయము వేయుచున్నదికదా! నేను స్పృశించినచో నెక్కువ సుఖమనుభవింతువు. ఎక్కువ కోరికను కలిగియుందువు." అని రాజులేచి యామెను గ్రహింపబోయెను. ఆమె పెద్ద బండనడుమ విసరివేయబడిన తటాకమువలె నయ్యెను. అతడామెను గ్రహించెను. పరిష్వంగము చేసెను. చుంబించెను. కొంతసేపటికామె రాయి విసరివేయుటవలన కలిగిన కెరటములు తగ్గిపోయి చెరువులోని జలము మరల నొక సమస్థితికి వచ్చి, రాయి పడలేదన్నట్లు ఉపరిప్రశాంత జలాకృతి యయ్యెను. ఆమె మాటాడలేదు. రాజెన్ని ప్రశ్నలు వేసినను సమాధానము చెప్పలేదు. రాజు చేతిలో మెత్తని బంతివలె నయ్యెను. ఆమె భయము భయముగానే యుండెను. సుఖము సుఖముగానే యుండెను. రాజు వెళ్ళిపోవలయునని యుండెను. వెళ్ళిపోవునేమోయన్న భయము కలుగుచుండెను. ఆమెకు తన స్థితి తనకే తెలియకుండెను.

రాజునకు గూడ తన స్థితి తనకు తెలియకుండెను. అతడనిశ్చిత మనస్కుడై యుండెను. అది దివావేళ. రాణియొక్క యంతఃపురము. శయ్యామందిరము కాదు. రాణి యీ సన్నివేశమును సమకూర్చెనని యతనికి తెలియును. ఆమె తన సెజ్జమీద తన శిలాప్రతిమ నమర్చెను. అది తన కేమి సుఖము? అందుచేత నామె యీమెను తనకై తెచ్చెను. ఈమె సరిగా తనవంటిది. శరీరవిన్యాస వైభవముచేత, సౌందర్యముచేత, కులీనత్వముచేత, తనయందనురాగముచేత, నీమె యచ్చముగా తన ప్రతికృతి. ఈమె శిలా ప్రతిమకాదు. ఈమె మానవి. ఆమె కాదు. ఈమె ముద్దరాలు. ఆమెకాదు. ఈమె లోకసామాన్యరాలు. ఆమెకాదు. ఈమె ఆమెకాదు. ఇదియేమి సన్నివేశము? ఈమెను తాను వాంఛించుటలేదా? ఆమెను కంటె నెక్కువ వాంఛించుచున్నాడు. అయ్యో! ఈమెనే యేల పెండ్లాడలేదు? తా నీమె నిప్పుడనుభవించినచో నామె యేమనును? ఈమె తల్లిదండ్రులేమందురు? ఇది న్యాయమా? రాజున కేమియు తోచలేదు. ఆమె మహావిద్వాంసురాలై దేవతామూర్తియై తన్నిట్టి క్లిష్టపరిస్థితిలో పెట్టినదేమి? రాజునకు కోపము వచ్చెను. అమృతప్రభకు దూరముగా నిలుచుండి యిట్లనెను : "నీవు కులూత దేశాధిపతి కూతురవు. మీనాయనగారి నడిగి నిన్ను పెండ్లాడెదను. నీపేరమృతప్రభ. నీవు నాపాలిటి యమృతమవు. ఓసి ప్రియురాలా! నిన్నిప్పుడు నేననుభవించగలను. కాని యది ధర్మముకాదు. నీవు నాకు భార్యవు. నిజమైన భార్యవు. బ్రహ్మచేత విధించబడిన భార్యవు. నేను వెళ్ళుచున్నాను. నాకు తెలియును. నేను వెళ్ళినంతనే నీవు దుఃఖపడెదవు. దుఃఖపడకుము. భయపడకుము. నాల్గయిదు దినములలో మన వివాహము జరుగును. ఓసి యమృతప్రభా! నిజముగా నీవు నాకొఱకు జన్మించితివి." రాజు వెడలిపోయెను. అమృతప్రభ రిచ్చపడి యతనివంక చూచుచు నుండెను.

ఆరాత్రిపూట రణరంభ రణాదిత్యుని వద్దకు పోయెను. ఇట్లనెను : "మహారాజా! తమరు కులూత రాజువద్దకు దూతల నంపనక్కరలేదు. నేనిదివరకే వారికి వార్త పెట్టితిని. వారు రేపు ప్రొద్దుటికో రేపు సాయంకాలమునకో నిచ్చటికి వత్తురు. రాచకుటుంబమంతయు వచ్చును. వివాహపరికరములతో వత్తురు. ఎల్లుండి మంచి లగ్నము. అమృతప్రభకును మీకును వివాహము జరుగును. మహారాజా! మీ యౌదార్యమునకు, మీ యౌదాత్త్యమునకు, మీ ధర్మబుద్ధికి, మీ క్షమాశీలమునకు నేనెంతయు సంతోషించుచున్నాను. నేను తుచ్ఛునికొఱకు జన్మమెత్తలేదు. మహాసుగుణవంతుని కొఱకు యెత్తితిని. నా యనుగ్రహ మహాత్రన్యస్తము కాలేదు. రాజా! నేను నీయందు దయవహించుచున్నాను." అని రణరంభ వెడలిపోయెను. రాజు నివ్వెరపోయెను.

మఱునాటి ప్రొద్దుటికే కులూత దేశాధిపతి సకుటుంబముగా సవివాహ పరికరముగా వచ్చెను. ఆ మరునాడు వివాహము జరిగెను. పెత్తనదారు తనమంతయు రణరంభచేసెను.

ఆ మరునాటి రాత్రి అమృతప్రభా రణాదిత్యులు తచ్ఛుభము కొఱకు వేఱ నిర్మింపబడిన గుడారములో నర్ధయామము దాటిన తరువాత కలసికొనిరి. పానుపులేదు. అనగా పాటలు నాట్యములు లేవు. చెండ్లాటలు గంధపూతలు తమలపాకులు కొఱుకుటలు లేవు. రాజు మంచము మీద పరుండియుండెను. అమృతప్రభ ద్వారము వద్ద నిలచియుండెను. రాజు వచ్చి "ఓసి అమృతప్రభా! నీవు మంచము మీద పండుకొనుము. నేను ద్వారమువద్ద నిలుచుందు"ననెను. అమృతప్రభ తనబాహువులు భర్తృకంఠము నందలంకరించెను. అమృతప్రభకు స్మృతిలేదు. ఆ స్పర్శసుఖములో నామె కొడలు తెలియలేదు. రాజు మెత్తని లత్తుకతో చేసిన బొమ్మవంటి పెండ్లమును పాన్పు మీదికి చేర్చెను. స్పర్శమాత్రమున నింతటి పరమసుఖమును భజించెడి భార్యతోడ సంసారము చేయుట ఎట్లు? లోకములో భార్యలతో సంసారము చేసి యామెకు పరమసుఖమును కలిగించవలయును. ఈమెను పరమసుఖమునుండి దింపి, ఈమెతో సంసారము చేయవలయును.

# తృతీయభాగము

## ప్రథమాధ్యాయము

### 1

కాశ్మీరము చేరినంతనే రణాదిత్యుడు పట్టమహిషియైన రణరంభకొక యంతఃపురము, చిన్నరాణియైన యమృతప్రభకొక యంతఃపురము నేర్పాటు చేసెను. రణరంభ రాజమృతప్రభ నెక్కువగా చూచి తన్ను తక్కువగా చూచుననుకొనెను. అమృతప్రభనే పట్టమహిషిని చేయుననుకొనెను. తనకు పట్టమహిషీత్వము లేదు, ఏమియు లేదు. ఇచ్చినచో నొక గౌరవస్థానము నిచ్చును. అంతఃపురములలో నుంచును. ఏదైనను హితము కావలసినచో నడుగును. మొదలైన భావనచేసెను. రాజు సర్వదా యమృతప్రభతోనే యుండును, తన దగ్గరకు రానేరాడు, నిజానికి రావలసిన యవసరములేదు. అంతిపురములో, కోటలో, రాజ్యములో- రణరంభను వివాహమాడెనే కాని యామెకు నితనికి నేమి సంబంధము లేదని చెప్పుకొనునట్లు చేయును. ఆమె

యీ మొదలైన భావన చేసెను. తొలుత వారిరువురు కాశ్మీరములలో ప్రవేశించినప్పుడు కాని, ప్రయాణించినప్పుడు కాని, శ్రీనగర ప్రవేశము చేసినప్పుడు కాని యెక్కువగా రాజా తన భార్యలకు మేలిముసుగులు, జనులు వారిని చూచుటకు వీలులేనితనము చేయలేదు. రాణివాస స్త్రీల మర్యాదలు నెరపుచునే యుండెను. జనులకు రాణుల నిద్దరును చూచుట కవకాశమును కలుగుచునే యుండెను. అమృతప్రభా రణరంభ లిద్దఱును దివావేళల నంతటను కలసియే యుండుచుండిరి. అమృతప్రభ కంటె రణరంభ కొంచె ముదాత్తమైన మూర్తి. తక్కిన బేధమేమియు లేదు. మొగముల యందు గూడ నెక్కువ పోలిక కనిపించు చుండెను. రణరంభను విడిగా చూచినచో నామె యందున్న మహాసౌందర్యము మాత్రమే గోచరించెడిదేమో! ఇద్దఱు నొక్కచోట నున్నప్పుడు సౌందర్యమంతయు నమృతప్రభయందు గోచరించు చుండెను. రణరంభ యందు సౌందర్యమును మించిన యొకానొక లక్షణము కనిపించుచుండెను. అది యధిక దీప్తియో మహిమయో యేదైన దేవతాలక్షణమో! ఆమెను చూచినంతనే జనములకు గౌరవము కలుగు చుండెను. ఆమెను కన్నెత్తిచూచుట యపచార మనిపించు చుండెను. కాని యమృతప్రభ మాత్రము నేత్రములకు చల్లనై హృదయముల కాహ్లాదకారియై రాణి యన్న శబ్దమునకు వాచ్యతాభూమియై యుండెను. ఇద్దఱు రాణులు వచ్చిన తరువాత కోట కోటయంతయు తళతళలాడి పోవుచుండెను. ఒక నూతన భాగ్యము నూతన మైన శోభ నూతనమైన యుత్సాహము. లక్ష్మి తమ కోటలోనికి యొడ్డిగిలిన దనిపించెను.

మానవునిది శరీరము. ఈ శరీరమునకు కొన్ని భోగములు కలవు. అందులో నుత్తమమైన భోగము పురుషునకు స్త్రీ సంభోగము. ఆ భోగము రాజున కమృతప్రభ వద్ద నున్నది. అందుచేత రాజా రణరంభవద్దకు పోనక్కరయేలేదు. కాని రాజా యెదలో నొక భావము మెదలుచున్నది. ఆ భావము కృతజ్ఞతామయము. రణరంభయొక్క దయలేనిచో తన కమృతప్రభయొక్క లాభము కలిగెడిది కాదు. రణరంభయే యామెను సంతరించెను. తాను మహాదేవి. రాజా సామాన్యమానవుడు. దేవతలకు మానవులకు సంసర్గము కుదరదు. ఒకవేళనట్టి సంసర్గము కలిగినచో మానవుల శరీరములు నిలుచునో నిలువవో? వారి భాగధేయములు పుష్పించునో, భస్మీభూతమగునో? దేవతలు వరము లిచ్చెడివారేకాని భార్యలవలె వచ్చి నీ యింటిలో పనిచేసెడివారు కాదు. శయ్యామందిర మున నీకు భోగానుభవము సంపాదించిపెట్టెడివారు కారు. ఆ దేవి యెందుకో తనయం దనుగ్రహము నెరపినది. ఎందుకో తనకు భార్యయైనది. లోక సామాన్యమైన భార్యాత్వము కుదరదు. అందుచేత లోక సామాన్యురాలైన భార్యను కుదిర్చినది. తన వెంట తెచ్చినది. తలచుకొన్నకొలది నా సన్నివేశములన్ని చిత్రములుగనే యున్నవి. కులూతరాజా తన కూతును రణరంభవెంట పంపుట జరుగునా? రతిసేనమహారాజా రణరంభకు వివాహము చేయుమని యెంత స్నేహితుడైనను కులూత దేశమునకు పంపుటయేమి? ఎచటనైనను తండ్రులు కూతుండ్రకు పెండ్లిచేయుదురు. పెఱ చోట్లకు పంపించుట సంభవించదు. సంభవించెనుబో, తల్లిదండ్రులు కూడ వత్తురు. కన్యాదానము చేయుదురు. కాదా ఎవరికైనను దత్తత యిచ్చుట యున్నది. వారు పెండ్లిచేయుటయు నున్నది. తల్లిదండ్రులచ్చముగా రాకపోవుటలేదే? పైగా దత్తత యెవరికిత్తురు? పిల్లలు లేనివారడిగినచో నిత్తురు. వారు బంధువులైనచో నిత్తురు. స్నేహితులైనచో నిత్తురు. ఆ యడిగినవారికి సంతానము లేకుండ నుండవలయును. కులూతరాజానకు ముగ్గురు

కుమారులు, ముగ్గురు కుమార్తెలు. తండ్రికూతునకు పెండ్లిచేసికొనలేని వాడైనచో బంధువుల పిల్లను తెచ్చి తమ ఇంటిలో పెండ్లిచేయుటకలదు. వారిద్దరి మధ్య నీ పరిస్థితులలో నొక్కటియులేదు. ఇంకనొక్కటి కనిపించుచున్నది. కాశ్మీరములకు చోళ దేశము మిక్కిలి దూరము. తనకూతురీ కాశ్మీరాధిపతినే కోరెను. కాశ్మీరాధిపతి ఇంత దవ్వు తరలివచ్చుటయనగా నెంతయో కష్టము. అల్లునకింత కష్టము కలిగించుట యెందులకని సమీపదేశమైన కులూత దేశమునకు పంపెను. ఈయొక్క కారణము సరిపోవునా? ఇది మొదటి విడ్డూరము. రణరంభ కులూత రాజాంతఃపురమున నెల యున్నదో పదునేనుదినములున్నదో. ఒక క్రొత్తబాలిక మరియొకచోటి కేగిన తరువాత చనువేర్పడుటకే కొన్నిదినములు పట్టును. వారును వీరును బెరుకు బెరుకుగా నుందురు. అందులో రాజవంశములలో నెవరి భవనములు వారివి. కావలసినవన్నియు పరిచారికలు చేయుదురు. చనువు కలుగుటయే కష్టము. ప్రేమలు కలుగుటయే కష్టము. వ్యవహార మంతయు పరస్పర గౌరవముల మీద మర్యాదలమీద నాచారములమీద సాగుచుండును. అట్టిస్థితిలో రణరంభ రాజభార్యమీద, చెల్లెండ్రమీద, నింత యధికారమెట్లు సంపాదించెను? ఈ బాలికను తన వెంట పంపుమనగా వారు పంపుట యచింత్యమైన విషయము. ఒకవేళ చనిపోయిన సైనికులను బ్రతికించెను. గాయపడినవారికి శాంతి సమకూర్చెను. మూలనున్న ప్రతిమను తెచ్చి తన పానుపుమీద పరుండబెట్టెను. ఇవి యన్నియు దేవతామహిమ కానిచో నింద్రజాలము కావచ్చును. కులూత రాజదంపతులు తమ వివాహముకాని పిల్లను రారాజుయొక్క స్నేహితుని బలవంతముచేతనో, మొగమాటము చేతనో తన యింటిలో పెండ్లిచేయుటకు తీసుకువచ్చిన పిల్లవెంట నామె యత్తవారింటికి నామెతో పంపుట నిది యింద్రజాలము మాత్రము కాదు. మచ్చుచల్లినన వలయును. కనుకట్టు కట్టుటకాదు. అది సుంత సేపులో విడవడును. మచ్చుచల్లుట కాదు. మచ్చుచల్లుట నిద్రాళువులైన వారిమీద జరుగును. ఈ పద్ధతి యెట్లున్నదనగా నొక మానవాతీతమైన శక్తికలిగిన యోగినియో దేవతయో మానవ హృదయములను వశపఱచుకొన్నట్లున్నది. ఇది రెండవ యాశ్చర్యము. నదీతీరమున తన కామె కనుపించునట్లు చేసినది. ప్రేమ యంకురింపజేసినది. దోహదము చేసినది. పండించి నది. ఏకాంత సమాగమము సమకూర్చినది. అంతయు తాననుకొనినట్లే జరిగితీర వలయునని యామెకు తెలియును. ఆమెయే వార్త పంపినది. కులూత రాజ కుటుంబము వివాహము నెరపుటకు మరునాటికి వచ్చెను. ఇదియంతయు మాయగా నున్నది కాని మరియొక విధముగాలేదు. అన్నిటికంటె నబ్బురము కొలిపెడి విషయము రణరంభయు నమృతప్రభయు నొక తల్లికడుపున పుట్టిన బిడ్డలుకారు. ఒక తండ్రి సంతానముకాదు. కవలపిల్లలుకారు. ఈ రూపసామ్యమెచ్చట నుండి వచ్చినది? మానవ ప్రపంచకమున తత్ర తత్ర రూపసామ్యము దృశ్యమానమగుచున్నది. ఎంత రూప సామ్యమున్నను విభేదలక్షణ ములుండును. నిదానించి చూచినచో విభేదము నిస్సంశయముగా తెలియును. రణరంభాదేవి యొక్క మొగమునందలి దేవతాదీప్తిని తొలగ బెట్టినచో వారిద్దరిమధ్య భేదమేలేదు. రాజునకొక్కటి తోచెను. ఈ రణరంభాదేవి లక్ష్మీ దేవియే. ఆమెపేరు భ్రమరవాసిని. ఈ భ్రమరవాసిని యన్నపేరు తాను పెట్టెను. తాను పెట్టెననుటకంటె తనకు స్ఫురించెననుట యుత్తమము. ఎందులకు స్ఫురించెనో! పెండ్లి పీటలమీద మంగళసూత్ర బంధనమువేళ నెవ్వతయో వచ్చి కూర్చుండెను. అప్పుడు భ్రమరీనినాదము వినిపించెను. భ్రమరదర్శనము కలిగెను. ఈమె భ్రమరవాసిని

యనిపించెను. ఈయనిపించుటయేమి? పోనిమ్ము. తాను నాకు భార్యకాబోవుచున్నది. మా యిద్దరకు శరీర సంపర్కముండదు. ఆమె సౌందర్యదర్శనము చేసిన తరువాత నామె యందు వాంఛకలుగకుండదు. దేవతలయందు పురుషులకు వాంఛకలిగినచో రెండు మార్గములు. ఆ దేవత వానిని సంహరించుటయో, వాని నింకొక విధముగా పాలించుటయో? భండముండాసురులను భద్రకాళి సంహరించినట్లు సంహరించవలయును. పరమేశ్వరీగత కామువాంఛ యెవ్వని కుదయించును? సర్వనాశనహేతుక జన్మ కలిగిన వాని కుదయించును. ఆ దేవికి వానియందనుగ్రహము కలిగెను. వానిని పెండ్లిచేసుకొనునా? అవును. పెండ్లిచేసికొనెను. మరి వానితో సంసారము చేయునా? ఇది చాల విచిత్రముగానున్నది. దేవియనగా నెవరు? నిర్గుణమైన గుణాతీతమైన సచ్చిదానంద స్వరూపమైన ప్రపంచాతీతమైన సర్వజగద్వ్యవహార పరిపాలనా దక్షమైన సర్వజగన్నిర్మాణశీలమైన సర్వజగదహినేత్రుకమైన బ్రహ్మ పదార్థమున్నది. అందు సంకల్పము జరిగినది. హిరణ్యగర్భాదులు సృజింపబడిరి. సృష్టి జరుగవలయుననగా, నది స్త్రీ పుంసాత్మక యోగాత్మకమై యుండవలయును. ఆ బ్రహ్మ పదార్థమే- సంకల్పము చేసిన భాగము, సృష్ట్యభిముఖమైన భాగము, తనలో తాను పురుష లక్షణములను స్త్రీ లక్షణములను బీజాత్మకములుగ, పరిణామ వికాసగుణ సహితములుగా, తనలో తానే చెరిసగముగా సర్వసృష్టియు సంకల్పాత్మకము కనుక సంకల్పించికొని సృష్టించికొని మహాణుస్వరూపముగా నుండెను. ఈశ్వరభావము పొందినప్పుడు పురుషత్వము బ్రహ్మవిష్ణు మహేశ్వరమయముగా, స్త్రీత్వము లక్ష్మీపార్వతీ సరస్వతీ రూపముగ వికసించెను. బ్రహ్మచైతన్యము తాను కల్పించుకొన్న సంకల్పదోషముచేత యాత్మారామ లక్షణముచేత, యోగులు తమయందు తామే రమించినట్లు స్త్రీ పురుషలక్షణముచేత పరమేశ్వరుడు తనయందు తానే రమించుచున్నాడు. అక్కడి రమణలక్షణము వట్టి తేజోమయసంయోగము. దీప్తికణ సన్నికర్షణము. ఆనందబిందు సంకలనము. ఇంచుమించుగా నాత్మారామలక్షణము వంటిదే. అంతటితో సరిపోలేదు. జీవసృష్టి ప్రారంభించినది. బ్రహ్మచైతన్యలక్షణము చెడిపోకుండ నున్నచో జీవసృష్టి యెందులకు? జీవసృష్టి యనగా మోహము. యధ్యాస ప్రధానమైన విషయ పరిజ్ఞానము మాని, అప్రధానమైన విషయముయందు రమణముల స్త్రీ పురుష విభేదము జరిగినది. విభిన్న సృష్టి సాగినది. స్త్రీపురుష సంయోగము తత్త్వమునుండి విడిపోయి యొక మోహభావముతో శరీరగత వాంఛతో కొనసాగినది. మానవుల వాంఛయిది. వారి సంభోగమిది. వారియానందమిది. దేవతల దిదికాదు. దైవముల లక్షణమిదికాదు. వారు జీవలోకము నను గ్రహించుటకు స్త్రీపురుషాకృతుల వహించిరి కాని వారిక శరీరములు లేవు. వారియాకృతులు పంచభూతాత్మకములు కావు. తేజోమయములు. భావనామయములు. పంచ భూతాత్మకమైన శరీరములు కల మానవులకు తేజమయాకృతులైన దైవములకు సంయోగమెట్లు కలుగును? అది యెట్లుండును? గాలిని కౌగలించుకొన్నట్లుండునా? అగ్నిని త్రాగినట్లుండునా? సముద్రము పట్టినట్లుండునా? భాగవతమున శ్రీకృష్ణదేవుని బాల్యక్రీడలలో భగవంతుడు దహనార్చిని మ్రింగినట్లుండెను. దహనార్చిన మ్రింగుట యేమి? అగ్నికట్టె పుల్లల నాశ్రయించి యుండును. లేదా యింధనము నాశ్రయించి యుండును. ఇంధనేతరమైన స్థితి యగ్నికిలేదు. శ్రీకృష్ణదేవుడు జ్వాలలను మ్రింగెనా? అగ్నిని సేంధనముగా మ్రింగెనా? అడవిలో మండుచున్న కట్టెలనన్నింటిని చెట్లనన్నిం టిని మ్రింగెనా? అక్కడ నట్లు లేదే? జ్వాలారూపమైన వహ్నిని మ్రింగినట్లున్నది. మ్రింగెనుపరే.

కట్టెనిప్పు కట్టెనిప్పుగానే యున్నది. అడవిలోని వృక్షములు నిప్పురగుల్కొనుచున్న కాష్ఠములవలె నుండెనా? భగవంతుడు దహనార్చిని మ్రింగెననగా సర్వప్రాణమును మ్రింగెనని యర్థము. శిలా సంఘర్షణముచేత నగ్ని యుత్పన్నమగును. అగ్ని యెచ్చటినుండి వచ్చినది? ఆ శిలలయందంతర్హితమై యున్నదా? అంతర్హితమైయున్న యగ్ని కగ్నిత్వము లేదా? దాని కగ్నిత్వము కలుగుటకు యోగ్యమైన వేరే యింధనము కావలయును. పదార్థములయందగ్నియుండి యదివెలికివచ్చి యింధనత్వ లక్షణము కలిగిన యన్యపదార్థాశ్రితమై దాని సాయమునతో నితరములను దహించుచున్నది. దీనియందే సృష్టి లక్షణము చూడవచ్చును. పదార్థములయందగ్ని యెట్లువచ్చినది? శిలయందెట్లగ్ని సన్నిహితమైయున్నది? శిలలు లేనిచో నగ్నియేమగును? అగ్నియున్నది. ఈమూలయే పదార్థము. అట్లే బ్రహ్మపదార్థమున్నది. అగ్ని పదార్థగతమైయున్నది. చైతన్యము జీవగతమైయున్నది. అగ్ని యింధనాశ్రితమై దహనశీలమగుచున్నది. జీవుడు శరీరగతుడై కామక్రోధాది విడంబనము చేయుచున్నాడు. దేవతామానవ విభేద పరిజ్ఞానమిట్టిది. ఈయగ్ని దహనశీలము. ఆయగ్ని వట్టి పదార్థము, ద్రవ్యము. దేవతలు దైవములు వట్టి జ్ఞానస్వరూపులు. మానవులు భోగలక్షణము కలవారు. వారికి వీరికి సంయోగమెట్లు? మానవుని మోహమంతయు శరీరమందు సౌందర్యమందు. ఆమెయొక్క శరీరము తగ్గతమైన యొక సౌందర్యమును రణరంభాయూపమున వెలయింపజేసినది. అది వెలయింపు. నిజముకాదు. నాకు దానియందు వ్యామోహము. అందుచేత సరిగా సృష్టి లక్షణములే కలిగిన యమృతప్రభను సృష్టించినది. ఈమెయు శరీరము. దేవి నన్నిట్లనుగ్రహించినది. అందుచేత రణాదిత్యుడు పదిదినములు రణరంభయొక్క యంతఃపురము, పదిదినము లమృతప్రభాంతఃపురము.

# 2

సంస్కృత భాషలో స్థిరాదరిద్రుడని కవియొకడున్నాడు. అతడు వ్రాసిన దొక్కటే శ్లోకము. ఆ శ్లోకమును బట్టియే యతని కాపేరు వచ్చినది. అతని నిజమైన పేరేమియో తెలియదు. అతడింకొక శ్లోకమును వ్రాసినట్లుగాని వేరే కవియైనట్లుగాని యేమియు తెలియదు. అతడు చాల శ్లోకములు వ్రాసి యుండవచ్చును. ఉన్నవిని చున్నవిని కావచ్చును. వానికి పేరు ప్రతిష్ఠలుండవు. నేటికి కోటికొక్కడో యొక మంచి పద్యమును వ్రాయును. దానితో వానికి పేరువచ్చును. వానికి పేరువచ్చుననుటకంటె ఆ శ్లోకమునకు పేరువచ్చుననుట మంచిది. ఆ శ్లోకమో ఆ పద్యమో భాషలో నిలచిపోవును. ఆ కవి నిజముగా కవియైనచో వేరే గ్రంథములు వ్రాయును. ఆ గ్రంథములు నీ పద్యము వలన వచ్చిన పేరుతోడనే నిల్చును. భవభూతియన్న పేరిట్టియొక శ్లోకమునందలి చమత్కారము చేతనే వచ్చినది. నిజముగా భవభూతి పేరు శ్రీ కంఠుడు. శ్రీ కంఠుడన్న నిజమైన పేరు మాసినది. ఒక పద్యములోనున్న సుకుమారమైన భావనచేత వచ్చిన భవభూతియన్న పేరు నిలచినది. "స్థానాద స్మాత్సరస నిచులాత్" అని కాళిదాసు పేర్కొన్న నిచులకవి పేరుకూడ టిదుదమే. భవభూతియితర గ్రంథములు వ్రాసెను. నిచులుడేమి వ్రాసెనో తెలియదు. ఎట్లైనను సంస్కృతభాషలో నున్న మహిమ యేమనగా రసవంతమై భాసనానిష్ఠమైన యొక్క